# పుత్రవతి

మహాదేవశాస్త్రి జోషీ కథామాల

అనువాదం:
శ్రీ జగన్నాథ్

విశాలాంధ్ర ప్రచురణాలయం
విజయవాడ - 4

## ఇందులో

| పేరు | | పేజీలు |
|---|---|---|
| పుత్రవతి | .... | 7 |
| స్వప్నభంగం | .... | 29 |
| గోపి | .... | 48 |
| మొగలిపువ్వు | .... | 75 |
| దూరమైన ప్రాణి | .... | 96 |
| భవతీ భిక్షాం దేహి | .... | 120 |

# మనవి

ఆధునిక మహారాష్ట్ర సాహిత్య చరిత్రలో పండిత మహాదేవశాస్త్రి జోషిగారి స్థానం అగ్రశ్రేణి లోనిది. ఆయనవి సుమారు 150 కథానికలు అచ్చుయాయి. ప్రతి కథలోనూ ఏదో ఒక ప్రత్యేకత వుంటుంది. ప్రస్తుతం మన దేశంలో సనాతన అధునాతన సంస్కృతుల సంఘర్షణవల్ల ఏర్పడు తున్న సాంఘిక వైయ్యక్తిక సమస్యలే ఈయన వ్రాసే కథలలో బీజాక్షరాలు. ఈ సమస్యలు భారతదేశంలో వున్న ప్రజలందరికీ అందు బాటులో వున్నవీ, అనుభవంలోకి వచ్చినవీని. ఇంతేగాక, మహాదేవశాస్త్రి గారిది అపూర్వమయిన శిల్పము. ప్రతికథలోనూ ఒక్కొక్క పంథా తొక్కారు.

అందుచేత కొన్ని కథలు తెలుగులో తర్జుమా చెయ్యటానికి సాహసించాను. మాతృకలోని ఉత్కృష్టత పూర్తిగా తీసుకరాలేక పోయానని నాకు తెలుసు. కొన్నిచోట్ల తెలుగువాక్యం వలసపోయినవాక్యంగా వున్నట్లూ తెలుసు. అందుకు చదువరులు క్షమించెదరుగాక. ఆలోపం నాది. ఇంత కంటె అనువయిన, సరళమయిన ధోరణిలో మూలంలోని భావం తెలుగులో తీసుకురాలేక పోయినందుకు నేనే బాధపడుతున్నాను. కాని నాకున్న

సామర్థ్యం యింతే. అయినప్పటికీ, అనువదించటానికి ఎందుకు సాహసించా నంటే, కథలలోని భావాలూ. శిల్పమూ, ప్రతిభా నా లోపాలని అధిగ మించి ప్రకాశింపగలిగిన పటుత్వం గలవి.

ఈ కథలు చదివిన తరువాత. పాఠకులు ఎక్కువగా పశ్చాత్తాం పడకుండావుంటే. నేను కృతకృత్యుణ్ణయాననే భావించుకుంటాను. లోపాలను నాకు ఆపాదించి, మహాదేవశాస్త్రిగారి సామర్థ్యమును లోకం గ్రహించితే నేను కృతార్థుణ్ణయినట్లే.

మద్రాసు.
15, అక్టోబరు 1963.

— జగన్నాథ్.



# 7

# పుత్రవతి

"ర్యహా(....ర్యహా(ఉఉర్యహాంఉఉఉ" చ్చొ చ్చొ చ్చొ ఎంతగా ఏడుస్తావురా నాయనా! చాల్లేదూ ఇంక కడుపు నిండలేదా యేంరా? అయితే మరి ఆ పాలబుడ్డి వదిలిపెట్టేశావేం? పాలు వేడిగా ఉన్నాయా? మరీ చల్లబడిపోయాయా? నా కవి ఏ పాళంలోవుండాలో తెలియకపోయే, నాకు అజ్ఞానమూ, నువ్వు మూగా. చక్కటి జంటే కుదిరాంరా మనం! నీమీద నా కెంతయినా ప్రేమవుంది కాని నీ మనస్సులో దూరటం మాత్రం నా చేతకావటం లేదు. నీదీ నాదీ ఒకటే జాతి అయిపోయింది. మగజాతి అంచేతనే ఈ చిక్కొచ్చింది. నా పోషణ నీకు తృప్తిగా లేదని నాకు తెలుసు ఏరా పెద్దమనిషీ: ఇంత దురదృష్టవంతుడిగా పుట్టమని నేను చెప్పానా మరి?

ఊరుకున్నట్టే ఊరుకుని మళ్ళీ వెంటనే మొదలుపెట్టావా? ఒరేయ్! అలాగ ఉండుండి గొంతుక చించుకుంటే ఎలాగరా! అమ్మకీ – నాన్నకీ మధ్య చాలా తేడావుందని నువు తొందరగా తెలుసుకోవాలి సుమా! ఈ ఏడుపు సరదాఅంతా అమ్మదగ్గర తీర్చుకోవాలి: నా దగ్గరమట్టుకు నీకేం కావాలసినా అడిగి తీసుకో; తినడానికి అడుగూ. గోళీలు కావాలని అడుగూ; అంతేకాని ఆ ర్యహా(....ర్యహా( మాత్రం నామీద ప్రయోగించకు.

ఛ ఛ ఛ, నువ్వెక్కడికి వింటావురా! ఇంద, ఈ పాలబుడ్డి పట్టుకో, ఊఁ వద్దూ? పోనీలే, అదిగో ఆ చందమామ చూడు! దాని ప్రక్కనున్న నక్షత్రం చూశావా ఎల్లా మెరుస్తోందో. మీ అమ్మలాగ, చూడవూ? పోనీలే, నిద్రపో. మరైతే, నేను ఉయ్యాలలో ఉంచి ఊపుతాన్లే. కాని నాకు జోలపాటలు రావురోయ్! ఆఁ! నీ క్కావలిస్తే "ల్చ ల్చ ల్చ ల్చాహాయీ" అంటాను అంతే. "శ్రీరామరక్ష" అంటాను కూడా, అదే జోలపాటనుకో. ఏం. "ల్చ ల్చ ల్చ ల్చాహాయీ ఉఉఉ...."

ఏఁవిట్రా అదీ? ఏమిటి అలా చించుకుంటావు? పక్క తడిగా ఉందా ఏమిట్రా? నిన్ను పడుకోపెట్టేముందర పక్కంతా ఓసారి చేత్తో తడిమి చూడాలి కాబోలు! నా కంతమాత్రం ఇంగితం ఎక్కడిదిరా? యిహ మనం యిల్లాగే గడుపుకోక తప్పదు. నువ్వే కాస్త అలవాటుపడి సర్దుకుపోవాలి. నీకో చిన్న అక్కయ్య ఉంటే ఎంతో బాగుండేది కదూ? నువ్వే తొలిచూలయావు మరి? ఆ పుట్టటానిక్కూడా యింత తాత్సారం ఎందుకు చేశావురా? తల్లిని యిన్ని సంవత్సరాలు పిల్లలకోసం బెంగపెట్టుకునేలాగ చెయ్యడం బాగుందిరా నీకు? మరీ అంత మూర్ఖం అయితే ఎలాగరా? ఇంటిల్లిపాదిమీ నీ పుటకకోసం పరితపించిపోయాంగదా! మా అమ్మ మంచాన్ని పడికూడా మనుమడి ముఖం చూడాలని, మహా పట్టుదలతో కొన్ని సంవత్సరాలు ప్రాణాలు ఉగ్గబట్టి, ఆఖరికి, ఆ నిరాశనే మూటగట్టుకొని దారి బత్యంగా తీసుకుని చక్కా పోయింది. అప్పుడు యిహ మేం యిద్దరమే మిగిలాం-నేనూ, మీ అమ్మానూ! నా కెప్పుడయినా యింకో మనిషి ముఖం చూడాలనిపిస్తే, లేచి వంటింట్లోకి వెళ్ళేవాణ్ణి. దాని కెప్పుడయినా, తనకి యింట్లో మగదిక్కు ఉందని రూఢిచేసుకోవా లనిపిస్తే, ఓసారి సావిట్లోకి వచ్చేది.

నే ఊళ్ళోకి వెళితే ఒక ఏడెనిమిది గంటలు నిశ్శింత దానికి. ఈ ఏడెనిమిది గంటలూ ఎలా గడిపేపోమాత్రం తెలుసుకోవడం కష్టం! ఏదయినా పుస్తకం చదువుకునేదేమో అంటే, చదువుతూన్న పుస్తకంలో ప్రొద్దున్న 2వ అధ్యాయములో పెట్టిన తాటాకు గుర్తు అక్కడే ఉండేది, సాయంత్రానికి కూడా. పోనీ సుఖంగా నిద్రపోయిందేమో అనుకోవడానికి

కళ్లు ఎఱ్ఱగా బరువుగా ఉండడం అనేకసార్లు గమనించాను. నే (యింటికి) వస్తూండడం చూడగానేమాత్రం ముఖం సంతోషంగా పెట్టుకోవాలని ప్రయత్నించేది. కాని అది బలవంతంగా తెచ్చిపెట్టుకున్న వెన్నెల. నాకప్పుడే తెలిసిపోయేది. జాజిమొగ్గ దానంతట అది వికసించవలసిందే గాని, వేళ్ళతో రేకులు విప్పి పువ్వు చెయ్యగలంరా నాయనా! మీ అమ్మ ప్రకృతి నా బుద్ధికి ఒక పరీక్షప్రశ్నలాగా ఉండేది. అది నా జీవితం అంతా. నేను పూర్తిచెయ్యలేని ఒక సమస్యగా ఉండేదిరా. దానితో కాపురం తేనెలాగ తియ్యగా ఉండేది. చింతకాయలాగా పుల్లగానూ ఉండేది. పదిహేనేళ్ళు సంసారం చేశాను దానితో. ఆ రోజుల్లో ఒక్కొక్కప్పుడు పూవుకంటే తేలికగా ఉన్నానేమో అనిపించేట్టు చేసేది. మరుక్షణంలో సీసంకంటే బరువయిపోయానేమో అనిపించేది!

దాని స్వభావం ఒక జీవనది వంటిది. వరద వచ్చినప్పుడు వంద్రుడుతో చిక్కబడిన నీళ్ళతో దూసుకుంటూ, దూసుకుంటూ ఎవరినీ లెక్కపెట్టకుండా కొట్టుకుపోయేది. మళ్ళా శరత్కాలం రాగానే ప్రసన్నంగా నిర్మలంగా మన ముఖాల్ని తన హృదయంలో ప్రతిబింబింప చేసేది. ఒక్కొక్కప్పుడు ఒక వారానికి, వారం పొడుగునా దాని గంభీరమయిన మౌనం సహించి పూరుకునేవుండే వాణ్ణి. మళ్ళీ ఏదో ఒక సుమూహూర్తాన అది మందహాసం ధరించి వికసించినప్పుడు యిల్లూ వాకిలీ పరిమళించి పోయేది చైతన్యంతో ఆనందంతో. అటువం టప్పుడు పెంపుడు చిలకలాగా నా చుట్టూ ఎగురుతూ, నాతో కూడా తిరుగుతూ, కాలక్షేపం చేసేది. నా భవన సాగరంలో ఒక శృంగారించిన నౌకలాగ ఉండేది!

నిజానికి దాని విషాదానికి హద్దూ ఉండేది కాదు, ఉల్లాసానికి అంతూ ఉండేది కాదు!

ఎంతటి చిన్న విషయమయినా సరే, చటుక్కున అంగీకరించటం గాని, సులభంగా త్రోసివెయ్యటం గాని దానికి చేతనయేది కాదు. ఇంట్లో సంగతయినా, ఊళ్ళో వృత్తాంతమయినా ఎంతో గంభీరంగా ఆలోచించేది. ఎంత అల్పమయిన విషయమయినా సరే, దాని ఆరా తీసి, ఆమూకీ తీసి తిరగా బోర్లావేసి, తీరికగా పరిశీలించి గుండెల్లో పెట్టుకుని

ఖిగించేసేది. అదే ఆలోచిస్తూ రాత్రింబవళ్లు తికమకపడేది. తనని తన్ను తబ్బిబ్బు చేసుకుని, ఎదటివాళ్ళని కూడా ఎంగిరిపడలేనంత నెమ్మదిలేకుండా చేసేది. ఏపూట ఏ విషయాన్ని గురించి మనసు పాడుచేసుకుంటుందో ఆ బ్రహ్మకూడా చెప్పగలిగి ఉండవాడు కాడు. "నీ పెళ్ళాన్ని అర్థం చేసుకోవటం మా చెడ్డ కష్టంరా బాబూ" అన్న పల్లవి పాడుతూనే, మా అమ్మ వెళ్ళిపోయింది!

నిజం చెప్పాలంటే దాని స్వరూపంయొక్క రహస్యం నాకు తెలియనేలేదురా: నా చిన్నీ, నువ్వు కనుక కొంచెం సరిఅయిన సమయంలో పుట్టివుంటే దాని స్వభావం అంత ఒంటరితనంగా ఉండేది కాదేమోరా: అది నీమీదే ధ్యాస పెట్టుకుని ఉండేది. నువ్వు లేని బ్రతుకు గడ్డిపోస కంటే హీనమని అనుకునేది. నా స్నేహితులెవరయినా, సకుటుంబంగా యీ యింటికి వచ్చినప్పుడు, వాళ్ళ ముద్దొచ్చే పిల్లవాడెవరయినా చంకదిగి, సావడి అంతా తిరుగుతూంటే, దాని సంబరం దాచుకో కలిగేది కాదు. ఆ మర్నాడు మళ్ళీ ఆ పిల్లాడు తల్లి చంకలోంచే నమస్తే అని చెప్పి, ఆ కుటుంబం అంతా వెళ్ళిపోగానే, దాని ముఖం మారిపోయేది. ఆ మరుక్షణంనుంచీ తన దురదృష్టాన్ని గురించి దుఃఖిస్తూ ఉండేది. ఆ రోజు రోజంతా అది మనలో ఉండేది కాదు.

అటువంటి సందర్భాల్లో ఒక్కొక్కప్పుడు నాకు తలకాయ నొప్పేసుకు వచ్చేది. నేను దాని దుఃఖం పోగొట్టి ఏదో ఓదార్చాలని ప్రయత్నించేవాణ్ణి. అది ఫలించకపోతే, కోప్పడే వాణ్ణి. తక్షణం ఏడుస్తూ కూచునేది. ఇహ నన్ను దగ్గర కయినా రానిచ్చేది కాదు. "మీరు నన్ను ప్రేమించావద్దు కోప్పడా వద్దు. నన్నిలా ఒంటరిగా పడుండ నివ్వండి" అనేది, ఎంతో ఆవేదనతో.

చాలా కాలంగా దానికి గంగాపురం వెళ్ళాలనే వెర్రి కోరిక ఒకటి పట్టుకుంది. ఉపోషాలూ అవీ ఉంటున్నావు. నోములూ, వ్రతాలూ పట్టుతున్నావు. అవి చాలవూ? ఇంకా యీ గంగాపురం వెళ్ళాలని కోరిక ఎందుకే? దత్తాత్రేయులవారు ఆ గంగాపురంలోనే ఉన్నారా ఏమిటి? మన ఇంట్లోనూ వున్నారు, మన హృదయాల్లోకూడా వున్నారు" అనేవాణ్ణి నేను.

"వెళ్ళటం మీ కిష్టంలేకపోతే, దానికి మీ రీ వేదాంతం దుప్పటి మాత్రం కప్పండి. నిన్ను గంగాపురం తీసుకువెళ్ళను అని చెప్పెయ్యండి తీరిపోతుంది."

అంతటితో నా మాటలధోరణి కుంటుపడిపోయేది. పోనీ వెళదామే అనుకున్నా, ఎన్నో అవాంతరాలు వచ్చేవి. ఇవాళ వెళదాం, రేపు వెళదాం అనుకుంటూండగానే, నాల్గునెలలు గడిచిపోయాయి. దాని ఉత్సాహం తాడిచెట్టు ప్రమాణంగా పెరిగిపోయింది. ఇహ ఇంకా బిగిస్తే తెగిపోతుందని నేనుకూడా ప్రయాణానికి ముహూర్తం నిశ్చయం చేయించి సెలవు పెట్టేశాను.

గంగాపురం మేం నిర్విఘ్నంగా చేరుకున్నాం. ఆ క్షేత్రంలో అడుగు పెట్టిన క్షణంనుంచీ అధికారం అంతా దాని చేతుల్లోకే తీసుకుంది. దాని అభిప్రాయం యీ ధర్మకార్యాలూ, దేవతా దర్శనాలూ నాకు బొత్తిగా తెలియనివని.

ఈ యాత్రలో తన శరీరాన్ని ఎంతయినా కష్టపెట్టుకుంది. చేతులూ, కాళ్లు పగిలి బీటలువేసే ఆ మాఘమాసపు చలిలో తెల్లవారక ముందే మంచుతో తడిసిన దారుల్లోపడి, ఆ "భీమా అమరజ" సంగమానికి స్నానానికి వెళ్తూన్నప్పుడు, ఈ దేహాన్నిగురించి ధ్యాసే ఉండెదికాదు దానికి. ఆ ఎత్తైన గట్టుమీదనుంచి నిర్భయంగా నదిలోకి దిగటానికిగాని, ముళ్ళ గోనిండినదారుల్లో నిర్లక్ష్యంగా అడుగులు వేయటానికిగాని ఆ మోకాళ్ళలోతు నీళ్ళల్లో సాంతం సాష్టాంగపడి ముక్కుమూసుకు మునగటానికిగాని ముందూ వెనకా ఆలోచించేది కాదు. స్నానం ముగించి గట్టు ఎక్కీఎక్కగానే దేవాలయానికి దారితీసి, ఆ తడిగుడ్డలతోనే మధ్యాహ్నంవరకూ ప్రదక్షిణాలు తిరుగుతూనే ఉండేది. మధ్యలో ఒక్క క్షణమయినా కూచుని విశ్రాంతి తీసుకోవాలని తోచేదే కాదు. ఆ ఏడెనిమిది రోజులు కూడా ఆ పుణ్యతీర్థంలో ప్రాణాలు నిలుపుకోవాలి గనుకా, ప్రదక్షిణలకి కాళ్ళల్లో సత్తువ ఉండాలి గనుకా ఏవో రెండు మెతుకులు ఎంగిలిపడేది.

ఆ రోజుల్లో నేను భోంచేస్తున్నానో లేదోకూడా చూసుకునేది కాదు. దేవదర్శనానికి వచ్చినవాళ్ళం దేహపోషణ చూసుకుంటూ ఉండటమేమిటని ఉపదేశించేది నాక్కూడా. గురువారం రోజున ఉత్సవంలో, ఊరేగింపులో,

పల్లకీ వెనక నడుస్తున్నప్పుడు. అంతటి జనసమ్మర్దంలోనూ దానికి కష్టమే అనిపించేది కాదు. ఇహ పూజారి కరుణాకటాక్షం మొదలుపెట్టి స్తోత్రం చదువుతూంటే, దాని గుండ్రటి కళ్లు. పవ్నాలుగేళ్ల పలకరింపు ఎఱుగని ఊర్మిళ కళ్ళలాగ ఉండేవి. మానసిక బాధతో, మూగ ప్రార్థనతో నిండి వుండెవి ఆ కళ్లు.

ఆ స్తోత్రంలో

"అరవయ్యోపడి దాటిన
వంధ్య, సుమంగలి వచ్చీ
పుత్రభిక్ష పెట్టమనీ
పమిటకొంగు పట్టిందీ
కరుణ చూపవయ్యా, దత్తయ్యా."

అన్న చరణం మొదలుపెట్టగానే, అది తల భూమిమీద ఆనించి, ఆ చరణం అంతా అయేవరకూ లేచేది కాదు. అంత సేపూ తన మనసులో ఏమని ప్రార్థన చేసుకునేదో నాకు తెలుసు.

"దేవా, దత్తాత్రేయా! అరవయ్యోపడిలో ఉన్నా, వరం యిచ్చి సంతానం ప్రసాదించావుట: నా కింకా 35 నిండలేదు. నన్నెందుకు యిలా పరీక్షిస్తున్నావు? నిన్ను త్రికరణశుద్ధిగా సేవించుకుంటున్నానే. నామీద దయలేదా?"

మేం మొత్తంమీద పదిరోజు లున్నాం గంగాపురంలో. మేము యింటికి చేరుకునేటప్పటికి అఘమపక్షం పది పౌనులన్నా దాని తూకం తగ్గి వుండాలి. అయినా దాని నిరీక్షణకి మాత్రం అంతు చిక్కలేదు. ఉపోషాలూ, నిష్ఠలూ సాగిస్తూనే ఉంది. "ఆ భగవంతుడి హృదయంలో కనికరమయినా పుట్టిస్తాను. లేదా ఆ ప్రయత్నంలో నేను బలిఅయినా అయి పోతాను" అన్న మొండిపట్టుతో వ్రతాలూ, నోములూ వదిలిపెట్టకుండా, చేస్తూనూ వుంది; నోస్తూనూ వుంది.

ఆ తరువాతనేరా నాయనా ఓరోజు దానికి నీజాడ పొడదట్టింది. కాని అది నిజమని నమ్మలేక పోయింది. తనలో ఏదో ఒక మార్పు వచ్చిందని తెలుసుకుందిగాని. అది తను కోరుకున్న మార్పేనని అనుకోటానికి ధైర్యం

చాలలేదు. "మన కా అదృష్టమే వుంటే, యిన్నాళ్లు! యిన్నేళ్లు : ఆలస్యం ఎందు కయ్యేదని అనుమానం పట్టుకుంది. కాని యింకొన్ని రోజులు గడిచాక తన అదృష్టం పండిందని నమ్మక తప్పలేదు దానికి.

దాని మనస్సు ఒక్కసారిగా వికసించింది. ఇల్లంతా వెన్నెల వచ్చి నట్లుండేది. దాని స్వభావం కూడా చటుక్కున మారిపోయింది. నడకలోనూ, మాటలోనూకూడా ఒక కొత్త లావణ్యమూ, మార్దవమూ వచ్చాయి. తన దేహంలో అణువణువూ ఏదో కొత్త పరిణామం పొందుతున్నట్లు తోచేది కాబోలు. తరుచుగా అద్దం చూసుకునేది : సంవత్సరంలో ఉన్న ఆరు ఋతువులూ ఒక్క క్షణంలోనే వచ్చేస్తే, మనిషిలో ఎటువంటి పరిణామం వస్తుందో అలా ఉండేదిరా మీ అమ్మ ఆ రోజుల్లో. నువ్వు వస్తున్నావని ఉత్సాహపడేది. అతిథికోసం అర్ఘ్యం అవీ సిద్ధం చేసుకున్నట్లు నీ కోసం ఎన్నెన్నో సిద్ధం చేసుకుని నీకు స్వాగత మివ్వడానికని ఎదురుచూస్తూ ఉండేది. తను యింతవరకూ కళ్ళ చూడనైనా చూడనటువంటి నీ రూపం యొక్క ప్రతిబింబాన్ని యింట్లో ప్రతిచోటా చూసి మురిసిపోయేది.

దానివంక చూస్తూ కూచుంటే నా కెంతో తమాషాగా ఉండేది. ఒక్కొక్కసారి ఏదో శ్రద్ధగా వింటున్నదానిలాగా ఉండేది దాని ముఖ భావం. ఎవరో ఎక్కడ్నుంచో, అస్ఫుటంగా, మధురంగా పిలుస్తున్నట్లు అనిపించేది దానికి. 'ఓయ్' అని పలుకుదామని కూడా అనిపించేది గాని, అంతట్లో బిడియపడేది. ఆ నాలుగు నెలలపాటూ కూడా. ఉల్లాసంగా ఉంచడానికి నే నేమీ ప్రయత్నించవలసిన అవసరమే లేకపోయింది. దాని హృదయంలో ఆనందం సాగరంలా పొంగి ముత్యాలరాసులు కుప్పలు పోస్తోంది. అటువంటప్పుడు నే నెంత సరసంగా మాట్లాడితే మట్టుకు రాణింపు ఎలా వస్తుంది? పైగా దానికి ఎక్కడ చూసినా దత్తాత్రేయుల వారే కనిపించేవారు. ఎంతసేపూ ఆయన స్తోత్రమే; ఆయన సంకీర్తనే; ఒకరోజున దా న్నోపవాచకం చేద్దామని బుద్ధిపుట్టింది నాకు.

"దత్తాత్రేయులవారిని కంటె, ఆ డాక్టరు వాసుదేవరావుగారిని ఎక్కువ జ్ఞాపకం చేసుకోవాలి. చివర చివరకి ఆయన సహాయమే మనకి అవసరమౌతుంది"

"మీరు నా భక్తి శ్రద్ధలని పరిహాసం చేస్తారెందుకు? ఈ విషయంలో మీ రేమీ చెప్పవద్దు నాకు. ఇలాంటివి మీ కేం తెలియవు."

ఆ విషయాలని గురించిన జ్ఞానం అంతా ఆవిడే గుత్తకి తీసుకుందిట! అజ్ఞానమో, జ్ఞానమో దానంతట అదే తెలిసికొనేవరకూ, అలా వదలివెయ్యటంలో వచ్చిన నష్ట మేముంది? కాని ఉన్నట్లుండి ఒకరోజున దాని పరిస్థితి దానికే అర్థంగాకుండా పోయింది. ఆ రోజు సాయంకాలం నేను యింటికి వచ్చేటప్పటికి, తల పట్టుక్కూచుంది. ఒక్కసారయినా మూర్ఛ లేదు. దానిచేత మూర్ఛిలాడించేటప్పటికి ఇంద్రుణ్ణి, చంద్రుణ్ణి దింపి తీసుకువచ్చినంత పనయింది! అప్పుడయినా ఆ సహం, సహం వాక్యాలలో నా కర్థమయిం దేమిటంటే పుట్టేది మగపిల్లాడే అవుతాడా లేదా అనే సందేహంతో సతమతమయిపోతోందిట?

ఈ సందేహాన్ని నేను మాత్రం ఎలా నివృత్తి చేయగలను? మగపిల్లాడా, ఆడపిల్లా అని నిర్ధారణగా నాకు మాత్రం ఎలా తెలుస్తుంది? అయినా నాకా విషయంలో పెద్ద పట్టింపూ లేదు. ఏ శిశువయినా, నా చేతులు చాచే ఉన్నాయి. కాని, దానికి అల్లా అనిపించలేదు. ఎల్లాగూ మొయ్యడం తప్పదు. ఎల్లాగూ కిష్టం తప్పదు. పైగా యిన్నేళ్ళ తరువాత గర్భం, యిదే మొదటిదీ, యిదే ఆఖరుదీ అనుకోవలసిందే కూడాను! ఎలా అయినా ఒక బిడ్డ చాలు! కాని అది తప్పకుండా మగపిల్లాడే కావాలని దాని ఆరాటన.

"తీరా యింతా కష్టపడి చివరికి మగపిల్లాడు కాకపోతేనో?" ఇదో కొత్త విచారం పట్టుకుంది దానికి. నేనేమయినా పొరపాటున ఊరడించబోతే పెద్ద కోపం వచ్చేసేది. ఓ రోజున అల్లాగే కోపం తెచ్చుకొని నాముందరనుంచి లేచి వెళ్ళిపోతూంటే.

"ఓ కాబోయే కన్నతల్లీ!
కాస్త నీళ్ళాడేవరకూ ఆగు!" అన్నాను.

ఆరోజంతా ఎంత గొడవ పెట్టిందని!

"మీదేం పోయింది. వేళాకోళంగానే ఉంటుంది మీకు. నా వ్యధ నాకు తెలుసు. తండ్రి అవటం సులభమే. కాని, తల్లి ప్రాణం...."

"అవునే, న న్నేం చెయ్యమంటావో చెప్పు పోనీ. ముందువున్న కష్టం అంతా నీదే, ఒప్పుకుంటాను. నేను నీ స్వభావానికి ఏ ధన్వంతరి దగ్గర మందు తేగలనే?"

"మీ యిష్టం వచ్చినట్లు మాట్లాడండి! అసలు ఆ భగవంతుడే నామీద తగ తీర్చుకొంటున్నాడు. నా కడుపున ఒక ప్రాణం అయితే పడేశాడుగాని. దాన్ని భరించే బలమూ, ధైర్యమూ నా దగ్గిరనుంచి ఎత్తుకుపోయాడు! ఏహో ఒకటి మనకి యిచ్చినట్లే యిచ్చి, యింకో దేహో ఎత్తుకుపోతుంటాడు ఆ దయామయుడు!"

దాన్ని పూర్తిగా తొమ్మిది మాసాలన్నర కష్టపెట్టాకరా, నాయనా! ను వ్వీ ప్రపంచములో పాదం పెట్టడానికి నిశ్చయించుకున్నది! "ఏహో చాలాసేపు నిద్రపోయినవాడిలా ఆదరా బాదరా మేలుకొని" యిప్పటికే చాలా ఆలస్యం చేసినట్టున్నాం. ఇహ యీ మకాం మార్చెయ్యాలి" అని అనుకొన్నట్టున్నావు. యింకేముంది? ఒకటే కంగారు మాకు.

దానికో రెండు పెద్ద నొప్పులు వచ్చాయి. బండి తీసుకురమ్మంది. మేం టాక్సీలో బయలుదేరినప్పుడు ఉదయం 9 గంట లయింది. అది మాంచి వేసవికాలం. ఆసుపత్రి గుమ్మంలో ఉన్న బాడతచెట్లు విరగపూసి కాంపౌండులోనూ, బయటా కూడా పూలరేకులు చల్లివుంచాయి మా నోవలో. గాలి స్తంభించిపోయి, మహా ఉక్కగా ఉంది. నొప్పులు సహిం చేందుకు పెదిమలు కొరుక్కుంటూ మీ అమ్మ - దానికేసే చూస్తూ నేనూ, యిద్దరమూ చిందర వందరగా చెమటలతో ఆ ఆసుపత్రి గుమ్మంలో దిగాము. నేను నెమ్మదిగా జబ్బ పట్టుకొని నడిపించాను. నడిచింది. ఒక చిన్న అరుగు చూపించి కూర్చోమన్నాను. కూచుంది. ఆ సమయంలో పరిపూర్ణంగా పరాధీన అయిపోయింది. మరుక్షణంలో యిద్దరు, ముగ్గురు మంత్రసానులు వచ్చారు. వాళ్ళందర్నీ ఒక్కసారి కలియచూసింది వాళ్లు అనుభవం గలవాళ్ళే. సామర్థ్యం గలవాళ్ళే. కాని అంతకంటే ఏదో ఒక లక్షణము వాళ్ళ ముఖాల్లో కనిపిస్తే బాగుంటుందని దానికి తోచింది. కాని వాళ్ళల్లో ఆ ఆదరం కనిపించలేదు. దానికి నొప్పులు ఎక్కువయ్యాయి. ఈ నొప్పికంటే యిందాకటి నొప్పి ఎంతో నయం అనిపించింది. దానికి

ఆ సమయంలో దయా, సానుభూతీ కావాలనిపించింది. ధైర్యం కావాలని పించింది.

ఒక నర్సు తన మానులాటి చేతులు దాని భుజాలకింద వేసి లేవ దీసింది. దానికి ఆ చేతులు ఉత్త క్రూరచేతులేమో అనిపించాయి. వాళ్ళ సహాయంతో లోపలికి వెళుతూ నాకేసి చూసింది. "మీరు బయటే ఉండి పోతారా? నన్ను వాళ్ళ చేతుల్లో పారేశారా, నాకు భయంగా ఉంది" అని అంటున్నట్లున్నాయి ఆ చూపులు. ఎందు కలా చేసిందో మరి: యిటూ అటూ ఊగే ఆ సగం తలుపుల్లోంచి తాను వెళుతూ వెళుతూ రెండు చేతులూ ఎత్తి నాకో నమస్కారం చేసింది. ఏమనుకుందో మరి! మౌనంగా తనను నడిపించి తీసికెళుతూన్న ఆ నర్సుల చేతుల్లో పడగానే నేనూ మౌనంగానే ఉన్నా, నా హృదయంలో ఉన్న ప్రేమా, సానుభూతీ దానికి గోచరించాయి కాబోలు. ఉండవచ్చు. ఆ నిమిషాలలో నేను తన చెంతనే ఉంటే బాగుండు నని అనుకొన్నది. కాని సభ్యత ననుసరించి నేను బయటే ఉండిపోవలసి వచ్చింది. నే నలా చూస్తూ చూస్తూ ఉండగానే అది నా కన్నుమరుగై పోయింది. నేను ముఖం యిటు త్రిప్పుకుని జేబులోంచి రుమాలు తీసు కున్నాను.

నా జీవితంలో అది నాకు సుఖమూ, దుఃఖమూ రెండూ కలిగించింది. నన్ను దుఃఖపెట్టడం తెలియక చేసింది. సుఖపెట్టడం మాత్రం బుద్ధి పూర్వ కంగా చేసింది. ఏది ఏమయినా అది నేను ప్రేమించిన భార్య అంచేత దాని నొప్పులూ దాని వ్యథా నా హృదయంలో ప్రతిధ్వనిస్తున్నాయి. నా చిట్టిబాబూ నిన్ను కనడానికి అది ఏడు పరదాల వెనక్కి వెళ్ళిపోయింది. నే నా ఆరు బయటే కూర్చుని ఉండిపోయాను.

అల్లాగే ఎలాగో రెండు గంటలు గడిచిపోయాయి. కాని నీ ఏడుపు నా చెవిని పడలేదు. నా కళ్ళూ, చెవులూ అటువేపే ఉన్నాయి. ఆ సగం తలుపుల్లోంచి నర్సులు యిటూ అటూ తిరగడం నా కన్పిస్తూనే వుంది. కనిపెట్టుకూచుని కూచుని విసుగొచ్చింది నాకు. అంతట్లో ఒక నర్సు బయటికి వచ్చింది. ఆవిడకి నా ముఖం మీది ప్రశ్నార్థకం కనిపించింది కాబోలు. ఆవిడ ఏహో ఒక యంత్రం మాట్లాడినట్లు "యింకా చాలా ఆలస్యం ఉంది. మీ రిక్కడే ఉండాలిసిన అవసరం లేదు" అన్నది.

గత్యంతరం లేక యింటిముఖం పట్టాను. తలుపు తీశాను. యింట్లో పడివున్న ఉత్తరం విప్పి ఏసో అర్థం చేసుకుంటున్నట్లే అక్షర మక్షరం చదివాను. ఆ ఉత్తరం ఎవరు రాశారో ఏమని రాశారో నాకు తెలియనే లేదు. ఇంట్లో వున్న ప్రతీ వస్తువూ నన్ను ప్రశ్నలు వేస్తున్నట్టే వుంది. "మా అమ్మగారి పరిస్థితి కుశలమేనా" అని నాకు మాత్రం ఏం తెలుసూ - వాటితో చెప్పడానికి. సాయంకాలం నాలుగుగంటలవరకూ అలాగే దేనిమీదా ధ్యాసలేకుండా గడిపాను.

అప్పటికి ఒక ఆస్పత్రి నౌకరు నన్ను పిలవడానికి వచ్చాడు. "మిమ్మల్ని పిలుచుకు రమ్మన్నారు" అనడంకంటే ఇంకేమి చెప్పలేదు. అంచేత నా మనస్థితి అయోమయంగా అయిపోయింది. తీరా ఆస్పత్రి గుమ్మంలో కాలుపెట్టేటప్పటికి వాతావరణం అంతా ఏసో గంభీరంగా కనిపించింది. నా గుండె కొట్టుకోవడం నాకే వినిపించడం మొదలుపెట్టింది. పొద్దున్న అక్కడలేని మనిషి ఒకాయన కనిపించాడు. ఆయన డాక్టరుగారు కాబోలు. తెల్లటిగౌను వేసుకున్నాడు. శుభ్రంగా సబ్బుతో కడుగుకున్న చేతులు తువ్వాలుతో తుడుచుకుంటూ బయటికి వచ్చాడు. అక్కడే ఉన్న మంత్రసాని నేనెవర్నో ఆయనకి చెప్పింది. తక్షణమే ఆయన నావేపు తన దృష్టి తిప్పాడు. నేనూ ఆయనవేపు చూశాను - తలయెత్తి. ఆయనకి బట్టతల ఉందనీ, కళ్లు పిల్లికళ్ళనిమాత్రమే గోచరించింది నాకు. ఇంతట్లో ఆయన స్వరం వినిపించింది. "నీ భార్య పరిస్థితి చాలా ప్రమాదకరంగా ఉంది. శిశువు అడ్డం తిరిగింది". నేను ఏమి వింటున్నానో, ఏమి చూస్తున్నానో అర్థంకావడంలేదు. అతాత్తుగా చెవిటివాణ్ణయిపోయాను. డాక్టరుగారు ఆయన స్వరం కొంచెం పెంచారు. అప్పుడు నా కొంచెద్దిగా స్పృహ కలిగింది.

"ఆపరేషన్ చెయ్యవలసి వస్తుంది. కాని ఆ అమ్మాయికి రక్తం చాలా తక్కువగా ఉంది. అదో చిక్కు. తల్లీ, పిల్లా యిద్దరూ కులాసాగా బయటపడకపోవచ్చు. అటువంటప్పుడు ఏం చెయ్యాలో నువ్వే చెప్పాలి. పిల్లని బ్రతికించమంటావా? తల్లినా?"

నాకు ఒళ్లు చల్లబడిపోయింది. ఎంత పెద్ద గొడ్డలి ఆకాశంమీంచి నా నెత్తిన పడింది! డాక్టరుగారు కూడా నా అవస్థ కనిపెట్టారు కాబోలు. ఎంచేతంటే ఆ తరువాత చాలా అనునయంగా మాట్లాడారు.

"నీ బాధ నాకు తెలుసు. కాని ఈ విషయాలు నీకు స్పష్టంగా చెప్పటం నా కర్తవ్యం. నేను యిద్దరినీ బ్రతికించటానికే శాయశక్తులా ప్రయత్నిస్తాను. కాని నా శక్తికి మించిన కష్టం ఏర్పడి, యిద్దరూ దక్కకుండా పోయే పరిస్థితి వస్తే, నేనేం చెయ్యాలి అప్పుడు? ఎవర్ని బ్రతికించాలి. తల్లినా? పిల్లనా?"

"తల్లినా? పిల్లనా?!" "తల్లినా, పిల్లనా!!!" ఎంత భయంకరమయిన సమస్య! నాకు యిద్దరూ కావాలి. భార్య సంసారానికి ఆధారం. శిశువు వంశానికి ఆధారం! నేను ఎవరి ప్రాణాన్ని ఉదాసీనంగా చూడగలను. అంతకంటె నా ప్రాణాలు విడిచేస్తేమాత్రం ఏం? కాని దానివల్ల ఏం ఉపయోగం? ఒకదాంట్లో ఒకటి దూరిపోయి ఉన్నవి. మీ యిద్దరి ప్రాణాయాసూ? పీటముడి వేసుకొని పోయినవి మీ యిద్దరి ప్రాణాలూను. ఇప్పు డీ ప్రశ్నకి నే నేం జవాబు చెప్పగలను? నా కా డాక్టరుమీద కోపం కూడా వచ్చింది. "నన్నెందుకు అడుగుతావు? నీ కేది మంచిదని తోస్తే అది చెయ్యి. నీ యిష్టం వచ్చిన వాళ్ళని బ్రతికించు. నీ యిష్టం వచ్చిన వాళ్ళని చంపెయ్" అని మనసులోనే కేకలేశాను. కాని యీ పాపం ఆయన నెత్తిన ఎందుకు వేసుకుంటాడు? ఇంతట్లో ఆయన నన్నే గదమాయించాడు. "తొంధరగా చెప్పు. ప్రతి నిమిషమూ ఎంతో విలువైన దీ సమయంలో."

నేను జవాబు చెప్పితీరాలి. అదయినా తక్షణమే ఆలోచించుకునే వ్యవధి లేదు. "ఇద్దరినీ బ్రతికించు. నా కిద్దరూ కావాలి" అని మనసు మౌనంగా కేకలేసి చెబుతోంది ఆయనతో. కాని ఆ మాట నిరుపయోగం. నేను మాట్లాడానికి ప్రయత్నం చేశాను. సాధ్యపడలేదు. కాని చివరికి ఎలాగో సాధించినట్లున్నాను. నా దేహంలో ఏ మూలనో మూర్ఛవచ్చి పడి పోయిన మాటలను లేవగొట్టి బయటికి ఈడ్చాను. అంకష్టంమీద నా నోటి వెంట రెండే రెండు మాటలు బయలు బడ్డాయి. "పిల్లాణ్ణి బ్రతికించండి."

మరుక్షణంలో డాక్టరు లోపలికి వెళ్ళిపోయాడు. నే నా అరుగుమీద దేహం పడేశాను. గట్టిగా గొంతెత్తి ఏడుద్దామనిపించింది. కాని సాధ్యపడ లేదు. కళ్ళల్లో తడికూడా కమ్మలేదు. ఒంట్లో ఉన్న జలలన్నీ ఒక్క-

సారిగా ఎండిపోయినాయి. మనిషిగా ఉంటుండే వాణ్ణి, ఒక దూలాన్ని అయిపోయాను. ఇంతట్లో లోపలనుంచి ఒక హృదయ భేదకమయిన అరుపు వినిపించింది. నాకు మళ్ళా స్పృహ వచ్చింది. చెవులు మొగ్గించి వింటున్నాను. నాయనా, నువ్వు దాన్ని చంపడానికిట్రా బయలుదేరావు. నే నక్కడే కూచుని ఊహించుకుంటూ పోతున్నాను.

ఈ పాటికి డాక్టరుగారు తన శ్రస్త్రకాండ ఆరంభించి ఉంటారు. ఆ గదిలో తళతళా మెరుస్తూన్న రకరకాల ఆయుధాల్ని తయారుగా ఉంచి ఉంటారు. దాన్ని తీసుకవచ్చి ఆ బల్లమీద పడుకోబెట్టి ఉంటారు. మంత్ర సాని సహాయం చెయ్యడానికి సిద్ధంగా డాక్టరు దగ్గరే నిలబడి ఉంటుంది. క్లోరోఫారం వాసన వ్యాపిస్తూవుండి వుంటుంది. ఆ మత్తు మందు గుడ్డ మడత దాని ముక్కుమీద వేసి వుంటారు. ఒకటి రెండూ...మూడూ... అయిదు....పదమూడు ఊః ఉఊఊఊ ఉః ఉఊఊ ఇప్పుడే యిక ఉచ్ఛ్వాస నిశ్వాసాల శబ్దం మాత్రమే ! చావు బ్రతుకు పొలిమేరల మధ్య ఉండే శాంతత. దురూహ్యమయిన నిశ్శబ్దం. అది యిప్పుడు ఏ లోకానికి చెంద నిది. శస్త్రధారి అయిన డాక్టరు చేతిక్రింద పడివున్న సగం చావని జీవం. ఈ క్షణంలో దాని అస్థిత్వం అంతమాత్రమే !

నేను బయట ఆ అరుగుమీదే కూర్చుని ఉండిపోయాను. ఎండ తగ్గిపోయింది. సూర్యుడు అస్తమించే వేళ అయింది. ఆ మీదట భయానక మయిన చీకటి వ్యాపిస్తుంది. జగత్తు మీద, నా మీదా కూడాను. దురదృష్ట మనే పిశాచం నాచుట్టూ తిరుగుతోంది. అదే నన్నప్పుడు ఆవహించి "పిల్లాణ్ణి బ్రతికించండి" అని మాట్లాడించింది. దాంతో నా సంసారానికి నేనే గొడ్డలి పెట్టు పెట్టుకొన్నానన్న మాట. ఇహ ఏ నిమిషంలో నయినా ఎవరో వచ్చి ఆ కాస్తా నా చెవిని వెయ్యటమూ, నేను నెత్తిన చేతులు పెట్టుకుని కూల బడిపోవటమూ మట్టుకే జరుగవలసి ఉన్నవి. ఇది ఊహించుకుని, గుండె రాయి చేసుకుంటూ, రాయిలాగ కూర్చున్నాను. ఇంతట్లో యివతలికి నడిచి వస్తున్న డాక్టరుగారి పాదాలు కనిపించాయి. అవి భూమ్మీద అడుగులు వెయ్యడానికి బదులు, నా గుండెలమీదనే వేస్తున్నవి. చివరికి బయటికి వచ్చా రాయన. నే నాయన ముఖంకేసి చూశాను. ఆ ముఖభావం యింకా

బిత్తరపోయినట్లే ఉంది. చెమట అంతా తుడిచేసి శుభ్రంగా ఉంది. ఆయన పల్చటి పెదిమలమీద ఒక మందహాసపు రేఖ తొంగిచూస్తోంది. ఆయన నాతో "అభినందనలు" అన్నాడు.

"అభినందనమా! ఎందుకు? పెళ్ళాన్ని పోగొట్టుకున్నందుకా? పిల్లాడు పుట్టాడు గనుకనా!"

నేను పిచ్చివాడిలాగ ఆయనవేపే చూస్తూ ఉండిపోయాను.

"తల్లీ పిల్లా క్షేమంగా ఉన్నారు. నీకు మగపిల్లవాడు పుట్టాడు."

డాక్టరుగారికి కృతజ్ఞత చెప్పుకోడానికి కూడా చైతన్యం లేకపోయింది నాకు. నేను మౌనంగా కూలబడ్డాను. చిన్న పిల్లవాడిలాగా ఏడుస్తున్నాను. నా ఆనందంలో నేను తేలిపోలేదు. నా ఆనందం నన్ను ఒక బరువుగా అణిచివేసింది. నలిపివేసింది. కాని నా అవస్థ ఎటువంటిదో అక్కడ ఎవరి కర్థమవుతుంది? అలా నేను ఎంతసేపు కూర్చున్నానో మరి? మంత్రసాని వచ్చి "ఓసారి చూడ్డానికి వస్తారా?" అని అడిగింది. అప్పు డర్థమయింది నాకు నా భార్యని చూడ్డానికి నన్ను పిలుస్తున్నారని.

నే నావిడ వెనకనే శబ్దం చెయ్యకుండా అడుగులు వేసుకుంటూ నడిచివెళ్ళాను. నీ తల్లి ఒక మంచంమీద పడుకునివుంది. నిశ్చేష్టురాలై పడివుంది. ఏదో ఊక కుక్కిన గుడ్డబొమ్మలాగ, మూర్తీభవించిన కరుణ రసం యొక్క ముచ్చి బొమ్మలాగ; వళ్ళంతటిమీదా ఒక దుప్పటి కప్పివుంది. ముఖం మాత్రం బయటికి కనిపిస్తోంది. ఆ ముఖం మీద సుఖమూ, దుఃఖమూ, సంతోషమూ, విషాదమూ ఏమీ కనిపించలేదు. కాని అమిత ప్రయాసపడి ఓర్చిన బాధ యొక్క నీడమాత్రం వున్న దా ముఖంమీద యింకా. రెప్ప ఎత్తి నన్ను చూడ్డానికి కూడా శక్తిలేదు ఆ కళ్ళల్లో.

నా కన్న తండ్రీ దగ్గరలోనే వేళ్ళాడుతున్న ఉయ్యాలలో పడుకున్నావు నువ్వు. నువ్వు భూమ్మీద పడేముందర తల్లి ప్రాణాన్ని ఒక్కకడకి తెచ్చావు; దాని పేగులు పెగల్చివేశావు. శేర్లకొద్దీ రక్తమూ, చెమటా, కన్నీళ్లూ ప్రవహింపచేసి, దాన్ని కదలడానికికూడా శక్తి లేనిదాన్నిగా చేసివేశావు. నువ్వింత ప్రమాదపు పనిచేసినట్లు నీకు తెలుసురా? కాని, నే నా గదిలో ప్రవేశించగానే, నీ దగ్గరికి రాలేదురా; మొట్టమొదట నేను తిన్నగా వెళ్ళింది

దానిదగ్గరికి. పదిహేనేళ్లు నాతో సుఖదుఃఖాలు పంచుకున్న నా సహధర్మ చారిణి దగ్గరికి! దాన్ని ఒకసారి దుప్పటిమీదే చేతులతో తడిమి చూసుకున్నాను. అది బ్రతికేవుందని నిర్ధారణ చేసుకున్నాను. అది తన గుండ్రటి, నల్లటి కళ్ళమీది రెప్పలు అతి ప్రయత్నంమీద సగంవరకూ తెరచి నాకేపి చూసినప్పుడు....

"ఇప్పుడు బాధేమీ లేకుండా బాగున్నావుగా?" అని అడిగాను నెమ్మదిగా.

"ఊఁ" అంది.

కాని, ఆ "ఊఁ"లో ఏమీ జీవంలేదు.

"మనకో మగపిల్లాడు పుట్టాడు".

మళ్ళీ ఒక "ఊఁ" అంతే! ఒక్క మాట మాట్లాడలేదు. మాట్లాడానికికూడా ఓపికలేనంత అలిసిపోయింది. దాని మొఖమూ, చెంపలూ నా చేత్తో ఒక్కసారి నిమిరి, రేగి ముందుకువచ్చి చెమటకు అంటుకుపోయిన ముంగురులు వెనక్కి దిద్దాను. ఆ తరువాత నీ ఉయ్యాలదగ్గరికి వచ్చాను. ఎర్రటిరంగుతో, అతి లేతవయిన అవయవాలతో కనిపించీ కనిపించని జుట్టుతో జీవితాన్ని గురించీ, అప్పటి పరిస్థితులను గురించీ, నిండు అజ్ఞానంతో హాయిగా నిద్రపోతున్నావు! కొంచెంసేపు నిన్ను కూడా నా చేతుల్తో తడిమి, సంతానవంతుణ్ణయానని నాకు నేనే ఋజువు చేసుకుని యిహ అక్కడినుంచి కదిలాను.

ఇంటికి వచ్చి యింట్లో వున్న ప్రతి వస్తువుతోటీ చెప్పాను! "మీ యజమానురాలు కులాసగావుంది." అని. ఇంకో సంగతికూడా చెప్పాను. ప్రతి వస్తువుకీ "ఇకమీదట మీరంతా కాస్త జాగ్రత్తగా ఉండండి. మిమ్మల్ని అందర్నీ తలక్రిందులు చెయ్యడానికి ఒక అసాధ్యుడు వస్తాడులెండి పది రోజుల్లో" అని.

ఇక ప్రతిరోజూ ప్రొద్దున్నా, సాయంకాలం ఆసుపత్రికి వెళ్ళటమూ రావటమే నా పని: ప్రతిరోజూ "నిన్నటికంటె ఇవాళ నయంగా ఉంది" అని చెబుతూ ఉండేవారు.

ఆ తరువాత మమకారం నన్ను నీవేపుకు లాగివేసింది. గంటలాది

కూర్చుని కళ్ళప్పగించి నిన్నే చూస్తుండేవాణ్ణి. నా మనస్సు ఇప్పటికి కాస్త కుదుటబడి నువ్వు పుట్టావుగదా అని సంతోషపడడానికి ఉత్సాహపడుతోంది. మీ అమ్మ యింకా ప్రక్కమీంచి లేచేదికాదు. లేవాలనుకున్నా లేవనిచ్చే వారుకాదుకూడాను. స్తన్యానికి నిన్ను దానిదగ్గిర విడిచేవారు కాదు. దాని మాతృహృదయానికి ఇదొక బాధ ఉంటూండేది. నా చేతుల్లో ఉన్న నిన్ను, తన దగ్గిరగా పెట్టించుకునేది. నీకు యితర్రతా యివ్వడానికి వీలులేని పోషణలో కొంతభాగమైనా, నిన్ను తన చేతుల్తో తడిమినందువల్ల అందచేసినట్లు తృప్తిపడేది.

ఓ రోజున నేను నిన్ను చూపెంచి ఏమన్నానో తెలుసా ? "మన అబ్బాయిని చూడు ! వీడికి చీకూ చింతా ఏమీ లేవుగదా ! పొట్ట నిండితే చాలు. నిద్రపోతేచాలు. మిగతాఅప్పుడు చప్పట్లుకొడుతూ బ్రహ్మానందంగా ఉండగలడు. మనుషులందరూ కూడా ఎక్కువకాలం ఇలా పసిపాపలుగానే ఉండగలిగితే బాగుణ్ను. అప్పుడు చిల్లర విషయాల్ని మనసులో పెట్టుకుని బాధపడవలసిన అవసరం ఉండదు."

ఈ ముక్కలని దానికేసి చూశాను. అదికూడా అర్థం చేసుకుంది. మా ఇద్దరి పెదిమలమీదా చిరునవ్వు మొలిచింది. ఎంతో ఆనందమయింది. నేను నీ ముఖంముందు ఒక చిటికవేశాను. నీ చిన్నిగడ్డం మునివేళ్ళతో పట్టుకున్నాను. ఇంకో నాలుగురోజుల్లో మిమ్మల్ని ఇంటికి తీసుకెళ్ళవచ్చుట. నే నిప్పటినుంచీ అందుకోసం సరంజాము ప్రారంభించాను.

ఆ శనివారం పనిలోంచి పెందరాళే వచ్చేశాను. వస్తూ వస్తూ పెద్ద బజారులో పళ్లు కొన్నాను. ఇంటికి వచ్చి బట్టలు మార్చుకున్నాను. ఇంక రెండుగంటలసేపు మీ ఇద్దరిదగ్గరా ఆనందంగా కూచోవచ్చుగదా అని ఆసుపత్రికి వచ్చాను.

నేను ఆ గదిలోకి వెళ్ళేటప్పటికి, ఒక నర్సు దాని టెంపరేచరు పరీక్షిస్తోంది. నా కొనిపించకుండా ఉండేలాగ థర్మామీటరు చాటుగా పట్టుకుని ఒకసారి చూసి వెంటనే విదిలించేసింది. నేను కొంచెం భయపడి ఆవిణ్ణి అడిగాను.

"ఇదేమిటి మళ్ళీ ?"

"కొద్దిగా జ్వరం వచ్చింది."

"కొద్దిగా అంటే, ఎంత ఏమిటి ?"

"అది నీ కెందుకులే. డాక్టరుగారు వచ్చి చూసుకుంటారులే !"

"నిజమే అనుకోండి. కాని జ్వరం ఎంచేత వచ్చింది."

"రాత్రి సరీగా నిద్రపోలేదు. నిన్న పథ్యం కూడా ఇమడలేదు."

ఈ నాలుగు ముక్కలూ చెప్పి ఆ నర్సు నా ఎదటినుంచి వెళ్ళి పోయింది. నేను దాని మంచంమీద కూర్చున్నాను. దుప్పటిలోంచే దాని పొట్టమీద చెయివేసి చూశాను. నిప్పులాగా కాలిపోతోంది ఒళ్ళంతా.

"ఏమయిందే ?" అని అడిగాను.

కాని అదేం మాట్లాడలేదు. ముఖంమీద అమితమయిన బాధ కని పిస్తోంది. అంచేత తలనొప్పి బాగా ఎక్కువగానే ఉందేమో అని అను కున్నాను.

"తల నొప్పిగా ఉందా."

"ఊఁ !"

"ఎప్పటినుంచి ?"

జవాబు లేదు.

ఈ పదిరోజుల్లోనూ దానిచేత మాట్లాడించే ఉపాయం ఏమిటో నేను కనిపెట్టేశాను; అంచేత.

"అబ్బాయి ఎంత సేపట్టించి నిద్రపోతున్నాడు" అని అడిగాను.

"ఎవరికి తెలుసు ?"

"అదేమిటి అలా మాట్లాడుతున్నావు."

"ఇంకెలా మాట్లాడేది నేను. ఆ పిల్లాడు మీకు కొడుకు. వాడికి మీరు తండ్రి. ఒకరి కొకరు ఎంతో సొంతం. అంచేత వాణ్ణే అడగండి."

"అయితే తల్లివయిన నువ్వు సొంతంకాదుటే వాడికి ?"

"నేనా ? నేను వాణ్ణి కనేందుకుమట్టుకే ! ఇప్పుడు మీ వంశం నిలబడింది. ఇక నా అవసరం తీరిపోయింది."

"ఎవరు చెప్పారు నీకో యిలా అని.... ఊఁ ? ఎవరు చెప్పారే ?"

"ఎవరో చెప్పేదేమిటి దీనికి ? ఇది అనాదినుంచే స్థిరపడిన సంగతి. ఆడవాళ్ళ అవసరం అంతవరకే. భర్త వంశం నిలబెట్టడం కోసం ఒక వారసుణ్ణి భూమ్మీద పడేసి ముప్పతిప్పలూ పడి పెంచి ఆఖరి అణగారిపోవడం సర్వసామాన్యమైన సంగతి. ఆడదాని విలువ అంతవరకే."

"నువ్వెందుకు యిలా మాట్లాడుతున్నావు వివ్వాళ ?"

"ఇలా మాట్లాడుతున్నది నేను కాదు, మీరే యిలా మాట్లాడారు. ఈ పదిరోజులయినా బ్రతికాను గనుక, ఈ సంగతి నేను తెలుసుకో గలిగాను. నే నా ఆపరేషన్ గదిలోనే చచ్చిపోతే, నా విలువ ఎంతమాత్రమో నాకు తెలియకుండానే పోయేది. ఇన్ని రోజులనుంచీ మీరు నన్ను చూడ్డానికి వస్తూనే ఉన్నారు. కాని ఈ సంగతి ఎత్తనేలేదు మీరు. అసలు నాతో చెప్పాలని అనిపించనేలేదు మీకు ! నన్ను దగా చేస్తూనే వచ్చారు. అట్లా దగా చేయడం పాపమేమోనని కూడా మీకు సంశయం కలుగలేదు. నిన్న నేదో మాటల ధోరణిలో, పాపం ! ఆ నర్సు చెప్పబట్టి, మీ సంసారంలో నా కెంతమాత్రం స్థానం ఉందో అర్థమయింది నాకు."

"ఏమిటి అర్థమయింది నీకు ?"

"ఇంకేమి అర్థమవుతుంది ? మీ రేమన్నారో అదే ! డాక్టరుగారు మిమ్మల్ని "తల్లా ? పిల్లా ?" అని అడిగారట : పిల్లని బ్రతికించండి అని అన్నారుట, జ్ఞాపకం ఉందా ?"

ఈమాట లంటున్నప్పుడు దాని శ్వాస తీవ్రమయింది. అసలే రక్తం లేని ఆ పెదవులు ఎండిపోయాయి. లోపలవున్న బాధవల్ల ముఖం అంతా కాల్చిన అప్పడంలాగా అయిపోయింది. అది ఆ మాటలన్నీ మాట్లాడుతూనే ఉంది. కాని నా మొఖంకేసి చూడలేదు. ఎదురుగా ఉన్న గోడమీద ఉన్న కాలెండరుకేసి చూస్తూ మాట్లాడుతోంది. నేను ఎంతో ఆవేదనతో "నే నొక్క మాట చెప్తాను వింటావా" అని అడిగాను. "ఏమి వినాలి" అంది ఆ గోడవేపే చూస్తూ. దాని స్వరం నిరాశతో నిండి బలహీనంగా ఉంది. గడ్డం వేళ్ళతో పుచ్చుకుని దాని మొఖం నావేపు తిప్పుకున్నాను. దాని కళ్ళల్లోకి చూస్తూ "అవును నే నామాట అన్నమాట నిజమే. పెళ్ళామా,

పిల్లాడా ? అన్న ప్రశ్నకి 'పిల్లవాడు' అని జవాబు చెప్పినమాట నిజమే. ఆ రెండు క్షణాలలో, ఏమాత్రం ఆలోచించటానికి వీలుంటుందో అంతా ఆలోచించి తెలిసి చేసిన పనే జవాబు చెప్పటం."

"అయితే అయివుండవచ్చు. కాని దానిఅర్థం నాకెలా తెలుస్తుంది?"

"నీకు తెలియకపోతే నన్నడిగి తెలుసుకో! ఏమేమిటో అపార్థాలు చేసుకోకు. నాకు నీమీద కొద్దో గొప్పో ప్రేమ ఉంది గనుకనే ఆ జవాబు నా నోట వచ్చింది. కొడుకుని కనాలని నువ్వు ఎంత పరితపించిపోయావో నేను గమనించి జ్ఞాపకం ఉంచుకున్నాను. ఆ తొమ్మిది నెలలూ పొట్టలో ఆ భారం మోస్తూ ఎంత కష్టపడ్డావో నాకు కళ్ళకు కట్టినట్టు ఉంది. ఎంత చిన్న విషయమయినా నువ్వు లోలోపలే జ్ఞాపకం పెట్టుకుని, ఆజన్మాంతం స్మరిస్తూంటావని కూడా నాకు తెలుసు. నువ్వు తెలివివచ్చి చూసేటప్పటికి, మేకని కోసినట్టు చిన్న చిన్న ముక్కలుగా కోసి, కాళ్లు చేతులూ వేటికవి విడివిడిగా బొక్కెనలో పారేసివున్న నీ కొడుకు నీకు కనిపిస్తే—"

"అయ్యో! అయ్యో! అటువంటి అశుభాలు అనకండి!"

"నే నటువంటి మాటలు అనేవాణ్ణి ఎన్నటికీ కాను. కాని: నువ్వే నా చేత అనిపిస్తున్నావు! ఆ భయంకరమైన వికటదృశ్యం నువ్వు చూడ గలిగేదానివా? అసలు అది చూసీచూడగానే ప్రాణంకూడా వదిలేసే దానివేమో? ఒకవేళ బ్రతికుండగలిగినా, ఆ జీవితం నీకు నరకయాతనకంటే బాధగా ఉండేది. ఆ దృశ్యం ప్రతిరోజూ, ప్రతిక్షణమూ నీ అంతరాత్మలో సుడిగుండాలు తిరుగుతుండేది. నీకు నీమీద విసుగుపుట్టేది. నామీదా విసుగు పుట్టేది. ప్రపంచకం అంతటిమీదా అసహ్యం పుట్టేది. ప్రతి శుభ్యకార్యం మీదా కోపంవచ్చేది. నువ్వీ భూమ్మీద ఏదో దోవతప్పిన భూతం సంచరించినట్లు సంచరించేదానివి. ఆ పరిస్థితుల్లో ఎవరైనా వైకుంఠం తీసుకొచ్చి నీ చేత పెట్టినా, అదేదో హాలాహలంగా అవతలకి విసిరేసేదానివి. నీతో దాపరికంలేకుండా చెబుతున్నాను. కోపం తెచ్చుకోకు. నువ్వు చనిపోయి నప్పటికీకూడా, పుత్రవతి వనిపించుకోని చచ్చిపోవాలనే నా వాంఛ".

ఆ తరువాత నే చెప్పేదంతా చెవు లప్పగించి శ్రద్ధగా వినడం మొదలుపెట్టింది. నా స్వరంలోనూ, నా మాటల్లోనూ నే నెంత ప్రకరణ

శుద్ధిగా మాట్లాడుతున్నానో, ఆ ఆవేదన అర్థమయినట్లుంది దానికి. దాని పెదవులు ఎర్రబడటం ఆరంభించాయి. జ్వరం ఒక అరడిగ్రీ ఎక్కువయింది దేమో కూడాను. నేను మాట్లాడ్డం ఇంకో సాగిస్తూనే ఉన్నాను.

"నువ్వు చచ్చిపోతే నీకు విముక్తి గలిగేదేగాని, నాకు నిజంగా మరణావస్థ సంభవించేది. నేను నా చేతోటే నా యిల్లు నాశనం చేసుకున్నానన్న మాట. అయినా అందుకుకూడా నేను సిద్ధపడ్డాను. కాని నేను నా మనసులో ఏమని ఆలోచించుకున్నానో తెలుసా?"

"నేను ఒంటరివాణ్ణయిపోయినా, మన పిల్లవాణ్ణి పెంచి పెద్దవాణ్ణి చేస్తాను. వాడి ముఖంలో నిన్ను చూసి తృప్తిపడతాను. నువ్వూ, నేనూ యిద్దరమూ శాశ్వతంగా కలిసిపోయి మన పిల్లాడులా, ఒక్క దేహంతో అవతరించామని, మనస్సును సమాధానపరచుకొని శాంతిగా బ్రతుకగలుగుతాను.

"అంతకంటే యింకేముంది అసలు. నిజంగా చూస్తే నీకు 35 నిండాయి. నాకు 40 ఏళ్లు దాటాయి. మన దాంపత్యంలో పొద్దు వాలిపోయింది. మన సంసారరథం తిరుగుమొఖం పట్టింది. నువ్విదివరలో అన్నట్టుగా "వంశవృద్ధికి ఒక వారసుణ్ణి సృష్టించడం, వాణ్ణి పోషించి పెద్దవాణ్ణి చేయడంకోసం జీవితం ధారపోసి ఏదో ఒక రోజున కళ్లుమూసి అంతరించిపోవడమూ, అంతేగా తల్లిదండ్రుల ధర్మం. ఒక అర్థంలో నీ మాట నిజమే. నిన్నూ, నన్నూ కన్నతల్లిదండ్రులు కూడా అలాగే మనల్ని పెంచి పెద్దవాళ్ళనిచేసి, యిప్పుడు కనుమరుగైపోయారు! మన మీద కూడా ఆ జవాబుదారీ లేదూ మరి? ముందరితరంవాళ్ళను చంపి, మనం జీవించటానికి మన కేం హక్కు ఉంది? జగత్తులో ఈ జీవపరంపర ఇలాగే ప్రవహిస్తూ వచ్చింది. ఇలా ఉండటమే న్యాయం కూడాను! అందుచేతనే ఆ రోజున నీ ఆయుర్దాయాన్ని గురించి కూడా నేను లెక్కచేయడానికి వీలులేకపోయింది. అటువంటి అవసరమేవస్తే, మన సంతతియొక్క క్షేమం కోసం నా ప్రాణాలు బలిపెట్టడానికి కూడా ఏమాత్రం జంకను.... అర్థమయిందా నీకు....నచ్చిందా యిప్పుడయినా? నువ్విలా మౌనంగావుండి నా అంతం చూడకు. నీ అభిప్రాయ మేమిటో స్పష్టంగా చెప్పు నాకు. నేను

స్వార్థపరుణ్ణి, దగాకోరునీ, దయలేనివాణ్ణీ అని నీకు మనసులో తోస్తే, ఆ సంగతి ఖచ్చితంగా నోరువిప్పి చెప్పేసెయ్ !

ఇలా మాట్లాడుతూ ఉండగా, నా గొంతు దుఃఖంతో నిండి పోయింది. ఇక మాట్లాడలేక పోయాను ! మరుక్షణంలో దాని కళ్ళల్లోంచి గంగాప్రవాహం ఆరంభమయింది. దాని అవస్థ అతి జాలికరమయి పోయింది. నా దండని తన కుడిచేత్తో గట్టిగా పట్టుకుంది. దాని గొంతుకలో ఏవేమిటో ఆలోచనలు గుటగుటలాడాయి.

"మీరు చెప్పినదంతా వాస్తవమే. ముమ్మాటికీ వాస్తవమే. కాని, మీ రామాట ఎలా అనగలిగారండీ ?"

నా జబ్బమీదన్న చేయితీసి ఛెడేలున తన నుదుటికేసి కొట్టుకుంది. నా కర్మం యిట్లా కాలితే నేను మాత్రం ఏం చెయ్యగలను ? ఇంతలో ఆ నర్సు వచ్చింది అక్కడికి. అక్కడ కనిపించిన దృశ్యం చూసి నన్ను కాస్త కఠినంగానే చీవాట్లుపెట్టింది. "ఏమిటి మీరు చేసేపని ? రోగి మనస్సు కష్టపెట్టకూడదనే విషయం మీకు ఇంకొకళ్ళు చెప్పాలా ? ఇప్పుడయినా మీరు ఇక్కడనుంచి కదలటం మంచిది".

చెంపదెబ్బ తిన్నవాడిలాగా నేను అక్కడనుంచి లేచి, సరాసరి ఇంటికి వచ్చేశాను. నాన్నా ! నీ కింతకంటే ఏం చెప్పగలనురా ? చిట్టచివరి వరకూ నా అంతఃకరణ ఎటువంటిదో దాని కర్థమవలేదురా ! ఇంతగా చెప్పినప్పటికీ, నా ప్రవర్తనలో న్యాయాన్యాయాలు దానికి గోచరించలేదు. అది ఒక్కటే ఒక్క విషయం మనస్సులో పెట్టుక్కూచుంది. "ఆయనకి నా జీవితంఅంటే అంత అక్కరలేకుండాపోయింది !" జ్వరంలో కూడా యిదే పలవరిస్తూ ఉండిపోయింది. అట్లా మనస్సులో పెట్టుకుని, తన దుఃఖాన్ని తానే వృద్ధిచేసుకుంటూ పోయింది. తలుచుకుని తలుచుకుని చివరివరకూ బాధపడుతూనే ఉంది. ఆఖరికి జ్వరంతగ్గింది కాని, యిప్పుడు ప్రాణం పోయాక —

నేను వీధిపొడుగునా లడ్డూలు పంచిపెడుతూ, మిమ్మల్నిద్దరినీ ఇంటికి తీసుకురావాలనుకున్నాను. కాని మీ అమ్మ నా మనోరథం పూర్తి

చేసుకోనివ్వలేదు. దాన్ని నేనే మరోచోటికి దోవచూపించి తీసుకువెళ్ళాల్సి వచ్చింది. అదంతా అయిపోయిన తరువాత, నిన్ను ఓ దుప్పటిలో చుట్టబెట్టి నీ నెత్తిని నా కన్నీళ్ళతో అభిషేకంచేస్తూ, ఇంటికి తెచ్చుకోవలసి వచ్చిందిరా నాన్నా! అల్లా తెచ్చుకోవలసి వచ్చింది.



౨౧

# స్వప్నభంగం

డాక్టరు "మహాజన్" శస్త్రచికిత్సలో చాలా గట్టివాడు. ఒకరోజున ఆయన తన తెల్లకోటు తొడుక్కుని, స్టెథోస్కోప్ మెళ్ళో వేసుకుని, చేతిలో ఒక ఫైలు పట్టుకుని, ఆసుపత్రికి వెళ్ళడానికి బయలుదేరుతూ - ఒక్క క్షణం ఆగి నావేపు తిరిగి "ఆపరేషన్ చూడడానికి వస్తారా ఏమిటి?"

"చూడడానికా" అన్నాను గాభరాగా.

"అవును, చాలా పెద్ద ఆపరేషను - చూడదగినది."

నేను ఒక్క క్షణం తటపటాయించి, "పదండి వస్తాను" అన్నాను. ఎదటివాడి ప్రమాదం, చూసేవాడికి వినోదం అంటారు : ఇప్పుడు యీ ఆపరేషన్ చూసినందువల్ల నాకొచ్చిన నష్టమేముంది? చేసేవాడు డాక్టరూ, ఓర్చుకునేవాడు రోగీని. చూస్తూ కూచున్నందువల్ల నాదేం పోతుంది.

కాని అసలు పరిస్థితి అంత సులభంగా తేల్చేసేది కాదు. ఆ మర్నాడు నాకూ అటువంటి ఆపరేషనే జరగవలసి వుంది : అందుకోసమనే మా ఊరినుంచి సకుటుంబంగా వచ్చి డాక్టరుయింట్లోనే బస చేశాను. నాకు జరగవలసినది, అంత పెద్ద ప్రమాదకరమయిన ఆపరేషను కాకపోయినా, నాకు మాత్రం భయంగానే ఉంది లోలోపల. డాక్టరుగారు నాకు ఎంతో స్నేహితుడె అయినప్పటికీ, ఆయన చేతిలో కత్తికీ, నాకూ ఏం స్నేహం

లేదనిపించింది. ఈ రోజున ఈ ఆపరేషను చూసినందువల్ల. ఒకవేళ నాకు భయం ఎక్కువ అవవచ్చునుకూడాను.

అయినా ధైర్యం చేసుకు డాక్టరుగారితో వెళ్ళాను. ఇవాళటి ఆపరేషను ఎవరికి, ఏమిటి అని ఒక్క ప్రశ్నకూడా వెయ్యలేదు నేను. "మజ్జిగ తెచ్చే ముందరే ఉప్పు అడగటం ఎందుకులే" అనుకుంటూ బయలుదేరాను. కాస్సేపుంటే పరిస్థితి ఏమిటో దానంతట అదే అర్థమవుతుందిగా!

అసలు ఆ రోజు ప్రొద్దున్ననుంచీ కాస్త జల్లు పడుతూనే వుంది. ఆసుపత్రిచుట్టూ శుభ్రంగావుంచె ఆవరణ యావత్తూ ఈదరగాలివల్ల ఎగిరి వచ్చిన తుక్కుతో నిండిపోయింది. ఎదురుగా హారం లాగా నిలబడివున్న నిమ్మచెట్లు గాలికి తెగ ఊగుతున్నాయి. ఆకాశం అక్కడక్కడ మట్టుకే నీలంగా వుంది. భూమిమీద మేఘాల నీడలు పరిగెడుతున్నాయి. శ్రావణ మాసపు చలి శరీరాన్ని వేధిస్తోంది. వాతావరణం అంతా అదో మాదిరిగా నిరుత్సాహంగా విచారపూరితంగా వుంది.

ఈ వాతావరణ ప్రభావము నా మనస్సుమీదకూడా ప్రసరించింది. అటువంటి మన స్థితిలోనే, నేను ఆపరేషను గది ప్రవేశించాను. అక్కడి సంరంభం అంతా చూసేటప్పటికి నా మనసులో కూడా ఏదో కలవరం బయలుదేరింది.

డాక్టరుగారి సహాయార్థం వచ్చిన, మత్తుమందు యిచ్చే డాక్టరు ఒకాయన - ఆ మైకం యిచ్చే యంత్రందగ్గిర ఏమిటో తనిఖీ చేస్తున్నాడు. ఆపరేషను టేబిలు వెనుకప్రక్కని. శుద్ధిచేసిన కత్తులూ, కత్తెరలూ వరుసగా పేరుస్తున్నారు. ఇంకో యిద్దరు వ్యక్తులుకూడా అటూ యిటూ తిరుగుతున్నారు - నిశ్శబ్దంగా. అసలు అక్కడవున్న ప్రతి వస్తువుమీదా, ప్రాణిమీదా "శబ్దం చేయవద్దు" అని డాక్టరుగారు ఒక ఆంక్ష విధించి నట్లున్నారు.

డాక్టరుగారు అన్నిటివేపూ ఒక్కసారి పరీక్షగా పరకాయించారు. అన్నీ సరిగానే వున్నాయని దృఢం చేసుకున్నతరువాత, తలుపు దగ్గిరికి వెళ్ళి అక్కడవున్న సేవకుడితో, "ఆవిణ్ణి తీసుకురండి" అని అతి మెల్లిగా చెప్పాడు.

ఆ ఆజ్ఞ నాకు వినబడింది. 'ఓహో! అయితే ఆడమనిషికి కాబోలు యీ ఆపరేషను' అని మనసులోనే అనుకున్నాను. ఇంతట్లో రోగిని తీసుకునివచ్చారు. మనిషి పెద్ద యెత్తరికాదు; పొట్టికాదు. వయసుకూడా వడివయస్సే. క్రిందభాగం ఒక పరికిణీలోనూ, పైభాగం ఒక శుభ్రమయిన దుప్పటిలోనూ వుంది ఆవిడ శరీరం. ఆ దుప్పటి కొస ఒకటి లాక్కుని నోటిలో కుక్కుకుంది. అంచేత ఆవిడ ముఖంలో సాకు కనిపించినవి ఆవిడకళ్ళూ, నుదురూను. కళ్ళల్లో విశేషంగా ఏ భావమూ లేదు. నుదురుమాత్రం తెల్లగా స్వచ్ఛంగావుంది. (అంటే; బొట్టులేదు)

ఆవిడ టేబిలుమీదకి ఎక్కింది. భయంతో ఆవిడ వణికిపోతూ వుండి వుండాలి. కాని ఆ భయం బయటికే కన్పించలేదు. ఆవిడ డాక్టరువేపు ఒకసారి దీనంగాచూసి ఏదయినా మాట్లాడుతుందనుకున్నాను. కాని అటువంటి పనేం చెయ్యలేదు. నా కాశ్చర్యమేసింది.

టేబిలుమీద పడుకున్నతరవాత, టేబిలుని కావలసిన ఎత్తులో అమర్చి ఆపరేషను కార్యక్రమం ఆరంభించేశారు. మత్తుమందుచేత ఆవిడ స్మారకం పూర్తిగా పోయినతరువాత డాక్టరుగారు కత్తి చేతోపుచ్చుకున్నారు. నేను కళ్ళు గట్టిగా మూసుకున్నాను. క్షణంసేపయాక, నేను కళ్ళు తెరిచేటప్పటికి, డాక్టరుగారు సమర్థతతో, ఆత్మవిశ్వాసంతో చకచకా ఆపరేషను సాగించటం కనుపించింది. ఒక్కొక్క పనిముట్టు అందుకోవటం, ఉపయోగించడం, బేసిన్‌లో ఒదిలెయ్యటం జరిగిపోతోంది. 'కుశ్‌శ్' మంటూ రక్తనాళాలకి బిగించే పటకార్లు శబ్దం చేస్తున్నాయి. ఆవిడ పొట్టలో గోతులు తవ్వేస్తున్నారు. నా కడుపు దేవించిపోయింది.

ఆ తరువాత రెండుగంటలకి పైగా శ్రమపడి, తన వంటిమీంచి సోలెడు చెమట పోయిన తరువాత, డాక్టరుగారు ఆవిడ కడుపులోంచి ఒక పెద్ద బత్తాయికాయంత నెత్తురుముద్ద పైకి ఎత్తారు. ఆ రణాన్ని ఆవిడ పేగులలోంచి విడబర్చటానికి ఇంకో పదినిముషాలు పట్టింది. పాపం: ఈవిడ ఎన్నాళ్ళనుంచి ఈ రణం తన కడుపులో మోస్తోందో దేముడికే తెలియాలి - అనిపించింది. ఇంతసేపటినుంచీ కదలక మెదలక స్థాణువులా నుంచున్నందువల్ల నా కాళ్ళు తిమ్మిరిలెక్కాయి శరీరం కొయ్యబారిపోయింది. అంచేత తొందరగా బయటికివచ్చి, తిన్నగా డాక్టరుగారింటికి వెళ్ళిపోయాను.

ఆ మర్నాడు సరిగ్గా అదే వేళకి, అదే హాలులో నాకూ ఆపరేషను జేశారు. అప్పటి శస్త్ర ఆయుధాలే. అప్పటి మనుషులే. ముఖ్య పాత్ర మాత్రం మార్పు. నిన్న ఒక స్త్రీని. ఇవాళ నేను పురుషుణ్ణి. కాని, ఆ భయమూ, ఆ అనుమానమూ, ఆ నిస్సహాయతా. వాటిల్లో మట్టుకు మార్పు ఏం లేదు.

ఆపరేషను అయిన తరువాత నన్ను ఒక గదిలో పడుకోబెట్టారు. ఆ గదిలో యింకో మంచంకూడా వుంది. ఆ మంచం మీద ఎవరున్నారో అనే కుతూహలం కొద్దీ ఓసారి తల త్రిప్పి ఆ వేపు చూశాను. నిన్న ఆపరేషను చేయించుకున్న అమ్మాయే ఆ మంచం మీద వుంది. ముక్కులలో రబ్బరుగొట్టాలతో పడివుంది. నా నాడి పరీక్ష అదీ చేసి, డాక్టరుగారు ఆవిడ మంచం దగ్గరకి వెళ్ళాడు. ఎంతో అనునయమయిన స్వరంతో "ఎలా వుందమ్మా" అన్నారు.

ఆవిడ ఎదురు చూస్తున్న దందుకే, "అమ్మో, నాయనో" అని ఏడిచింది. తల యిటూ అటూ కొట్టుకుంటూ, దగ్గుతూ తనకు చాలా బాధగా వున్నట్టు తెలియపరిచింది. "ఆఁ నా కేం బాగుంద లేదండోయ్ : అ.... య్యో....అమ్మా : కడుపుబ్బిపోతోంది. సూదులు గుచ్చినట్టుంది-అమ్మో !"

మూత్రం స్తంభించిపోయిం దేమోలే, తీసెయ్యమని చెబుతాను - యింకో రెండు మూడు రోజులు అలాగే యిబ్బంది పెడుతుంది. ఆ తరువాత బాగయిపోతుందిలే" అంటూ ఎంతో ఊరడింపుగా చెప్పాడు డాక్టరు.

ఆసుపత్రిలో చేర్పించటానికి ఆవిడని వెంటబెట్టుకుని ముగ్గురు మనుషులొచ్చారు. ఇద్దరు మగవాళ్లు : ఒక ఆడావిడాను. ఒకరికి తోడుగా రెండో మనిషి. రెండో మనిషికి ధైర్యంగా మూడవ మనిషిని. కాని ఆ రోగికి ధైర్యం చెప్పడానికిగాని, తోడుగా వుండటానికికాని ఎవరూ ఉండే వారు కాదు. అంతా చుట్టాలేకాని ఆవగింజంత సహాయం చెయ్యరన్న సామెతగా వుండేది.

నాకు బాధ అంతగా ఉండేదికాదు. అంచేత నెమ్మదిగా కదలకుండా పడుకుని వుండేవాణ్ణి. కాని అలా వెల్లకిలా పడుకునే ఉండవలసి రావటం బింకుగా వుండేది - కాని ఆవిడ గాయం బాగా లోతయినది. పేగులవరకూ

తీసినగొయ్యి. అంచేత దివారాలు బాధపడేది. బాధ మరీ ఎక్కువయినప్పుడు కేకలేసేది. ఆవిడ అలా బాధతో కొట్టుకుంటూనే, నా వేపు చూసేది అప్పుడప్పుడు. నేను శాంతంగా పడుకోవటంవల్ల ఆవిడకి అసూయ కలిగేది. మూడవ రోజున డాక్టరుగారు మా దగ్గరకి వచ్చినప్పుడు నావేపు వేలుపెట్టి చూపిస్తూ "ఆయన రాత్రంతా హాయిగా నిద్రపోతున్నాడు! మరి నాకు నిద్రపట్టదేం, నేనొక్కత్తెనే ఎందుకింత అల్లాడిపోవాలి? ఆయన కిచ్చే మందే? నాకూ ఇవ్వండి!"

డాక్టరు ఒక్క చిరునవ్వు నవ్వి, నాడి చూడడం ముగించేవాడు. ఎంతని సముదాయించగలడు ఆయన మాత్రం! "ఇంకో రెండు మూడు రోజుల్లో నువ్వుకూడా బాగానే నిద్రపోతావులే!" అంటూ వెళిపోయేవాడు. ఇదెక్కడి అసూయపరురాలురా బాబూ అనిపించేది నాకు. కాని, మళ్ళా ఆ రాత్రి ఆవిడకి కడుపుఉబ్బి, కాళ్ళూ చేతులూ కొట్టుకుంటూ మూలగడం ప్రారంభించినప్పుడు ఎంతో జాలివేసింది.

జాలిపేసి మాత్రం నేను చేయగలిగిందేముంది? నేనూ ఆవిడకి మల్లేనే మంచానికి కట్టేసివున్నవాణ్ణే! లేవడంకూడా కూడదు. సాధ్యమూ కాదు. రాత్రి రెండుగంట లయింది! ఆస్పత్రి అంతా నిశ్శబ్దంగా వుంది. నౌకర్లుకూడా ఎక్కడో వెనకభాగంలో వున్నారు కాబోలు - కునికిపాట్లుపడుతూ. పోనీ, గట్టిగా కేకవేసి పిలుద్దామూ అన్నా నా నాలుక అంగుడికి అంటుకిపోయింది. నోట శబ్దమే రాలేదు. ఆవిడ ఏడుపులూ, కేకలూ వినడం దుర్భరమే ననిపించింది. అవసరం లేదుకదా అని నా మంచందగ్గిర నా బంధువు లెవరూ పడుకోలేదు. ఆవిడకి యెంతో అవసరమున్నా దగ్గరలో పడుకోవాలని ఆవిడ బంధువులకి తోచనేలేదు. ఆఖరికి నేను గట్టిగా చప్పట్లుకొట్టడం ప్రారంభించాను.

ఒకటి....రెండు....మూడు....నాలుగూ! నాలుగోసారి నౌకరుకి వినపడింది. ఆదరా బాదరా మా గదిలోకి వచ్చింది. నా ప్రక్క మంచం మీది రోగి చాలా సేపటినుంచి బాధపడుతోందని చెప్పాను. ఆవిడ వెళ్ళి యింకో ఆడమనిషిని తీసుకొచ్చింది. వాళ్ళిద్దరూ ఆవిడ కడుపుబ్బరం తగ్గించారు - ఆ తర్వాత ఆవిడ కాస్త శాంతంగా పడుకుంది.

ఆ మర్నాడు అడిగాను ఆవిణ్ణి :

"ఏవూరమ్మా మీది ?"

"మాదాండి ? 'వేంగుళే' అన్న వూరు ఎరుగుదురా మీరు ? అక్కడినుంచి రెండుకోసులు : మాదో కుగ్రామం "కోళమే" అంటారు మావూరుని."

"అయితే నీతోవచ్చిన మనుషులు ఊరికే అలంకారంగా వచ్చారా ఏమిటి. వాళ్ళ నడత నాకేమి అర్థంకావటంలేదు సుమా."

ఆవిడ యింకొంచెం నావేపుతిరిగి తన నుదుటిమీద మధ్య వేలు పెట్టుకుని "యిది పోగానే అందిరికీ ఆపేక్షపోతుంది. విధిలేక నన్నిక్కడికి తీసుకొచ్చారంతే !"

"నీకూ, వాళ్ళకీవున్న చుట్టరికమయినా ఏమిటో చెప్పు నాతో."

"రెండు చెవులు కప్పేలాగ తలపాగా చుట్టుకుని, ఈ గదికి అవతల అవతలేనుంచుని ఆ గాజు తలుపుల పైనుంచి బెదురు బెదురుగా నా వేపు ఒకటి రెండుసార్లు చూస్తాడే, అతను మా మరిది. నాకు 'టీ' తీసుకొచ్చి యిచ్చేవాడు మా అన్నయ్య.

సాయంకాలమప్పుడు నున్నగా తలదువ్వుకుని, పువ్వులు పెట్టుకుని బిడియపడుతూ గదిలోకివచ్చి, గజంమారంనుంచే నన్ను ఒకటి రెండు మాటలడుగుతుందే ఆవిడ మా ఆడబిడ్డ !"

ఒకళ్ళు మార్చి ఒకళ్ళు, ఎవరో ఒకరు వచ్చి ఆవిడ దగ్గర ఎల్లప్పుడూ వుండాలనీ, ప్రక్కన కూర్చోవాలనీ, ఆవిడ తల నిమురుతూ ధైర్యం చెప్పాలనీ, చేతనయినంత పరిచర్య చెయ్యాలనీ, సానుభూతి చూపించి ఆవిడ దుఃఖం తగ్గించడానికి ప్రయత్నించాలనీ ఆశపడేవాణ్ణి నేను. కాని వాళ్ళల్లో ఏ ఒక్కళ్ళు, ఏ ఒక్కటి చెయ్యలేదు :

నా భార్య వచ్చి, నా దగ్గర చాలాసేపు గడిపేది. పైగా నన్ను చూసిపలకరించి పోవడానికి ఎం మంది వచ్చేవారు. అదే ఆవిడకి కాలక్షేపం. నా కోసంవచ్చిన ప్రతి మనిషి వేపూ కళ్ళప్పగించి చూసేది. మేం నవ్వుతూంటే, తనూ నవ్వుతూ మొఖం అటు త్రిప్పుకునేది. ఓసారి అటు

వంటప్పుడే ఆవిడకి బ్రహ్మాండమయిన పొడిదగ్గువచ్చి ఊపిరి సలప లేదు. నాకోసం వచ్చిన స్నేహితులంతా ఆవిడ మంచం చుట్టూ మూగారు.

ఈ పరిస్థితి నాకేం నచ్చలేదు; అంచేత ఆ సాయంత్రం ఆవిడ అన్నగార్ని నా మంచం దగ్గిరకి నేనే పిలిచాను. నాలుగూ పెట్టాను.

"ఏమయ్యా! మీరింతమంది వచ్చారు ఆవిడవెంట – ఎందుకూ? ఆవిడ ఇక్కడ చావుబతుకులమీదుంటే మీరు ఊరుమీద షికార్లు తిరుగుతున్నారా?"

నే వేసిన మాత్ర పనిచేసింది. ఆ రాత్రి వాళ్ళ అన్నయ్య తన బిచాణా తెచ్చుకుని ఆవిడ మంచందగ్గిర వేసుకున్నాడు.

మూడురోజులు టీ, పాలూ తాగుతూ నిభాయించుకుంది. ఆ తర్వాత మాత్రం తిండి తిండి అని గోల మొదలుపెట్టింది. తన దగ్గిరకి డాక్టరు వచ్చినా, నర్సువచ్చినా ఒక్కటే పల్లవి పాడేది.

"నాకు తినడానికి ఏమయినా పెట్టండి?"

"ఏం తింటావమ్మా" అని అడిగాడు డాక్టరు.

"సాంబారూ, అన్నమూ, చపాతీలూ, కూరా!"

ఈ వాంఛలువిని డాక్టరుగారు నవ్వాలా, ఏడవాలా? ఆవిడలోకంలో వున్నవన్నీ తినాలంటూంది. ఆవిడ పొట్టలోంచి పెద్ద కొబ్బరికాయంత రణాన్ని నిన్నగాక మొన్న తీసేశారు. అంచేత పొట్టంతా ఖాళీగా వున్నట్టనిపిస్తోం దేమోమరి ఆవిడకి. అంచేతనే తినగలిగినవన్నీ తిని ఆ ఖాళీ భర్తీచేద్దామనే కోరిక పుట్టింది కాబోలు!

"ఇంకొక్క రెండు రోజులు ఆగు. నువు కోరినవన్నీ తినిపిస్తాను" అన్నారు డాక్టరుగారు. కాని ఆవిడకి రెండు రోజులంటే రెండు యుగాలుగా కనిపించింది. ఆవిడక్కావలిసింది 'రేపు' అని ఆశపెట్టడం కాదు. ఇప్పుడు ఆకలితీర్చటం, యింతల్లో ఆవిడ యిటుచూస్తే నా భార్య నా కోసం తెచ్చిపెట్టిన నిండు పళ్ళెం! షడ్రసోపేతంగా చేసిపట్టుకొచ్చిన భోజనం.

దానివేపు చూస్తేనే ఆవిడకి నోరూరుతోందని ఆవిడకళ్ళకేసి చూస్తేనే తెలిసిపోయింది. ఆవిడ ముఖంలో ఒక విధమయిన కళ వచ్చింది. ఆవిడకే కనుక లేచినిలబడ్డానికి ఏ మాత్ర మవకాశం, ఓపికవున్నా గాయపడిన

పొట్టని ఒకచేత్తో పట్టుకుని నా పళ్ళెంముందుకువచ్చి అమాంతం అన్నీతినేసే సేది అనిపించింది.

కూరగాయల నేతి తాళింపు వాసనలు- ఆ పప్పు పులుసు పొగలు రావడం చక్కగా ఎర్రగా వేయించిన వేపుడు ముక్కలు - కాని యివన్నీ నాకు మాత్రం ఎలా రుచిగా నోటి కెక్కుతాయి ? ఎట్ట ఎదుట ఎంతో ఆకలితో ఒక ప్రాణి అన్నం కోసం అల్లాడిపోతుంటే యిక్కడ నేను యివన్నీ జర్రుకోగలనా ?

ఇంకో రెండు రోజులయాక ఆవిడని అన్నం తినవచ్చునని అను మతి యిచ్చారు. కాని ఆ రోజున ఆవిడ అన్నగారు ఆవిడ ముందు ఏం పెట్టారని ? అన్నం మెతుకులతో వున్న గంజీ, కాస్తంతా పచ్చడీని.

"ఇదా ? ఈ గంజా తెచ్చావు."

"ఇది వుడక బెట్టడానికే యింత సేపయింది - కట్టెలే దొరకలేదు. ఉత్త తడిసిన కట్టెలు - చచ్చినా అంటుకోలేదు. ఇదయినా దొరికింది. అదృష్టమే అనుకో."

"నిజమేలే, అదీ నిజమే !"

ఆవిడ ఏమాత్రం యిష్టంలేకుండానే ఎంగిలిపడింది. మొగం మాడ్చు కుని అదేమింగటం మొదలుపెట్టింది-నా కావిడని చూస్తే చాలా జాలివేసింది. ఆవిడ అన్నగారు నా వేపు వీపుత్రిప్పి నుంచున్నాడు-అది గమనించి "ఇష్టంలేకపోతే తినకు-యింకొంచెంసేపటిలో, నా భోజనం వస్తుంది" అని సైగచేశాను. ఆవిడ ఆ సైగ అర్థంచేసుకుంది. వెంటనే అన్నగారు పట్టుకు నుంచున్న కంచము అవతలకి తీసేసింది.

12 గంటలు కొట్టేటప్పటికి, నా భోజనం పట్టుకొచ్చింది నా భార్య- అందులో కొంతతీసి ముందు ఆవిడకి పెట్టించాను. ప్రతి పదార్థమూ రుచిగా ఉన్నది. ఆవిడ కళ్ళు కృతజ్ఞతతో మిలమిలలాడిపోయాయి. నేనేహో మహా ఉదార చక్రవర్తిలాగా కనిపించా నావిడకి.

ఆ తరవాత రెండు మూడు రోజులు యిల్లాగే జరిగింది. భోజనంలో సగభాగం ఆవిడకి వడ్డింపించేవాణ్ణి. క్రమంగా ఆవిడ నాకు వచ్చిన అన్ని వస్తువుల్లో చెరిసగం వాటాదారిణి అయింది. 'టీ' అయినా, భోజనమయినా,

పళ్ళు అయినా సగం ఆవిడకి-యిలా జరుగుతుండగా ఉన్నట్టుండి ఓ రోజున వద్దన్నది. ఆ రోజున ఏ వస్తువు యివ్వబోయినా చేయిచాచలేదు-నన్నవమానం చేస్తున్నట్లనిపించింది నాకు.

"ఎం చేతమ్మా" అని అడిగాను.

తినడానికి బాగున్నాయికదా కనీ, అడగకుండానే పెడుతున్నారుగదా అని, ఎన్నాళ్ళని పరాయివాళ్ళ సొత్తు తింటూ కూచోవడం? యిట్టాటి అలవాటు చేసుకోవడం మంచిదికాదు. నాలాటివాళ్ళకి బొత్తిగా మంచిదికాదు. దేముడిచ్చిన ఆయుర్దాయం అపనిందలు రాకుండా గడుపుకోవాలంటే యిటువంటి కోరికలకి లొంగకుండా వుండడమే మంచిది.

"నువ్వొక విచిత్రమయిన పిల్లవి."

"విచిత్రమయినది నేనుకాదు. నా దురదృష్టము."

"అవును, అదీ గమనిస్తూనే వున్నాను."

"భగవంతుడు మొదట్లో నన్ను బాగానే చూశాడు - బంగారపు కంచంలో పరమాన్నం పెట్టాడు." ఉన్నట్టుండి ఆ కంచం లాగేశాడు.

మా ఆయన ఎంతో ఆపేక్షగా చూసేవారు. నా అరచేతిలో గచ్చకాయలు వుండేలాగ; నా చెప్పుచేతల్లో. అందువల్ల అందరిలోనూ నా పరువు హెచ్చయింది. నా కెవరయినా కష్టం గలిగిస్తే ఆయన కనుబొమలు చిట్లించేవారు; అంచేత యింటిల్లిపాదీ నన్ను మర్యాదగానే చూశేవారు. హఠాత్తుగా ఆయనకి పైనుంచి కబురు వచ్చింది, వెళిపోయారు, ఇహ యిప్పుడు నా భారం అంతా ఆ నారాయణుడిదే."

"విధిని మార్చడం మనవల్ల ఏమవుతుంది?"

"అన్నింటికీ విధేకారణంకాదు"- సగం విధి చేసినపనీ, సగం మనుషుల నడతాను. భర్తపోవడం విధికృత్యమే, దురదృష్టమే - నా కడుపులో ఆపరేషను చేసి ఏదో తీసెయ్యవలసిరావడం దురదృష్టమే కాని ఊళ్ళో వాళ్ళందరూ నన్ను నానామాటలు అని హింసపెట్టడమో? దానికీ, విధికీ ఏమిటి సంబంధం? ఇంతకీ 'విధీ,' దురదృష్టం అని వేటినంటాం -వాటి అర్థమేమిటి."

"ఏముంది, మనం ఏమేమి అనుభవించాలసివస్తుందో అదంతా విధి

అనుకోవాలి. సహజంగా ఏర్పడ్డ కష్టాలయితే విధివల్లా, మానవులవల్ల ఏర్పడ్డవయితే మన దురదృష్టమూ అనుకోవాలి.

"అసలు అవతలి మనుషులేమన దురదృష్టాలు-సరే, నాకు పసుపూ కుంకుమా పోయాయి - కాని ఆ విచారాన్నయినా నన్ను జోక్యంచేసుకోకుండా అనుభవించనివ్వలేదు.

నెత్తినపడిన వైధవ్యాన్ని భరించటానికి ప్రయత్నిస్తున్నాను నేను. అప్పుడప్పుడు పొంగివచ్చే దుఃఖాన్ని దిగమింగటానికి ప్రయత్నం చేస్తున్నాను. అప్పుడప్పుడు ఎవరికీ కనిపించకుండా ఒక చీకటికొట్లో పడి ఉండిపోతున్నాను. కాని వైధవ్య దుఃఖంలోవున్న ఈ ఏకాంత సుఖానికి కూడా వాళ్ళు నన్ను దూరం చేశారు."

"అంటే ఏం, ఏం జరిగిందేమిటి ?"

"పొట్టలో ఈ రోగం వచ్చిందిగా."

"వస్తే వచ్చింది, యిప్పుడు పోయిందిగా !"

"కాని ఎలా పోయింది ? నా వంట్లోంచి సగం రక్తం తీసుకుపోయింది. నా పసుపూ, మర్యాదా పట్టుకుపోయింది."

"అదేమిటి ?"

"సరే ఈ మాత్రంకూడా అర్థమవటంలేదూ మీకు. జనమంతా నేను చెడిపోయాననుకున్నారు. కడుపు పెరుగుతూంటే గర్భవతినయ్యాననుకున్నారు."

"అదేమిటి అలా ఎలా అనుకున్నారు. అదేదో రోగమో రాష్ట్రో" అని ఎందుకు అనుకోలేదు ?

"ఏమండోయ్ ! యిప్పుడు మీకు పొట్టపెరిగిందనుకోండి, లేకపోతే ఒక ముసిలిదానికి పొట్టపెరిగిందనుకోండి. అప్పుడది రోగం అనుకునేవారు జనం. నేనేమో వయసులోవుండి, బలంగావున్నదాన్ని, పైగా విధవదాన్ని. అంచేత వాళ్ళకు నన్నుగురించి అటువంటి అనుమానమే మొట్టమొదట వస్తుంది. అసలు యింతకీ మా కొంకణదేశపు మనుషులే ఒకరకం మనుషులు. మీకు తెలియదు కాబోలు ! వాళ్ల చేతులతోకాదు. కాళ్ళతోటే ముడి వెయ్యగలరు.

"ఈ జబ్బు ఆరంభమయిన మొదట్లో నాకు, ఏదో కడుపులో తిప్పు తున్నట్లుండేది. అన్నం సయించేదికాదు తింటే ఒంటబట్టేదికాదు. చేతులూ కాళ్ళూ పేళ్ళాడిపోయేవి. ఎవరితోనూ మాట్లాడకుండా, ఏ పనీ చెయ్యకుండా ఎక్కడో ఓమూల అలా పడి వుండాలనిపించేది. చేతులురెండూ పొట్టమీదికి చేరుకునేవి. నా చూపుకూడా పొట్టమీదే వుంటుండేది. పొట్ట బాగా ఎత్తుగా కనిపించేది.

నా, ఈ పరిస్థితి ఆడబిడ్డ కనిపెట్టింది. మొట్టమొదటగా ఆవిడ మనసులో ఉద్భవించింది అనుమానం. "అమ్మా ! వదిన లక్షణాలు ఏం బాగుండలేదేవ్" అని మా అత్తగారితో చెప్పింది. ఆ తరువాత మా అత్తగారి దృష్టి నా పొట్టమీదే పడింది. ఆవిడకీ అనుమానం పట్టుకుంది. అంచేత మా మరిదితో చెప్పింది. అతనుమట్టుకు "అమ్మా ! నీకు రోచి నట్టంతా మాట్లాడకు. వదిన అట్లాంటిది కాదు; పైగా ప్రతిక్షణమూ నీ యెదటనే వుంటూందిగా ! ఇంకా ఎందు కనుమానం ?" కాని మా అత్త గారికి కా సమాధానం నచ్చలేదు. "నీకు తెలియదురా నాయనా ! మన కళ్ళల్లో పెట్టుకున్న కాటిక - మనం కానకుండా (మనకి కూడా తెలియకుండానే) కాజేసే వాళ్లుంటారు !" అంది.

ఆ తర్వాత సమయమూ, సందర్భమూ లేకుండా నామీద కస్సు బుస్సు మనేది. నే నావిడకి దణ్ణంపెడుతూ చెప్పుకున్నాను "నన్ననవసరంగా పొష్టు పెట్టకండి : నేను నెల నెలా......."

కాని, దానివల్లా ఆవిడకి తృప్తికలుగలేదు. "నా దగ్గర అదంతా చెప్ప నక్కరలేదు. చాలా మంది యిల్లాళ్ళ కవుతూంటుంది అలాగ. అయినా గర్భం వృద్ధిఅవుతూనే వుంటుంది." ఇంక ఆ మీదట నే చెప్ప గలిగిందే ముంది?నాకా విషయాల్లో అనుభవంలేదు. నా సంసార యాత్ర ఆ మజిలీ వరకూచేరుకోనేలేదు మరి ! అంచేత అనుభవం వున్న అత్తగారిలాటి వాళ్ళు చెప్పిందే ప్రమాణం...."

అంచేత నేనూ అల్లాగే అను కున్నాను-కాని అలా అనుకోవటమూ నాకు రెండు విధాల సమస్య అయిపోయింది. యిది నిజంగా కడుపే అయితే ఇదేదో అతి విచిత్ర మయిన సంగతే అనుకోవాలి. నే నీ రోజు వరకూ

ఎంతో జాగ్రత్తగా మసలు కొంటున్నాను. ఎవ్వరి తోటీ పలకరించే పరిచయం కూడా పెట్టుకోలేదు. మరి యిదెట్లో సంభవించింది ఎట్లాగా అని !

నాకు పిచ్చి పట్టినట్టయిపోయింది. మొదట్లో యిది జబ్బు అనుకున్నాను. కాని అత్తగారు, ఆడబిడ్డా, యిద్దరు అనుభవం గలవాళ్లు, మళ్ళీ యిది జబ్బు కానేకాదు. కడుపే అన్న తర్వాత, నాకు అన్నం యిమడక పోవడం చూసి,వాళ్ళు వేవిళ్ళని తీర్మానం చేసిన తరవాత నేను మాత్రంకాదనిఎట్లా అనగలను. కాని అవుననడానికి మాత్రం ఆధారం ఏదీ?

అంచేత గట్టిగా ఆలోచించటం మొదలుపెట్టాను. ఎంత ఆలోచించినా నాది ఒక పల్లెటూరి పిల్ల ఆలోచన ! ఆలోచించగా, ఆలోచించగా ఏమనిపించిందంటే, నేను ఏ పాపమూ చెయ్యలేదు, అయినా గర్భం ఏర్పడింది పైగా అది నెల నెలా ఎదుగుతోంది. అంచేత యిది ఏదో కలలో జరిగినదానిఫలితమే అయివుంటాలి. ఎంచేతంటే ఆయన నాకు అనేకసార్లు కలలోకి వచ్చేవారు. మేలుకున్నప్పుడు దేనికోసం పరితపించి పోయేదాన్నో అది స్వప్నంలో లభించేది నాకు.

నిజానికి, ఆ రోజుల్లో నేను కలల్లోనే మేలుకునుండేదాన్ని. కలల కోసమే నిద్రపోయేదాన్ని. నాకు ప్రతిరోజూ కలలువచ్చేవి. కాని చాలా సార్లు భయంకరమయిన కలలొచ్చేవి. పెద్దపులితోకా, మనిషిశరీరం, నక్కముఖమూ వున్న విచిత్రమయిన స్వరూపాలు కనిపించేవి. అవి నాఎదట తెయ్యిమని ఆడేవి. అనేకసార్లు నాకు పెళ్ళి అవుతూన్నట్లుకూడా కలలు వచ్చేవి. తీరా పూలదండ వెయ్యడానికి దగ్గిరకివెళితే, ఆ దుర్మార్గుడు భగవంతరావు నుంచుని వుండేవాడు వరుడుగా.

నే మనసారా కోరుకున్న స్వప్నాలు మాత్రం ఎన్నాళ్ళకో ఓ సారి వచ్చేవి.

దూరప్రయాణం చేసివచ్చిన వారిలాగ యింట్లోకి వచ్చేవారు ఆయన. కాళ్లు కడుక్కోవటానికి నీళ్లయిచ్చి, అప్పుడు పితికిన పాలతో 'టీ' చేయడానికి లోపలికెళ్ళేదాన్ని, టీ కి నీళ్లు కాగుతున్న సమయంలోనే, నేను శుభ్రమయిన చీర రవికా వేసుకునేదాన్ని. ఆ తరువాత ఫలహారపు పళ్ళెం పట్టుకుని, ఒయ్యారంతో సిగ్గుతో ఆయన ఎదుటకి వచ్చేదాన్ని.

ఆయన ఒక్క క్షణం వృథాపోనిచ్చేవాడు కాదు. ఆయన అసలు రావడమే నన్ను నలిపెయ్యటానికి -

అంచేత యీ స్వప్నాలవల్లనే యింత పనీ జరిగివుంటుందని నిశ్చయించుకున్నాను. అంతే మరి. కేవలం ఒక మంత్రం జపించటం వల్ల కుంతికి గర్భం ఏర్పడలేదూ, హనుమంతుడి చెమట బొట్టు మింగినందువల్ల మొసలికి సంతానం కలగలేదూ? మరి నాకు మాత్రం స్వప్నంలో జరిగిన సాక్షాత్కార ఫలితంగా జీవితంలో ఫలితం ఎందుకు కలగకూడదు ? - మరి నిజంగా అంతే అయితే అసలు నా కిప్పుడు వచ్చిన అపాయం మట్టుకు ఏముంది.

ఆయన నాకు కలలోకి వచ్చినట్లుగానే, వాళ్ళ అమ్మగారికి, చెల్లెలికీ, తమ్ముడికీకూడా కలలో కనుపించేసి, "నా భార్యకి ఏర్పడిన గర్భం నావల్లనే:-అంచేత మీరు దాన్ని అనవసరంగా రొష్టుపెట్టకండి...." అని చెప్పేస్తారు తప్పకుండా.

కాని అటువంటి దేమీ జరగనేలేదు. జరిగిందంతా అపసవ్యంగానే జరిగింది-ఊరు ఊరంతా నేను ఏదో అకార్యం చేశాననే వార్త పాకి పోయింది-రాజవీధిలో పాతళగంగ చిమ్ముతోందంటే, ఖర్చులేకుండా గంగాస్నానం చెయ్యొచ్చనుకునేవాళ్ళు చాలామంది బయలుదేరతారు. అంచేత ఊళ్లోవున్న ఆడమూకంతా నన్ను చూసిపోవడానికి రావడం మొదలు పెట్టారు. తరవాత యిళ్ళకువెళ్ళి ఆడిపోసుకోవటం తప్పదుకదా. అత్తగారు, ఆడబిడ్డకూడా వాళ్ళతోటే కలిసేవారు. మనయింట జరిగిన పొరపాటు మరుగుగా వుంచుకుందామనే పక్షపాతం వుండేదికాదు వాళ్ళకి. ఈ సమాచారం ఊరంతటా పొక్కింది. పసిపిల్లలికికూడా తెలిసిపోయింది.

దాంతో యిన్నాళ్ళనుంచీ పుట్టలో పడుకుని వున్న పాము పడగెత్తింది. పామంటే మా వూరి పెద్ద భుజంగరావన్నమాట.

ఆయనగారు తక్షణం మా యింటికి దయచేశారు. మొదటిసారి వచ్చినపుడు ఆ కాకిదృష్టితో ఓసారి నా వేపు చూశారు. రెండోసారి మా మరిదిని "అవును వెంకటేశం, సాధారణంగా మీ ఇంటి కెవరొస్తుంటారు" అని దరియాప్తు చేశారు. "ఎవరూ రారే" అన్నాడు మా మరిది. మాడో

సారి వచ్చి మా అత్తగారిని బెదిరించాడు. "ఇదుగో, మీ యింట్లో పాపం వృద్ధి అవుతోంది. మీరది వదుల్చుకోవాలి. లేకపోతే ఈ సంవత్సరం గ్రామ దేవత జాతర మీ ఖర్చుమీద జరగాలిసి వస్తుంది. అంచేత మీ కోడలితో చెప్పి మర్యాదగా ఒప్పుకోమనండి."

నిజం ఒప్పుకోమనమంటే ఆయన అర్థం నేను ఏ పాపం ఎరుగనని చెప్పటం కాదు. అది ఎంత నిజమయినాసరే, ఆయనకు కావలసినది నాతో పాటు ఈ పాపానికి భాగస్తుడెవరో వాడిపేరు చెప్పటం. అసలు ఆ వూళ్లో వాళ్ళందరికి అతను ఎవరో తెలుసుకోవాలనే తహ తహ మహా ఎక్కువయిపోయింది. వాడెవరైనాసరే పట్టి తీసుకొచ్చి మా యిద్దర్నీ గాడిద మీద వూరేగించి వుత్సవం చూడాలనే కోరిక పుట్టింది. కాని ఎంత మంది ప్రయత్నం చేసినా ఆ మనిషి ఎవరో అంతైనా చిక్క లేదు. భగవంతరావు పంపించిన గూఢచారులు నాలుగుదిక్కులా తిరిగి ఏ వర్తమానమూ తీసుకురాలేకపోయారు. అంచేత యీ దుష్కార్యం ఇంట్లోవున్న వాళ్ళే చేశారని పుకారువేశాడు. మా మరిది ఈ వృత్తాంతం విని దిగాలుపడి పోయాడు. అతను అసలే వుత్త అమాయకుడూ, భయస్తుడూను. మీరుకూడా గమనించే వుంటారు. నా చుట్టుపక్కలకికూడా రాడు. అలా బయటనుంచే ఓసారి తొంగిచూసి వెళ్ళిపోతూంటాడు. అప్పుడతను వూళ్ళో తల ఎత్తుకోలేక పోయాడు.

కాని అంతటితో ఏమయింది? ఒకరోజున మూడు ఝాములప్పుడు భగవంతరావు మా యింటికొచ్చాడు. ఒక్కడే కాదు.నలుగురు పెద్దమనుషులని వెంటబెట్టుకుని|మరీని. దీని సంగతి ఏదో ఆ రోజున అంతు చూడాలనే వుద్దేశంతోటే వచ్చాడు. మమ్మల్ని అటూ యిటూ త్రిప్పుతూ మొక్కజొన్న పొత్తిలా కాల్చుకుతినాలని వచ్చాడు. మా మరిదిని పిలిచి ఎదురుగా కూచోబెట్టుకున్నాడు.

"జరిగింది జరిగినట్టు చెప్పు ఒప్పుకుంటున్నావా?"

మా మరిది గడగడలాడి పోయాడు, అతనికి పంచలోనే...యిప్పుడిది "ఒప్పుకొన్నాను" అంటే యిక ఆ వూళ్ళో వుండేందుకు వీల్లేదు.

"అనవసరంగా నన్ను బెదిరిస్తారెందుకు నాకేం తెలియదు. నే నేం

తప్పుచెయ్యలేదు. కావాలసివస్తే దేవుడిదగ్గర పువ్వుమీదెత్తి ప్రమాణం చేస్తాను" అంటూ ఏడుస్తూ చెప్పాడు.

కాని భగవంతరావు అలా ఎలా ఒదిలిపెడతాడు.అతను ఏదో విధంగా మా మీదనేరం మోపడానికే వచ్చాడు. 'మీ నాన్న ఎక్కడున్నాడో చూపించు లేకపోతే శ్రాద్ధమయినా పెట్టు" అన్నసామెత ఒకటివుంది. కాని మా మరిది తను చేసినట్టు ఒప్పుకోలేదు. ఇంకెవరిపేరూ చెప్పనూలేదు. ఇహ ఆఖరికి నన్నుబయటికి రమ్మనిపిలిచాడు. కొరతనివేస్తారని తెలిసిన మనిషికి బయలుదేరతీసినపుడు ఎలావుంటుందో నాకుతెలియదుగాని, నాకుమాత్రం కొరతశిక్షపడ్డట్టే అనిపించింది వాళ్ళ ఎదటికి వెడుతూంటే, ఎలాగయితేనేం వచ్చినుంచున్నాను నాస్వరం కరిగినీరయిపోతున్నట్లుతోచింది. ఆస్వరంతోనే.

"నేను మేలుకుని వుండగా, ఏమీ చెయ్యలేదు : దేవుడిసాక్షిగా ప్రమాణం చేస్తున్నాను, ఇక నిద్రలో ఏదయినా జరిగిందంటే అది నావశంలోది కాదు."

అప్పుడు భగవంతరావు అందుకున్నాడు,

"విన్నారాండి, మీరంతా ? స్వప్నంలో ఏర్పడిందట. చెబుతోంది. నమ్ముతారా మీరు ?....పసిపిల్లవాడు కూడా నమ్మడు, స్వప్నాలవల్ల సంతానం కలిగేట్టయితే, మనమంతా యిక ఆడపిల్లలకి పెళ్ళిళ్లు చేయవలసిన అవసరమేలేదు ! ఊఁ, స్వప్నంలో జరిగిందేం ? ఆకబుర్లు కట్టిపెట్టు అతనెవరో పేరుచెప్పు."

అతను నామీద ఎందుకంత కసిగా వున్నాడో నాకు తెలుసు ! ఆయన బ్రతికివున్న రోజుల్లోనే, ఒకసారి ఈ భగవంతరావు నన్నేదో పరాచకం చేశాడు అదివెంటనే నే నాయనతో చెప్పాను. ఆయన భగవంతరావుకి పాదరక్షతో పూజచేశారు. మళ్ళీ, దాని జోలికివస్తే జాగ్రత్త అని చెప్పి మరీ వచ్చారు. అతనికి ఆపగ మనసులో వుండిపోయింది. ఆయన చచ్చి స్వర్గానకి వెళిపోయారు. నేను నిసహాయురాలుగా ఇతని తడాఖాకి దొరికిపోయాను. అంచేతే నన్ను ఇప్పుడు గద్దించిఅడిగాడు.

"ఈ కలబా గిలబా అన్న కల్లబొల్లి మాటలన్నీ మా దగ్గర కట్టిపెట్టు నిజం చెప్పు. ఎవ రతను - పేరు చెప్పితీరాలి ?"

నాకు చచ్చే కోపం వచ్చింది; ఇతరుల పుండుమీద ఇనపముక్కతో పొడిచే ఈ కాకిముండాకొడుక్కి గట్టిగా బుద్ధి చెప్పా లనిపించింది. వాడి పళ్ళూడగొట్టి, వాడి గొంతుక్కి అడ్డంపడేట్టు చెయ్యా లనిపించింది; నాకు ఒక ఊహ తట్టింది! అంతే, వెంటనే ఆచరణలో పెట్టేశాను.

"ఒరే దొంగా: ఇంత పనిచేసి నువ్వే నన్ను పేరు చెప్పమని బెదిరించి బలవంతపెడుతున్నావా?" అని కోపంగా అనేశాను.

అతను నోరు వెళ్ళబెట్టి "ఆఁ!" అన్నాడు.

"నే నప్పుడే చెప్పాను నీతోటి. కాని నన్ను మోసం చేశావు. అంచేతనే ఇలా అయిందేమో నాకు తెలియదు; అంచేత పంచాయతీలో నీ పేరే చెప్తాను!"

నేను ఈ పెట్టుపెట్టగానే, అసలు వాతావరణమే మారిపోయింది. భగవంతరావు తలవంచుకున్నాడు. నోట మాటరాలేదు అతనికి. ముఖం నల్లబడిపోయింది. నే నంత మాటంటానని అతను కలలోకూడా అనుకో లేదు. వచ్చిన పెద్దలు చురచురాచూశారు. "అబద్ధమండీ. శుద్ధ అబద్ధం ఈ మాట" అని ఏదో గొణిగాడు. అదిచూసి నాకు యింకొంచెం ధైర్యం వచ్చింది. అంచేత పట్టుకు మూడించేశాను."

ఆవిడనోట యీ వృత్తాంతం అంతా వినేటప్పటికి నాకు చాలా విచారం వేసింది. నేను పడుకొన్నవాణ్ణి కాస్త ఆవిడవేపు వత్తిగిలాను.

"చ్చొచ్చొ! ఎంతపనిచేశావు! ఆ దుర్మార్గుణ్ణి నేలమట్టం చేశావు నిజమే! కాని నిన్నుకూడా నువ్వు మట్టిలో పొర్లించుకున్నావు! నీ నోటి మీదుగానే నీ శీలంమీద ఒక పెద్ద కళంకం వేసుకున్నావుగదూ!"

ఆ తర్వాత ఆవిడ తన మనసంతా విప్పిచెప్పింది.

నిజానికి నే నుత్త గాడిదని. మీరు చెప్పినమాట ఎంతో నిజం. కాని నాకు ఆ విషయం తర్వాత తర్వాత స్ఫురించింది ఆ క్షణంలో నా నోరు నా స్వాధీనంలో లేదు. చెప్పే మాటకి ఎన్ని రకాల పరిణామాలుంటాయో అనే ఆలోచనే లేకపోయింది. ఆ మరు క్షణంలో చీకటి గదిలోకి వెళ్ళి భోరుభోరున ఏడ్చాను. పిచ్చికోపం వచ్చి, ఏదో పేలి. నా పేరు పాడు చేసుకున్నాను. పైగా నాకు పుట్టబోయే సంతానానికీ ద్రోహంచేశాను.

ఆ పసి వాడు భవిష్యత్తు అంతా భగ్నం పాడు చేశాను. ఇది ఆలోచించి ఆలోచించి ఏడుస్తు ఎంతో పశ్చాత్తాపపడ్డాను.

ఎంచేతంటే, నాకు స్వప్నం వల్లనే గర్భం గలిగిందనే నమ్మకం గట్టిగా ఏర్పడిపోయింది. ఆ గర్భం మా ఆయన ప్రసాదించారని ఒక భక్తి ఏర్పడింది. ప్రపంచకం అభిప్రాయం ఏమయినా సరే, నా దృష్టిలో మాత్రం నేను: నా భర్తకి కలగబోయే సంతానానికి తల్లిని. నే నేపో ఆ భగవంత రావు మీద పగ తీర్చుకోబోయి. నా పవిత్ర సంతానానికి ఆ పాపిష్టివాణ్ణి వాబుగా చేశాను. ఇహ యిప్పుడు మళ్ళా నా పసికూన, నా భర్త స్వప్నంలో ప్రసాదించిందే అని ఏ ముఖం పెట్టుకు చెప్పగలను ?

ఈ లోపుగా భగవంతరావు పరువు పహా పంచలయి పోయింది. జనం నన్నూ, వాణ్ణీ, కూడా నిందించడం సాగించారు. అంచేత అతను ఇంకో ఎత్తు యెత్తాడు. అతను ప్రతివాడి రోటి, పాపం ఆ పిల్లకి పిచ్చి పట్టిందని ప్రచారం మొదలు పెట్టాడు. ఆవిడకి నిజంగానే కడుపులో ఏవో జబ్బుగాని, గర్భంకాదేమోనని సందేహం లేవదీశాడు.

కనపడ్డప్పుడల్లా మా మరిదిని హెచ్చరించడం ప్రారంభించాడు. "మీవదిన గారిని ఓసారి డాక్టరుకి చూపించ వోయి" అని. మా మరిది నా దగ్గర పోరు పెట్టడం మొద లెట్టాడు. ఓరోజున నేను ఖచ్చితంగా చెప్పేశాను" నేను డాక్టరు దగ్గరకి గీక్టరు దగ్గరకీ ఎక్కడకీ రాను". కొన్నాళ్ళకి ఆ భగవంతరావు సలహా ప్రకారం, "వేంగుళీ" గ్రామం వెళ్ళి ఓ డాక్టరుని మాయింటికీ తీసుకొచ్చాడు. కాని నే నాయన ఎదటి కెక్కడ వెళ్ళాను! ఆఖరికి మా మరిది నాకాళ్ళు పట్టుకున్నాడు! "వదినా, ఒక్కసారి పరీక్ష చెయ్యనీ, యీ యింటిమీది కొచ్చిన మచ్చ తుడిచి వేద్దాం. దయ వుంచి మొండిపట్టు పట్టకు వదినా, మా అమ్మవుకదూ."

ఇహ అప్పుడు గత్యంతరంలేక డాక్టరు ఎదటికి రావడానికి ఒప్పుకున్నాను. ఆ ముక్కూ, మొఖంఎరగని కొత్తమనిషి ముందర, వెల్లకిలా పడుకున్నాను మనసురాయిచేసుకుని. అతను నా పొట్ట నొక్కిచూశాడు. నా కళ్ళు పరీక్షచేశాడు, నాలికజాపించిచూశాడు. ఇట్లాటి పరీక్షలన్నీ ముగిసిన తరువాత, బయటికివెళ్ళి మా మరిదితో మాట్లాడాడు.

"ఆవిడ పేగుల్లో ఒక రణం పెరిగింది. వెంటనే ఆపరేషన్ చేయించండి. అసలే ఆవిడకి వంట్లో రక్తం తక్కువగావుంది. మీరింకా ఆలస్యం చేశారంటే ఏం జరుగుతుందో చెప్పలేం."

నా వూహలన్నీ గాలిపింజల్లాగా ఎగిరిపోయాయి. ఒకవిధంగాచూస్తే నామీది కళంకంపోయింది. కాని రెండో విధంగాచూస్తే నేను తల్లినయే అదృష్టం శాశ్వతంగా తప్పిపోయింది. నా కడుపులో ఎదుగుతున్నది, పిండంకాదు, రణం అని ఆ డాక్టరు ఎంతచెప్పినా, నా మనస్సు అది అంగీకరించటానికి సిద్ధపడలేదు. అసలు ఈ మనుషులందరూ నాకు విరోధులనీ, నా మీద ఏవో కుట్రపన్ని ఇలా అంటున్నారనీ అనిపించింది. రోగం అని పేరుపెట్టి నన్ను ఆసుపత్రికి తీసుకువెళ్ళి నా కూనని చంపేస్తారని అనుమానం పుట్టింది.

కాని యిక్కడికి వచ్చిన తరువాత ఈ డాక్టరుగారూ రణమే అన్నారు! ఆయన అబద్ధం చెబుతున్నారని ఎల్లా అంటాను.

ఆయనమాట నమ్మి ఆపరేషను టేబిలుమీద ఎక్కాను. మత్తుమందు ఎక్కిస్తున్నప్పుడు మాత్రం. నా కడుపులోంచి ఏం తీస్తారో అది నాక్కనిపించదు కదా అనిపించింది.

అప్పుడు నే నందుకుని.

"నీ క్కనిపించకపోయినా, నా క్కనిపించిందిగా."

"మీరు ఆఖరివరకూ అక్కడే వున్నారా ఆ రోజున?"

"ఆహా, మీ గాయం పూర్తిగా కుట్టేసేవరకూ వున్నాను."

"అయితే ఒక్కసంగతి అడగనా, నన్ను మోసం చెయ్యరుకదా!"

"అడుగు నిన్ను మోసగించాలిన అవసర మేమొచ్చింది నాకు"

"ఆపరేషన్‌చేసి తీసేసింది రణమేనా? లేక, పిండమూ అది"

"నీ కేమయినాపిచ్చా ఏమిటి? నేను నా కళ్ళతో చూశాను. పెద్ద కొబ్బరికాయంత రణం. ఎక్కడయినా కలలవల్ల కడుపవుతుందా ఏమిటి?"

ఆ మరుక్షణంలో ఆవిడ మొఖం అటు త్రిప్పేసుకుంది. ఒకవేళ ఆవిడకి దుఃఖం విపరీతంగా కలిగిందేమో? ఈ పిల్లదాన్ని పిచ్చిదనాలా మంచిదనాలా అని సందేహం పట్టుకుందినాకు. స్త్రీలమనస్తత్వం ఆ బ్రహ్మ దేముడైనా తెలుసుకోగలడో లేదో!

48

## "గోపి"

"బ్రతికి బట్ట కడితే, భోగిపండుగకి భాగోతం కడతాను" అని ఒక పాతసామెత వుంది. నా వృత్తాంతం సరిగ్గా అట్లాగే తయారయింది ఆ రోజుల్లో; ఆ మహమారినుంచి బ్రతికి బయటపడ్డాను గనుక, ఈ రోజుకి ఈ విషయం చెప్పటానికి వీలయింది. నేను బ్రతకడం ఎలా సాధ్య పడిందో సర్వసాక్షి అయిన ఆ పరమేశ్వరుడికి తెలియాలి: కొంత వరకూ ఆ "గోపీ"కి కూడా తెలుసునేమో మరి: కాని, ఈరోజున నాకూ, ఆమెకీ మధ్య కొన్ని యోజనాలదూరం వుంది. అసలు ఆ అమ్మాయి ఉందో, లేదో కూడా నాకు తెలియదు. ఒకవేళ ఎక్కడో వున్నా, మేం కలుసుకోగలగటం అసంభవం.

కాని, అలా ఎందుకు అనుకోవాలి? ఆ అమ్మాయి రోజూ నా కళ్ళ యెదట కనిపిస్తూనే వుంటుంది. దయతో నిండిన తన చూపులతో నన్ను ఆపాదమస్తకమూ నిమురుతూనే వుంటుంది ప్రతిరోజూ. కాని ఒక్క నాడుకూడా నోరువిప్పి ఒక్క మాటయినా మాట్లాడదు; మాటలతో ఏమీ చెప్పలేదు. ఆవిడ కళ్ళల్లో పాపలే ఒక శబ్దంలేని భాష మాట్లాడతాయి: దానివల్ల ఎంత అర్థం చేసుకోగలిగితే, అంత అర్థం చేసుకోవాలి.

కాని నాకు బాగానే అర్థమవుతుంది. ఆ భాష ఆ రోజుల్లోనూ

అర్థమయేది. అయినా ఆ అమ్మాయి నా మనసులో నాటిన సమస్యని నే నింతవరకూ పూర్తిచేసుకోలేకపోయాను. ఆ సమస్యయొక్క నాలుగోపాదం యింకా ఎక్కడో గాలిలో తేలుతూ, అంతరిక్షంలో తిరుగుతోంది. సానుభూతి వల్లా, సామరస్యంవల్లా ఆ అమ్మాయి సమస్య, నా సమస్యే అయిపోయింది. నేనూ శాస్త్రాల్లోనూ, పురాణాల్లోనూ ఆ సమస్యకి జవాబు వెతుకుతూనే వున్నాను.

మానవహృదయంలో "ప్రేమ" అనేది ఎందుకు అంకురించాలి. ప్రేమించిన వ్యక్తికి దగ్గిరగా వుండాలనీ, అనుక్షణమూ, ఆపాదమస్తకమూ ఆస్వాదిస్తూవుండాలనీ కోరిక ఎందుకు గలగాలి? కోమలమూ, మధురమూ అయిన ప్రేమభావంవల్ల, హృదయానికి గట్టిగా హత్తుకోవాలనే కర్కశ సంకల్పం ఎందుకు కలగాలి. ఈ ప్రేమకి ఫలం ఏమిటి, సాధ్యం ఏమిటి. మానవ హృదయంలోని, ఈ 'ప్రేమ' అనే 'ఏడు పాయల జడ'ని ఎవడు విప్పి చిక్కుతీయగలడు?

"పురాణతీర్థులు" అన్న పదవి సంపాయించుకున్నతరవాత, నా మొట్టమొదటి పురాణం ఆ వూళ్లో నిశ్చయమయింది. వూరయితే చిన్న వూరే కాని. అక్కడ జమీందారులూ, షావుకారులూ బాగా వుండబట్టి, సంపాయించుకోవటానికి సదుపాయమయిన స్థలమే. తమ వూరు వచ్చి పురాణం చెప్పవలసిందిగా ఆ వూరువారు ఆహ్వానించటం, నాకున్న కాస్త కూస్త పలుకుబడియొక్క ఫలితమే అనుకోవాలి. "అరుణ్ వాడ్కర్", "భారతేబువా" మొదలయిన మహాపండితులు అనేకసార్లు పురాణం చెప్పిన వూరది. వాళ్లు ఆ వూళ్ళో పురాణం చెప్పటానికి వెళితే నాలుగేసి నెలలు వుండిపోయేవారు. ఆ వూరి విఠల ఆలయములో పోగయే శ్రోతల్లో అనేకమంది పెద్దపెద్ద విద్వాంసుల పురాణ ప్రవచనాలు వినివిని నిగ్గుతేరిన వాళ్ళు నాకు బాగా తెలుసు. అంచేత నా మీద ఎంత పెద్ద బాధ్యత వున్నదో నేను గ్రహించుకున్నాను. నేను ఆ వూరి శ్రోతలని రంజింప చేయగలిగితే, నాకు నాలుగు డబ్బులు తప్పకుండా దొరుకుతాయి. తొలి సారిగా అచ్చుకున్న ఈ చాతుర్మాస్య పురాణదీక్ష, విజయవంతంగా నెర వేర్చుకోవడంమీదే నా జీవితంయొక్క భవిష్యత్తు అంతా ఆధారపడివుంది.

ధర్మకర్తలు, దేవాలయ ప్రాకారంలోవున్న ఒకగది తెరిపించి నాకు బస యేర్పాటుచేశారు. అందులోనే నేను నా నివాసం పెట్టుకున్నాను. నివాసంఅంటే, నేనూ నాకాళ్ళూ చేతులూ యింతే నాకామాటం అంతాకలిపి. ఆ వూళ్ళో అడుగుపెట్టడం నా కదే మొదటిసారి. తగు మాత్రంగా తెలిసిన వాళ్లు కూడా ఒక్కళ్లు లేరు నా కావూళ్లో. మొదటిరోజు రాత్రి, ఆ చిమ్మ చీకటే తోడునీడిగా నిద్రపోయాను. ఇహముందు యీ నాలుగు నెలలూ, పగటిపూట ప్రచండమయిన వెల్తురూ, రాత్రిపూట కాటికలాంటి చీకటే నాకు అంగరక్షకులు, కాబోలు!

ప్రొద్దున్నలేచి చూచేటప్పటికి, నా కోసం ఎవరోపోయి శుభ్రంగా అలికివుంచారు. కాసిని కట్టెపుల్లలూ, నాలుగు కడవా తప్పేలాలాటివస్తువులూ ఒకరోజు స్వయంపాకానికి సరిపోయే బియ్యం, పప్పూ వగైరాలూ ఒక ప్రక్కన పెట్టివున్నాయి.

కాని నా ధ్యాస వంటమీదికంటే, పురాణం మీదికే వురుకెత్తింది. నే నీ వూరికి సాపాటురాముణ్ణి అవడంకోసం రాలేదు. శ్రద్ధగా పురాణం చెప్పి, కాస్త పేరూ ప్రఖ్యాతీ గడించుకోవాలనీ, నాలుగు రూపాయిలు సంపాయించు కోవాలనీ వచ్చాను. ఈ నా ప్రథమ పురాణదీక్ష జయప్రదంగా నెరవేరి నా వృత్తి వ్యాపకానికి బలమయిన పునాది కావాలని నా వాంఛ. నా జీవ నోపాధిస్థిరపడడానికి ఈప్రయత్నం సఫలంకావటం ఎటువంటిదంటే, శివాజీ మహారాజు సామ్రాజ్యస్థాపనకి "భవానీ" ఖడ్గం దొరకటంలాటిది.

ఈ వూరు వచ్చేటప్పుడు నేను మా తండ్రిగారి శాలువ పైనవేసుకుని వచ్చాను; కాని వెళ్ళేటప్పుడు స్వార్జితమయిన పుణ్యఫలం జాన్ని వేసు కుని వెళ్ళాలనే నా మనసులో నిశ్చయం. ఈ వూళ్లో రొఖ్ఖం లభించవచ్చు. దుశ్శాలువలు లభించవచ్చు; పాత్రసామానులు లభించవచ్చు. ఏమో ఎవరు చెప్పగలరు. ఒకవేళ, కాబోయే యిల్లాలికి మెళ్ళో వేయడాని కుపయోగించే ఒక ముత్యాల హారమే లభించవచ్చు. ఏ జమీందారిణీకో, ఏ షావుకారు గృహలక్ష్మికో నా పురాణం బాగా నచ్చినట్లయితే, అట్టాటి బహుమానం మాత్రం ఎందుకు లభించకూడదు? "స్త్రియశ్చరిత్రమ్ పురుషస్య భాగ్యమ్" అన్నారు.

ఆషాఢ శుద్ధ దశమి పురాణంచెప్పడం ఆరంభించవలసిన రోజు. చెప్పవలసినది మహాభారతం అనికూడా నిర్ణయం జరిగింది. గది తలుపు దగ్గిరగా వేసుకుని నే నా గ్రంథం ఒకసారి పూర్వావలోకనం చేసుకుంటు న్నాను. కొంచెం సేపటికి గుడి ఆవరణలో సందడీ సమ్మర్దమూ ఎక్కువవుతున్నట్టు నాకు తెలుస్తూనేవుంది. పురాణం వినడానికి వస్తూన్నవాళ్లు, యథేష్టంగా మాట్లాడుకుంటున్న వాక్యాలు కూడా కొన్ని వినిపిస్తూనే వున్నాయి. జనం, ఆడా మగా కూడా పోగవుతున్నట్లు నా చెవిని పడుతూన్న కంఠస్వరాలని బట్టి స్పష్టమయింది. "పౌరాణికుడు పడుచువాడట! ఎఱ్ఱగాబుఱ్ఱగా వుంటాట్ట!" అని ఎవరో ప్రౌఢ తన స్నేహితురాలితో చెబుతూ, నా గది గుమ్మంముందునుంచే వెళుతూండడం నాకు వినిపించింది.

"జనం బాగానే పోగయినట్టున్నారు. ఇక పద! పుస్తకం పుచ్చుకుని పద" అని నన్ను నేనే హెచ్చరించుకున్నాను. గది తలుపు గొళ్ళెం పెట్టి, అడుగు ముందుకు వేస్తూంటే, ఏదో చెప్పలేని భయంతో నా గుండె దడ దడ మని కొట్టుకుంది.

సీలమండల వరకూ దిగిన సన్న కుచ్చెళ్ళుపోసికట్టిన పంచె, పైమీద ఆకుపచ్చని శాలువా, నుదుటిని స్ఫుటంగా పెట్టిన గంధాక్షతయా, ఎడమచంకని గ్రంథమూ, కుడిచేత గడియారమూ అమర్చుకున్న పౌరాణికుడు, నాటకపు వేషధారి రంగస్థలంవేపుకి బయలుదేరినట్టు బయలుదేరాడు. వేషం అంతా బాగానేవుందిగాని. ముఖంమీద గాంభీర్యభావం వుందో, లేదో ఆ దేవుడికే తెలియాలి: "ఇంతవరకూ ఎన్ని పరీక్షలు నెగ్గినా, వ్రాత పరీక్షలే నెగ్గావుగాని, యివాళటిది ముఖాముఖీగా జరగబోయే శబ్ద పరీక్షరా నాయనా" అని నా మనసు హెచ్చరిస్తోంది. నేను సభామండపంలో కాలు పెట్టగానే, అక్కడ అంతా నిశ్శబ్దమయిపోయింది. అక్కడవున్న వంద కళ్ళు నా కేసే చూస్తున్నాయి పరీక్షగా. నేను వేసే అడుగు అడుగుకీ నాతోటే ఆ దృష్టులూ ప్రయాణం చేస్తున్నాయి. ప్రప్రథమంగా నేను గర్భగుడిదగ్గిరకెళ్ళి విఠలదేవుడి పీఠంమీద తలమోపి నమస్కారంచేశాను. ఆ తరవాత లేచి మండప మధ్యభాగంలో అమర్చబడివున్న వ్యాసపీఠం దగ్గిరకి వచ్చాను, పుస్తకం పీఠం మీద వుంచాను. ఇదివరలో ఎందరో

మహా పండితులు అధిష్ఠించిన వేదిక అది. ఆ స్థలంలో కూచోవాలంటే నాకు కొంత భయం వెయ్యకపోలేదు. నేను తల పైకెత్తకుండానే మంగళా చరణం ముగించాను. ఆ తరువాత ఒకసారి గొంతు సవరించుకుని, అతి ప్రయత్నంమీద పురాణ పఠనం ప్రారంభించాను. "వైశంపాయనుల వారు ఏమన్నారంటే, 'జనమే జయ మహారాజా !....'

క్రమక్రమంగా గొంతు విడివడింది. కుండలోకి నీళ్లు ప్రవేశించిన కొద్దీ, గాలి వెళిపోయినట్టు, కొంచెం కొంచెం ధైర్యం వస్తూంటే, కాస్తకాస్త భయమూ తగ్గింది. నాకూ ధోరణి సరళంగా సాగుతోంది. నేనూ కథలో ఐక్యమయిపోయాను. నా దృష్టి దేవుడి విగ్రహంమీంచి శ్రోతలమీదికి తిరిగినపుడు, సభాసదులు కూడా శ్రద్ధగా వింటున్నట్టే తోచింది. "ఈ నూగు మీసాల పౌరాణికుడిని మెచ్చుకుంటూ మొదటిరోజునే తలపంకించటం ఎందుకులే" అని ఉగ్గబట్టుకున్న వృద్ధకవులు కొందరు తప్ప. మిగిలిన సభాసదులు కుతూహలంగానే వింటున్నట్టు కనిపించింది. ఈ కుఱ్ఱవాడు, నాలుగునెలలూ నిర్విఘ్నంగా సమర్థతతో పురాణం చెప్పి, బహుమతులు పట్టుకువెళ్ళగలిగినవాడే" నన్న అభిప్రాయం ఆరోజునే చాలా ముఖాల్లో వ్యక్తమయింది. ఆరోజుకి చదవటం చాలించి, "శ్రీ కృష్ణార్పణమస్తు" అని ముగించిన తర్వాత ఏదో ఒక విషమపరీక్షలో ఉత్తీర్ణుడైనంత ఆనందం కలిగింది నాకు.

రెండవ రోజున, రణోత్సాహంతో అర్జునుడు బయలుదేరినట్లు బయలుదేరాను పురాణం చెప్పటానికి. మొదటిరోజు కంటె, శ్రోతల సంఖ్య ఎక్కువగా ఉండటమే కాకుండా, వాళ్ళ అంతస్తు కూడా కొంచెం పెరిగి నట్లే కనిపించింది. "ఇరకలీ" "మహేశ్వరీ" "యిందూరీ" ప్రాంతాల రక రకాల రంగు రంగుల తలపాగాలు కంటికి నిండుగా కనిపించాయి. ఈ రోజునా, మంగళా చరణం చెబుతున్నప్పుడు నా దృష్టి నేలమీదే వుండి పోయింది. కాని అది అధైర్యంవల్లా,సభాపిరికితనము వల్లా మాత్రం కాదు. ఆ వ్యాసపీఠం క్రింద, ఎవరోవేసిన చిత్రవిచిత్రమయిన ముగ్గు చూస్తూండడం వల్ల ఆ గీతల సూటితనం, ఆ లతల వంపుసొంపులూ, ఆ పువ్వుల

రంగురేకలూ, ఆ చివరినుంచి ఈ చివరివరకూ పూర్తిగా చూస్తేనేకాని, ఆ ముగ్గుని వదలి నా దృష్టి మరలనేలేదు.

నాకు ఆలోచన పట్టుకుంది, ఏ సువాసిని నాజూకు చిటికలోంచి ఈ సన్నటి చుక్కలూ, ఓన్నని గీతలూ ఊడిపడ్డాయా అని! ఇంత కళా చతురతగల ఆ లలన ఎవరై వుంటారా అని. స్తంభానికి ఆనుకుని, సగం ముఖమే నావేపు త్రిప్పి, ఘనజహనాలు కనిపించకుండా ప్రక్కగా కూర్చున్న ఆ మందారవర్ణపు భామిని అయివుంటుందా? కటకటాలమీద మోచేతిని మోపి పిట్టగోడని ఒయ్యారంగా జారగిలబడి ముత్యాలరాసులతో సింగారించుకున్న ఆ శ్రీమంతిని అయివుంటుందా? లేక నా కుడిప్రక్కన తన చక్రలలాటి కళ్లు పూర్తిగా విప్పి, నాకేసి చూస్తూ అతి శ్రద్ధగా కథా శ్రవణం చేస్తున్న, నల్లగావున్నా నిగనిగలాడే ఆ యువతి అయివుంటుందా? లేక ఆ అమ్మాయి వెనకనే అరచేతిలో గడ్డం పెట్టుకుని, తన సన్నటి శరీరాన్ని వలయాకారంగా వంచి కూర్చున్న ఆ గౌరాంగి అయివుంటుందా? ఎవ రావిడ, ఎవరయివుంటారు చెప్మా!

పురాణం చెబుతూన్నంతసేపూ ఆ ముగ్గుకేసి తరుచు చూస్తూనే వున్నాను. నాకు నేత్రానందంగా వున్న ఆ ముగ్గు కొంతమంది నారీమణుల కళ్ళకి కనుపించనే లేదు. తమ పంచపాత్రల్లోని అక్షతలు, వ్యాసపీఠం ముందున వున్న పళ్ళెంలో వెయ్యడానికి వచ్చిన వనితాతిలకాలు, అక్షితలు వెయ్యడానికి వంగినప్పుడు, తమ కుచ్చెళ్ళతోటీ, తిరిగా తిరిగి నడిచి వెళ్ళేటప్పుడు తమ పాదాలతోటే ఆ శోభాయమానమయిన ముగ్గును నిర్లక్ష్యంగా తుడిచేసుకుంటూ, తమ తమ స్థానాలకి దయ చేశారు. వాళ్ళకి దూరపుచూపు లేకపోతే పోయింది. కాలిక్రింద ఏముందా అనే దృష్టికూడా లేకపోయింది. ఆ మర్నాడూ, మూడోరోజూ అలాగే, ఆ చిత్రవిచిత్రమయిన ముగ్గు పురాణం ఆరంభించినపుడు అమిత ఆకర్షణీయంగా వుండటం, ఆ తర్వాత ఆ పేరంటాళ్లు అది కలిపేస్తూ, చెరిపేస్తూ చక్కాపోవడమూను! ఎవరో ఒక వ్యక్తి ఎంతో శ్రద్ధగా పరిశ్రమతో సాధించి సృష్టించిన చక్కదనాన్ని, యితరులు అంధత్వంతో ఒళ్లుతెలియకుండా తుడిచేసెయ్యడం చూస్తే నాకు బాధకలిగింది. చివరకి

ఓ రోజున పురాణంలో, ఏదో యుక్త సందర్భం చూసుకుని ఆ ప్రస్తావన లేవదీసి శ్రోతలమీదికొక విసురు విసిరాను.

"....కళ అనేది దైవికంగా ప్రాప్తించేది. అది ఒక ఆత్మలో ఉద్భవించి యితర ఆత్మలకి ఆనందం కలుగజేస్తుంది. కళాసృష్టి అందరికీ చేతనవదు. కాని కళారసికత అందరూ అలవాటు చేసుకోవచ్చు. అందమయినవాటిని ఆరాధిస్తూంటేనూ, భద్రంగా కాపాడుతూంటేనూ. కళాకారులలో సగంశక్తి మనం సంపాయించామన్న మాట. ఉదాహరణకి ఈ ముగ్గు సంగతి చూడండి."

ఊరంతటా ఈ ముగ్గు విషయం ముఖ్యమైన చర్చాంశమయిందని మర్నాటికే నాకు తెలిసిపోయింది. ఆడవాళ్ళకి ఆ ముగ్గు నచ్చిందో, లేవో నాకు తెలియదుగాని, ఆ ముగ్గువేసిన ఆవిడమాత్రం సుతరాం నచ్చలేదు వాళ్ళకి.. అదే కారణంచేతనో, ఎంచేతనో మరి. ఆ మర్నాడు వ్యాసపీఠం క్రింద నేల బోసిగానే వుండిపోయింది. ఆ అష్టదళ పద్మమూ, మూలలలో ఆ కమల పుష్పాలూ, ఎంచేత ఆ రోజున వికసించలేదో నా కర్థంకాలేదు. నాకు కోపమే వచ్చింది. కాని పురాణంలోమాత్రం ఆ సంగతి మళ్ళా ఎత్తలేదు నేను.

ఎవరో తెలియని, ఆ కళాదేవతని, వెనకవేసుకొచ్చి మాట్లాడి నేను సభాసదులకు కష్టం కలిగించడ మెందుకు? నేను స్వార్థానికి తిలోదకాలిచ్చి ఆ వూరు రాలేదు.

పురాణ పఠనం అయ్యాక, నేను నా గదిలో ఏదో చదువుకుంటూ కూర్చున్నాను. బయట దట్టమైన తుంపరే పడుతోంది. రోడ్డు ప్రక్కన కాలవలు కట్టినయి. కళకళమంటూ ప్రవహించేటి శబ్దం నాకు వినిపిస్తూనే వుంది.

ఆ సమయంలో నా గదితలుపు కిర్రుమనకుండా కొంచెం తెరుచుకుంది గుమ్మం అవతల ఒకముసలి ఆవిడ నుంచునివుంది. లోపలికి రావడానికి నా అనుమతికోసం నిరీక్షిస్తున్నట్లు తెలిసింది నాకు. "రామ్మా" అన్నాను. అప్పుడు లోపలికివచ్చి నా కెదురుగా కూర్చొంది. పమిటి కొంగు కిందనించి ఒక ఇత్తడిభరిణతీసి క్రిందపెట్టి నా వేపు జరిపింది.

"ఏమిటిది ?" అని అడిగాను.

"నాలుగు లడ్డుండల్లెండి" అంది.

"ఎందు కింత శ్రమలీసుకున్నారు" అన్నాను.

"ఇంత మాత్రానికే శ్రమేముంది ? పాపం : ఆ పురాణం చెప్పే బాబుగారు ఈ వూళ్ళో వంటరిగా వున్నారు. స్వయంగా చెయ్యికాల్చుకొని ఉడకేసుకొని తింటున్నారు. కడుపునిండుతోందో, లేదో ఎవరికి తెలుసు" అంది మా అమ్మాయి. అదే చేసింది ఈ లడ్డూలు. ఏదో ఆకలేసినప్పుడు ఒకటి నోట్లోవేసుకొని, కాసిని నీళ్లు తా గొచ్చు. ఎప్పటికైనా భోజనానికే పిలవ్వొచ్చునుకానీ, మా యింట తినరు మీరు మేము కంసాలులములెండి."

అంతటితో మాట్లాడ్డం ఆపి, నా వైఖరి కాస్సేపు చూసింది. ఆ తర్వాత గుమ్మంకేసి ముఖం త్రిప్పి, "గోపీ : లోపలికి రామ్మా" అని పిలిచింది.

ఆ క్షణంవరకూ, అసలు గుమ్మంఅవతల యింకోవ్యక్తి వుందని నే నూహించలేదు. గోపీ, తల్లి ఆజ్ఞప్రకారం గదిలోకి వచ్చిందేకాని, కూర్చోడమట్టుకు కూర్చోలేదు. గోడని ఆనుకొని నుంచొని ఉండడానికే యిష్టపడింది. వేలితో ఆ అమ్మాయిని సూచిస్తూ, ముసలావిడ మాట్లాడ్డం మొదలు పెట్టింది:

"నా కూతురండి. ఆ ముగ్గు ఇదే వేసేది. కాని ఊళ్లో ఆడవాళ్లు ఎంత ఎలా ముళ్ళలాటిమాటలు మాట్లాడారో మీ చెవిని పడేవుంటాయి. మనిషి కొక మాటన్నారు. "అంత అక్కరగా శుశ్రూష చెయ్యాలసిన పనే మొచ్చింది దీనికి" "ప్రపంచంలో తనొక్కతికే ముగ్గుపెట్టడం చేతొచ్చి నట్టు" "ఆ పౌరాణికుడుకూడా ఆ పీనుగపక్షమే మాట్లాడతాడేం మరీ ?" నే నైదుగుర్నికంటే, ఇదొక్కతే బ్రతికివుంది. దానికీ సరదాలు లక్ష వున్నాయి. కాని అదృష్టంమాత్రం భగ్నమయింది ..."

గోపీ కళ్ళమీద పమిటచెంగు ఒత్తుకుంది. నేను ఒక్కసారి ఆమె వేపు చూచాను. అవును నిజమే. అదృష్టం భగ్నమే అయింది. భూమిమీద ముగ్గుకోసం అంత చక్కని చుక్కలు పెట్టగలిగిన ఆమెకు నుదుటిని మాత్రం ఒక్క చుక్క పెట్టుకోవడానికి ప్రాప్తి లేకపోయింది. సరిఅయిన

సమయంలో, యింకా తారుణ్యం తెలవారుతూవుండగానే దురదృష్టం ఆవిడని సుఖసౌభాగ్యమనే వడ్డించిన విస్తరిముందునుంచి ఈడ్చిపారేసింది. ముచ్చటగా ముగ్గుపెట్టిన అమ్మాయి. ఇలా ఫలానిరూపురేఖలు కలిగి వుండవచ్చని నేనెప్పుడూ ఊహాచిత్రం ఏర్పరుచుకోలేదు. కాని, ఈ అమ్మాయి అయివుంటుందని మాత్రం నేను అనుమానించనయినా లేదు. శరీరకాంతిలో "కృష్ణుడి చెల్లెలు" లాగా వున్నమాట అలా వుంచండి. కను ముక్కు తీరు కూడా సర్వసామాన్యం అయినదే. ఏఅవయమూ కంటికి నదరుగా లేని ఈ పడుచు యింతటి నిపుణత, కళాచతురత కలిగివుండడం చూస్తే నా కాశ్చర్యంవేసింది. ఇంతటినీరసంగా తృష్ణతో, నిరాధారంగావున్న ఆ దేహంలో యీ కళాసృష్టి యింకా ఎలా మిగిలిపోయిందో అని మరీ ఆశ్చర్యంవేసింది.

గోపీ తల్లి ఏవో చెపుతూనేవుంది. నా కిప్పుడిప్పుడే ఆవిడ మాటలు వినిపిస్తున్నాయి.

"మొన్న మీరు ఆ ముగ్గుని మెచ్చుకున్నప్పుడు, దానికి ఆకాశం అందుకున్నంత ఆనందం కలిగింది. నిన్నటి రోజంతా యింట్లో మాటలే చెప్తూనే కూచుంది. మీరంటే చాలా అభిమానం దానికి."

గోపి తల్లికేసి ఉరిమి చూచింది. ఇంట్లో చెప్పినవన్నీ యిక్కడ ఏకరుపుపెడుతుందేమిటి ? ఈ పిచ్చి ముసలిది మరీని. దానికంత వివేకం ఎక్కడిదిలే. "రా పోదాం యింటికి. వర్షం వెలిసింది" అని అంటూ, తల్లిని లేవదీస్తున్నప్పుడు, సిగ్గుతో ఆమె కొంచెం తడబడడం నే గమనించాను. వెళుతూ వెళుతూ ఒకసారి ముఖం వెనక్కి తిప్పింది. ఆ చూపులో ఏవో ఒక విశిష్టతవుంది. ఒకవేళ కృతజ్ఞతేమో మరి. నిన్న తనని మెచ్చుకొని నేను మాట్లాడినందుకు, తల్లి చేత తాను యిప్పించిన ఫలహారం నేను స్వీకరించినందువలన కలిగిన ఆనందమేమో; ఒక వేళదికాకపోతే: ఒకవేళ అద్బే. అంతకంటే యింకొక టేమవుతుందిలే.

కాని, అది యింకొకటే. ఖచ్చితంగా యింకొకటే. ఆవిడ ఉచ్చరించటానికి, నేను గుర్తించటానికి, ధైర్యంలేనిదిది యింకోటే. ఆ తరువాత వారం పదిరోజుల్లో అది అంతేనని నాకు నిశ్చయంగా తెలిసిపోయింది.

అకస్మాత్తుగా ఆవిడికి పిత్రోవామీద భక్తి చాలా ఎక్కువై పోయింది. రెండు రెట్లో, నాలుగు రెట్లో అయిపోయింది. దేవుడిగుడిలో ప్రదక్షణాలు ఎక్కువయినాయి. మొదట్లో కొన్నిరోజులు తల్లిని ముందుపెట్టుకొని, నాకు పెరుగు ఒక రోజునా, పాలు ఒక రోజునా, తరిగిన కూరగాయలు ఒక రోజునా చేర్పించటం మొదలెట్టింది. తరువాతతర్వాత తానే తీసుకొచ్చి యిస్తూండేది. నెమ్మదిగా తలుపు తియ్యడం, తెచ్చిన పదార్థములు గదిలో పెట్టడం, లోతుల్లోకి చొచ్చుకుపోయే దృక్‌బాణము నామీద విసరివెయ్యడం, వచ్చింది వచ్చినట్టు నిశ్శబ్దంగా వెనక్కి అడుగులువేసుకుంటూ వెళ్ళిపోవడమూ. ఈ దొంగచేష్టలు గమనించాక, నాకు కొంచం సంశయం పుట్టుకు వచ్చింది. ఆ సమయాల్లో మా అమ్మ నన్ను సాగనంపుతూ చెప్పిన మాటలు జ్ఞాపకం వచ్చేవి. నే నా వూరికి ప్రయాణమవుతున్నప్పుడూ, ఏకాంతంగా కూర్చోపెట్టి మా అమ్మ కొంత ఉపదేశం చేసింది.

"పౌరాణికునికి, ఆడవాళ్ళతో పరిచయం ఎక్కువగా ఏర్పడుతుంది. జాగ్రత్తగా మసలుకో. కడిగిన బియ్యంలాగా నిర్మలంగా వుండు. అనుభవం లేనివాడివి. వయసులో వున్నవాడివి. చూపరివి కూడాను. అంచేత యింతగా చెబుతున్నాను. "రాను రాను నాకు గోపీమీద కోపం రావటం మొదలెట్టింది. ఏమిటీ పట్టుదలా? ఎవరైనా చూస్తేనో, అప్పుడు నాకు మంచిపేరే వస్తుంది. తన కే మాత్రమూ పాత్రత లేకపోయినా, ఎంత పెద్ద సుయోగం ఆశిస్తోంది? నన్ను యిలా ముట్టడించడానికి తనకేమి అధికారం వుంది అసలు. ఆరోజున, తానెవరో తెలియకుండా పిన ముగ్గుని నే మెచ్చుకుంటే మాత్రం, దానికి పర్యవసానం తనని యిలా ప్రవర్తించమనా ? పురాణం చెప్పుతున్న ఆయనవేపు సభాసదులందరూ చూస్తూనేవుంటారు. నిజమే. కాని, తాను మరీ ఇంతలోకే విపర్ధంగా చూడట మేమిటి? నామీద నిలిపినదృష్టి తను హాస్త కూడా మళ్ళించనే మళ్ళించదే:మంటపంలోఅంతటికీ తను ఒక్కత్తే శ్రోత వున్నట్లూ. తను అతిశ్రద్ధగా విని పౌరాణికుడికి ప్రోత్సాహం యిచ్చే బాధ్యతంతా తన ఒక్కదానిప్పిదే విరుచుకు పడ్డట్టూ, ఏమిటా ఏకాగ్రత? ఎప్పుడు చూసినా తన ముఖంమిద ఆ తృష్ణగల, తృప్తి లేని, ఉత్కంఠతతో నిండిన భావమేనా ? నేను చెప్పుతున్న ప్రతి వాక్యముయొక్క తాత్పర్యమూ, తర్వమూ తన కళ్ళల్లో ప్రతిబింబించనా ?

పురాణపఠనంలో దుష్యంతుడి ఉపాఖ్యానం చెబుతున్నాను. శకుంతలా దుష్యంతుల ప్రథమ పరిచయమూ; ఆ మదనతుల్యుణ్ణి చూడగానే ఆవిడలో అంతవరకూ తెలియకపోయినా సుఖావహమేనని అనిపించే భావతరంగాల ఉద్వేగమూ; ఆతిథ్యం ఇస్తున్నప్పుడు ఆవిడలో అనివార్యంగా సంభవించిన సంభ్రమమూ; ఆయన ప్రశ్నలకు జవాబు చెబుతున్నప్పుడు ప్రణయసులభమైన లజ్జవలన ఆవిడ మనసులో రేగిన కల్లోలమూ; తనని గాంధర్వవిధిలో వివాహం చేసుకుంటానికి దుష్యంతుడు వాంఛ తెలియబరచినప్పుడు 'నిజంగా నాకే ఇంతటి సుఖసౌభాగ్యం కలుగుతోందా అనే భావంవల్ల ఆమెకు కలిగిన సంహర్షమూ; ఈ ఘట్టముల వర్ణనలన్నీ నా నోట వింటున్నప్పుడు గోపి అసలీ లోకంలోనే లేదు. నేను సరిగా తన చరిత్రే చెబుతున్నాననుకొన్నది కాబోలు! చైత్రమాసంలో మల్లెపువ్వులా వికసించింది. ఆ చామనచాయ ముఖంలో యింతటి అరుణరాగం వ్యాపించగలదనీ, ఏ దేశపునో అనన్యసామాన్యమైన సౌందర్యం ఆవిడ ముఖాన్ని ఆవరిస్తుందనీ నే నూహించలేదు.

భాద్రపదమాసంలో, భాగవత సప్తాహం ప్రారంభించాను. ఏడు రోజులపాటు అదొక వాగ్యజ్ఞదీక్ష. పౌరాణికుడికీ, సభాసదులకీ కూడాను. పూర్వాహ్ణంలో నాలుగు గంటలసేపూ అపరాహ్ణం మరో నాలుగుగంటలూ ఏకాసనం వేసుకొని కూర్చున్న శ్రోతలకి అవయవాలు కొయ్యబారిపొయ్యేవి. కాళ్లు తిమ్మిర్లు కమ్మేవి. నాకూ అంతే. నేను ఆ ఎనిమిది గంటలసేపూ అఖండంగా వాగాల్సికూడా వుండేది. ప్రతిరోజూ ఒకస్కంధమంతా అర్థం చెప్పి తీరాల్సిందే. అది తప్పించుకోటానికి ఏ విధమైన సాకుచెప్పినా చెల్లదు. నేను మొదటిరోజున గణపతి పూజచేసి సంహిత ప్రారంభించాను. రెండు గంటలసేపు ఏకధాటిగా పఠనం చేశాను. ఆ తరువాత పదిహేను నిముషాల సేపు విశ్రాంతి.

ఆ మరుక్షణమే వేడిపాలతో నిండిన పంచపాత్ర ఒకటి తల్లి చేతిమీదుగా నా యెదుటికి జరిపించింది గోపి. నేను గొంతుక తడుపుకునేందుకు గుటక వేస్తున్నాను. గోపి కళ్లు విప్పారాయి. గర్భగుడిలోవున్న పాండురంగడే తన నైవేద్యం స్వీకరించినట్టనిపించింది. కాని, ఆ క్షణంలోనే మిగిలిన ఆశవాళ్ళ కనుబొమలు ముడివడ్డాయి. ఒక పేద కంసాలిముండ తమ

కంటే ముందుగా వెళ్ళి శాస్త్రిగారి ఉపచర్యచేయటం వాళ్ళ కెంతమాత్రం రుచించలేదు. ఇంకొక ఆవిడ, కుంకగపువ్వువేసి కాచినపాలు పట్టుకు వచ్చిందికూడాను. కాని నేను అవికూడా ఎక్కడ తాగుతాను.

కాని రెండవరోజునుంచీ మిగిలిన స్త్రీలు జాగ్రత్తపడ్డారు. వాళ్ళల్లో వాళ్లు వంతులువేసుకొని ఎవరో ఒకరు నాకు ముందుగా పాలలోటా తెచ్చి యిచ్చేవారు. వాళ్ళ శుశ్రూషతో "ఈ దరిద్రురాలి రోగం చక్కగా కుదిరిందిలే" అన్న భావమున్నట్లు నాకు స్పష్టంగా కనిపించింది. కాని వాళ్లు వాస్తవంగా గోపి రోగం కుదిర్చారా?

ఏమాత్రం లేదు. గోపీ ఒక క్రొత్తయుక్తిచేసి, దొంగని దొంగే దోచుకున్నాడన్నట్టు చేసింది. రాత్రిపూట నేను నిద్రపోయేవేళకి తల్లిని ముందేసుకొని గదిలోకి ప్రవేశించేది. చేతిలో ఒక పాలచెంబుతో సహా.

"ఎఱ్ఱగా కాచి తెచ్చాను. తాగేసి కంఠానికి ఒక శాలువా చుట్టుకొని పడుకోండి. రేపు మళ్ళీ స్వరం ఖంగున వుండొద్దూ?"

ఈ మాటలు ఎంత ఆపేక్షగా అనేదని గోపి. మొదట్లో కోపం వచ్చేది; కాని, తర్వాత తర్వాత నాలో కోపం ఏమీలేనట్టే అనిపించేది నాకు. కోపం ఉండేస్థలాన్ని అనుకంపం ఎప్పుడో ఆక్రమించింది. ఇలాంటి చిన్న సేవలు చేసుకోవటం ఆ భగ్నహృదయానికి ఆనందం చేకూరుస్తుందంటే అది నే నెందుకు ధ్వంసం చెయ్యాలి. అనిపించేది. ఈ భాగావత సప్తాహం ఏమో నాకంటే ఆవిడకే కష్టంగా వున్నట్లుంది. ఆఖరిరోజున నా మెళ్లో పూలమాల, భుజాలమీద క్రొత్తశాలువా పడగానే ఆవిడ సంతోషానికి మేర లేకపోయింది. కేవలం యీ రోజుకోసమే తను యిన్నాళ్లూ వైధవ్యాగ్నిలో కూలిపోతున్న జీవాన్ని గొందిలో నిలబెట్టుకుందా అనిపించింది. ఆ రాత్రి పాలచెంబు తెచ్చినప్పుడు "దేవుడు చల్లగా చూచి మొత్తానికి గట్టెక్కించాడు" అంది. మరుక్షణంలో కళ్లు నింఢుకున్నాయి.

ఊళ్ళోవాళ్ళంతా పంపించిన స్వయంపాక సామగ్రితో సేనాసప్తాహ సమాప్తికి ఉద్యాపన చెయ్యాలని నిశ్చయించుకున్నాను. పన్నెండు మంది బ్రాహ్మణులను భోజనానికి పిలిచాను. సప్తాహానికి వచ్చిన శ్రోతల నందరినీ మహాప్రసాదం స్వీకరించమని ఆహ్వానించాను. ఒక వంద విస్తళ్ళవరకూ

లేవాయి. కాని నే నొక్క పనికూడా చెయ్యాల్సిన అవసరం లేకపోయింది. సప్తాహానికి వచ్చిన స్త్రీశ్రోతలే, సర్వకార్యాలూ నిర్వహించారు. అంతకంటే నా కెవరున్నారు ఆ యింట్లో ?

కానీ ఎవరూ లేరనిమాత్రం ఎలా అనగలను ? గోపీ ఉందే ! వంటచెయ్యటానికి వీలులేదు, నిజమే. కాని కూరలు తరగటందగ్గర నుంచి ఎరువుతెచ్చిన పాత్రసామాను ఎవరిది వారికి తిరిగి యిచ్చేవరకూ, సకల చాకీరీ సంతోషంగా చేసింది. మిగిలిన ఆడవాళ్ళంతా వాళ్ళల్లో వాళ్ల గుసగుస లాడుకుంటూ, ఆవిడను అపహాస్యంచెయ్యడం నేను గమనించాను. గోపీకూడా గమనించే వుండొచ్చు; వాళ్ళ మనసుల్లో కుళ్లుకూడా ఆమె గ్రహించే వుండవచ్చు; అవేవీ ఆమె లక్ష్యం చెయ్యలేదు. ఆవిడ ఉత్సాహంతో పొంగిపోయింది. నే నేదో తనకి స్వంతమనిషి అయినట్టు, లేక ఒక త్తికే స్వంతమయినట్టూ.

అంతా నిర్విఘ్నంగా ముగిసినతరువాత, తృప్తిగా పడకమీద దేహం వాలుస్తూ, ఇవ్వాళ గాఢంగా నిద్రపోవాలనుకున్నాను; కాని, ఎందుచేతో ఎంతసేపటికీ కళ్లు మూతలు పడలేదు. బలవంతాన మూసుకున్నా, కళ్ళముందర గోపీ స్వరూపమే కనిపించింది. ఆమెను గురించే ఆలోచనలు రేగుతున్నాయి.

"గోపీ : ఎందుకు చెప్పుమా ఇంత ఆపేక్షగా జీవం దారపోస్తూంది నా కోసం ! ఏం కావాలి ఆ అమ్మాయికి ? కథల్లోనూ, నవలల్లోనూ 'ప్రేమ, ప్రేమ' అంటారే ! అది గామగదా యిది. అదే అయితే, అది పౌరాణికుడుమీదా ? పురాణంమీదా ? నాకు ప్రతినిముషమూ, ప్రతి విషయంలోనూ సహాయపడుతూ యీ అమ్మాయి సాధించేది ఏమిటి ? పరమార్థమా ? స్వార్థమా ? చంద్రుడిచుట్టూ గుడికట్టినట్లు, ఈమె నా చుట్టూ ఏదో ప్రాకారం ఏర్పరిచింది. ఈ ప్రాకారం రోజురోజుకీ చిన్నది చేస్తోంది. ఇదివరలో అతి స్వల్పం అని తేలికగాతీసేసిన విషయాన్ని గురించి. యిప్పుడు గంటలతరబడి ఆలోచించాల్సివస్తోంది నేను. చాతుర్మాస దీక్షలో యింకా రెండునెలలు గడవాలి. ఆ లోపుగా న న్నెంతవరకూ తీసుకొనివెళ్తుం దీ అమ్మాయి. నన్ను పెద్దమనిషితరహాగా మా యింటికి

చేసుకోనిస్తుందో లేదో? ఊళ్ళోఉన్న స్త్రీజనంయొక్క నిగా రోజురోజుకీ ఎక్కువవుతోంది. వాళ్ళ కేదో కొంత వాసనవేసినట్లుంది. గోపీని చాలా బహిరంగంగానే మాటలంటున్నారు. అది నన్నుగూడా చాటుగా తిట్టున్న ట్లేగా? నా కంతమాత్రం తెలియక్కర్లే? ఛా! ఛా! ఈ అమ్మాయికి బంధం వేయకపోతే వీల్లే దింక."

కాని గోపీతో ఏమని చెప్పాలో, ఎప్పుడు చెప్పాలో అని నే నాలోచించుకునేందుకు వారంరోజులు గడచిపోయినాయి. ఈ పని నేను అనుకున్నంత సులభంగా కనుపించలేదు. ఈ అభిప్రాయాన్ని నేను వాక్రూపంలోకి తగిలేసుందర, ఆ పూరి స్వరూపంలోనే పెద్దమార్పు వచ్చింది. ఊళ్లో ఎక్కడ చూసినా ఎలుకలు పడటం ప్రారంభమయింది. అక్కడక్కడ కొందరికి ప్లేగు గూడా తగిలింది. నాలుగు రోజుల్లో కొంతమందిని ప్లేగు భక్ష్యం చేసింది కూడాను. పురాణానికి వచ్చే ఆడవాళ్ళ సంభాషణలో ఆత్మస్తుతీ, పరనిందా మాయమయ్యాయి. వాటికి బదులు ఏ వీధిని ఎలుక పడిందో, ఎవరింట్లో ప్లేగు తగిలిందో అనే మాట్లాడుకుంటున్నారు. ఆడుతూ పాడుతూవున్న వూళ్లోనూ, నిండిళ్ళల్లోనూ విచారాంధకారం ఆవరించింది.

మొదటి ప్రపంచయుద్ధం అప్పుడే ముగిసిన రోజులవి, అంటు వ్యాధులు అగపడగానే ఈ రోజుల్లో ఇంజక్షనుల పర్వం ప్రారంభమవుతుంది. ఆ రోజుల్లో ముఖ్యపట్టణాల్లో కూడా ఇంజక్షన్లంటె ముఖ్యస్థానం వుండేది కాదు. అటువంటప్పుడు పల్లెటూళ్ళల్లో ఆ ప్రసక్తి ఎక్కడిది? ప్లేగు తగిలిందనగానే యిల్లొదిలిపెట్టి ఊరిబయటికి పరుగెత్తటం, అక్కడ పాక వేసుకుని పడివుండటం. అప్పట్లో తెలిసిన వుపాయంఅ దొక్కటే.ఊళ్ళోబాగా శ్రీమంతులయిన వాళ్లు కుటుంబాలతో సహా, తక్షణమే ఊరిబయట పాకలు వేయించుకుని పరారి అయిపోయారు. పురాణానికి వచ్చేవాళ్ళ సంఖ్య సగమయింది. వచ్చిన వాళ్ళ ముఖకాంతి కూడా ఏదో చింతాక్రాంతంగా వుండేది. శ్రోతలకి మనశ్శాంతిలేదు. అంచేత వక్తకీ లేదు. పురాణంలో స్వారస్యం ఒక్కసారిగా హరించిపోయింది.

నాకు లోలోపల భయం భయంగానే ఉండేది. ఆలోచన సాగేది కాదు.

దేనిమీదా లక్ష్యం నిల్చేది కాదు. పుస్తకం మూటకట్టుకొని వూరికి వెళ్ళిపోదామా అనిపించేది. కాని నేను నాల్గు నెలలుంటానని వ్రాసియిచ్చాను. పురాణం మధ్యలో నిలిపివేయడానికి నాకు హక్కు లేదు. ఊళ్ళో ప్లేగు తగిలినవాళ్ళ సంఖ్య పెరిగింది. ముందు ముందు ఏం చెయ్యాలా అనేది ఒకసమస్య అయిపోయింది. ఒకరోజున పూజారివచ్చాడు నాదగ్గరకి. "ఇంకా మన సందులో ఎక్కడా కనుపించలేదు. మీరు భయపడకండి. స్టేషనుదగ్గర మెట్టమీద నేను పాక వేయిస్తున్నాను. రెండోరోజుల్లో పూర్తి అయిపోతుంది. మాతోచే మీరూ వచ్చేద్దురుగాని అక్కడికి. పురాణం చెప్పవలసిన సమయానికి మాత్రం ఊళ్లోకిరావచ్చు. మిగతా అప్పుడు పగలూ, రాత్రి అక్కడే వుందాము.

కాని భయపడేవాణ్ణే బ్రహ్మరాక్షసి పట్టుకుంటుంది.

పూజారి పాకలోకి వెళ్ళడానికి సర్దుబాటు చేసుకుంటూనే వున్నాను. రెండోరోజుకి వంట్లో వణుకు పుట్టుకొచ్చింది. ఆవలింతలు మొదలు పెట్టాయి. చలివేయడం ఆరంభించింది. చూస్తూ చూస్తూ వుండగానే చంకలో బిళ్ళకట్టింది. ఇదేమి అరిష్టమో వుంటుందా అని సందేహం పుట్టగానే నాలో ధైర్యం యావత్తూ యింకిపోయింది. సాయంకాలం పురాణం వినడానికి కొద్దిమందే వచ్చారు. కాని, నేను మూలుగుతూ, నిట్టూరుస్తూ గదిలోనే పడుండిపోయాను.

"ఏం ? శాస్త్రిగారు ! ఎలావుంది ? ఒంట్లో బాగా లేదా ?" అని అడుగుతూ కొంతమంది వృద్ధశ్రోతలు నాగదిలోకి ప్రవేశించారు. వాళ్ళవెనకాల కొంతమంది ఆడవాళ్ళు వచ్చారు.

"జ్వరం తగిలింది. చంకలో బిళ్ళ కట్టినట్టుంది." అది ఎలాగో అల్లాగ సమాధానం చెప్పాను. "నేను చెప్పింది వినగానే రోజు నియమంగా పురాణం వినే ఆ మహా పరమార్థ చింతనగల ప్రభువులు నాలు గడుగులు వెనక్కి జరిగారు. దేవాలయం ధర్మకర్తకి కబురు వెళ్ళింది. ఊళ్ళో వున్న ఒక్క డాక్టర్నీ వెంటబెట్టుకొని ధర్మకర్తలు దయచేశారు. ఏం పరీక్షచేశాడో, ఏం వైద్యం చేశాడో నా కిప్పుడు జ్ఞాపకం లేదుగాని,

ఆయన ఉచ్చరించిన రెండు ముక్కలు మాత్రం నా మనసులో నిలచి పోయాయి. "ప్లేగు కేసండీ"

నాకు మొదట్లోనే అనుమానం వేసింది. ఇంకిప్పు డీ డాక్టరుగారే బొడ్డుకోసి పేరెట్టారు నా జబ్బుకి. ఆక్షణంలోనే నేను సగం చచ్చిపోయాను. ఇహ నన్ను బ్రతికించటం గుళ్ళో వున్న ఆ పాండురంగడి చేతిలోనేవుంది. ధర్మకర్తల కది మేరు పర్వతమంత సమస్య అయి కూర్చుంది. ఇప్పుడీ పురాణం చెప్పే శాస్త్రులని ఏం చెయ్యాలని. నలుగురూ వచ్చేపోయే చోటాయె మరి, దేవుడిగుడి. అంచేత యిక్కడ వుంచటానికి వీలు లేదు గదా. పోనీ ప్లేగు ఆస్పత్రికి పంపిద్దామా అంటే అది జిల్లా ముఖ్య పట్టణంలో వుంది, ఈ వూరికి ముప్పైమైళ్ళ దూరంలో. మరి యిప్పుడు యెవరి యింట్లో పెట్టడం? పోనీ: ఎవరిపాకలో? కాగడాపేసి దారి చూపించి పెద్దపులిని యింటిలో కెవరు తెచ్చుకుంటారు? తమ ప్రాణాల మీద అంత ఆశవదులుకున్న వాళ్లెవరుంటారు? ముందు సంగతేమిటి? ఎట్లా యిప్పుడు?

ఈ సమస్య పరిష్కారంకోసం పోగయిన గ్రామస్థులకీ, ధర్మకర్తలకీ యీ చిక్కు బ్రహ్మముడి అయిపోయింది. కాని, ఆ చిక్కు ఒక సామాన్య స్త్రీ చటుక్కున విప్పేసింది. ఆవిడ గోపి. తల్లి నడ్డంపెట్టుకొని ముందుకొచ్చి నిలబడింది. "శాస్త్రిగారిని మా యింట్లో పెట్టుకుంటాం" అని తల్లి నోట చెప్పించింది. ధర్మకర్తలకీ, మిగిలినవాళ్ళకీ కూడా "అమ్మయ్య" అని పించింది. ఈ పీడ ప్రస్తుతం వాళ్ళ యింటికి చేరుస్తే దేవుడిగుడి తెరిపిన బడుతుంది. గ్రామస్థులకీ గండం వుండదు. ఇహ ఆపైన ఆ శాస్త్రి అదృష్టము ఎలావుంటే అలా,

నేను లేచి నిలబడ్డాను. లేవక తప్పేదేముంది? నాకు గొంతుక ఎండిపోయి శోషవచ్చినట్లుగావుంది. నడుస్తూవుంటే కీళ్లు పట్టుతప్పినప్పుడు చెయ్యి పట్టుకోడానికి ఆధారంగా గోపీ తల్లి నా ప్రక్కకి వచ్చింది. గోపీ నా పడక చుట్టపెట్టి చంకనెట్టుకొని ముందు పరుగెత్తింది. ఊరివాళ్ళల్లో ముసలివాళ్ళూ, ధర్మకర్తయూ కాస్త దూరదూరంగానే వచ్చినా. గోపీ ఇంటివరకూ సాగనంపడానికి నావెంట వచ్చారు. "ఇంటికి టెలిగ్రాం పంపించాలా?" అన్నారు.

"ఆ పని మాత్రం చెయ్యకండి! కొంకణదేశంలో వున్న మా పల్లెటూరికి టెలిగ్రాం చేరడమే నాల్గురోజులకి చేరుతుంది. ఆ కుగ్రామంలో టెలిగ్రాం వచ్చింది అంటే మా అమ్మకి పై ప్రాణాలు పైనే పోతాయి!" అని వాళ్ళందరికీ ఒక్క దణ్ణంపెట్టి మరీ ప్రార్థించాను.

ఇప్పుడు నేను గోపీకి అతిథినయ్యాను. ఎంత విచిత్ర అవస్థలోవున్న అతిధిని! ఇప్పుడు నేను దేవుడిగుడికి సంబంధించినవాడినిగాను. దేవుడికీ సంబంధించిన వాడినీ గాను. గ్రామస్తులకు సంబంధించిన వాణ్ణీ కాను. ధర్మకర్తలకూ సంబంధించినవాణ్ణి కాను. ఒక్క గోపీకి సంబంధించినవాణ్ణి. ఆ అమ్మాయి "నిద్రపోండీ:" అంటే నిద్రపోవడం, "లేండీ!" అంటే లేవడం. "మందుత్రాగండీ" అంటే మందు త్రాగడం. ఏం చెయ్యమంటే అది చెయ్యటం. ఏ ఉపచారం చేస్తే అది చేయించుకోవటం. ఇదివరకు రోజుల్లో తల్లి ముందూ, తను వెనుకా ఉండేవారు. ఇప్పుడు గోపీ ముందూ, ఆ వెనకే తల్లీనీ.

నాకు దుప్పటి కప్పుతున్నప్పుడు, నా నొసట శొంఠి గంధం పట్టు వేస్తున్నప్పుడు. నేను ఆవిడకేసి చూస్తూవుండేవాణ్ణి. నా దెంత అపాయకరమైన వ్యాధో? కాని, ఆవిడ వికసించిన ముఖంలో భయం లవలేశం ఉండేది కాదు. ఆ ముఖంలో కేవలం ఆపేక్ష, తత్పరతామాత్రమే వుండేవి. తన జీవితం సంగతి ఆవిడికి ఆలోచనే వుండేదికాదు. ఆవి దసలు జీవించి లేననే అనుకునేది. తనకు ప్రాణం వున్నట్టే ఎంచుకునేదికాదు. తను జీవన్మృతురాలై చాలా రోజులైంది. ఇప్పుడు ఆవిడికి మృత్యువంటే "ప్ఛ: యింతేగా" అనిపించేది.

సూర్యుడు అస్తమించాడు. చీకటి పడింది. కాని – నా కవేమీ తెలియవు. నా మగతలో నే నున్నాను. మూలుగుతున్నాను. అటూ ఇటూ దొర్లుతూ ఆరాటపడుతున్నాను. కానీ గోపీకి మాత్రం కింకరుల భయం పట్టుకుంది. ముందున్న రాత్రి నిజంగా కాళరాత్రి అవుతుందేమో నని సందేహం పట్టుకుంది. గోపీ ఆ రాత్రి చాలా భయపడిం దనుకుంటాను. ఓ రాత్రి వేళ నేను తల యెత్తి నా ఎడమచేతి వేపుకు చూశాను.

ఆవేపే గోపీ పూజామందిరం వుంది! అక్కడ దీపారాధనచేసి దేవుడి

ఎదుట తల నేలకు మోపుతూ నమస్కారాలు చేస్తోంది గోపి. ఆ దేవుడికి అనేకమైన మ్రొక్కులు మొక్కుకొని వుంటుంది. "ఈ రాత్రి ఆపద లేకుండా గడవనీయ"మని అనేక విధాల మనసారా ప్రార్థించి వుంటుంది. "వ్యర్థమైపోయిన నా జీవితంలో మిగిలివున్న ఆయుర్దాయం తీసేసి, అది, ప్రపంచానికి ఉపయోగపడే ఈ శాస్త్రిగారి హృదయానికి యిచ్చెయ్యి" అని దేవుడి ముందర పెంకిపట్టు పట్టి వుంటుంది. అంతే, – ఇందులో నా కెంత మాత్రం సందేహం లేదు.

తమ తమ జీవితాలమీద ఆశలు వదలుకున్న వాళ్ళలో రెండే రకాల మనుష్యులు వుంటారు. ఒక రకానికి యితరుల జీవితాలంటే కూడా ఏమీ లక్ష్యం వుండదు. వాళ్ళు నిర్దయగా కఠోరంగా తయారవుతారు. రెండో రకం వాళ్ళు మైనంకంటే మెత్తని హృదయం కలవాళ్ళవుతారు. మూర్తీభవించిన దయాస్వరూపు లవుతారు. గోపీ రెండో రకానికి చెందిన వ్యక్తి.

ఆ రాత్రి అంతా. నాకు మెళకువవచ్చి చూచినప్పుడల్లా నాకు రెండు వస్తువులు కనిపించేవి. వెలుగుతూవున్న జ్యోతితో ఆ తళతళలాడే సెమ్మె ఒకటి, వెలిగించకపోయినా మెరుస్తూవున్న ఆవిడ కళ్ళల్లో జ్యోతులు రెండు. నేను మూలిగినా, ఆయాసపడినా నా ముఖందగ్గర ముఖంపెట్టి "ఎలా వుంది ? ఏం కావాలి మీకు ?" అని అడిగేది. ఆ స్వరం అతి మెల్లిగా వుండేది. ఆ మాటలు వినిపించీ వినిపించనంత మృదువుగా అడిగేది. కానీ – ఆ శబ్దం నాలుక చివరనుంచి వచ్చిందిమాత్రం కాదు. గర్భగుడిలోంచి వచ్చినట్టూ, ఎక్కడో దూరంగావున్న లోతుల్లోంచి వచ్చినట్లూ. కడుపులోనుంచి వచ్చినందువల్ల అంత మెల్లిగా వుండేది. అది గోపీ స్వరంకాదు. అది యెవరో మహాత్ముల వాణి. తపోధనుల సంజీవ స్వరం అది. ఇప్పటికికూడా నా కేదైనా జబ్బుచేసిన సమయాల్లో ఆ గోపీ స్వరం యెక్కడైనా వినిపిస్తుందేమో నని వెతుకుతూ వుంటాను. నే నప్పుడప్పుడు నా భార్యతోటే చెప్పేవాణ్ణి. నిస్సంకోచంగా చెప్పేవాణ్ణి. "నువ్వేం కేదీ చెయ్యలేకపోయినా సరేగాని అధమ పక్షం ఆ గోపీస్వరం మట్టుకు సంపాదించుకురా" అనేవాణ్ణి.

చీకటిలో దాక్కొని ఆ రాత్రి వెళ్ళిపోయింది. కాని, నా ప్రాణాన్ని యథాస్థానంలో వుండనిచ్చింది. పొద్దున్నే డాక్టరువచ్చి మళ్ళీ పరీక్ష చేశాడు.

"బాగుపడతారు కదండీ ?" అని అతి ఆర్తస్వరంతో గోపీవేసిన ప్రశ్నకి సమాధానంగా ఆయన ఒక చిరునవ్వు నవ్వాడు. ఆ నవ్వు గోపీ యెలా అర్థంచేసుకున్నా సరే. ఆ సాయంకాలం, పక్కయింటి యిల్లాలు ఒక గిన్నెతో గంజితెచ్చి నా తలాపుదిక్కున పడేసి వెళ్ళిపోయింది. గోపీ. ఒక కంచమూ చెంబా అన్నీతెచ్చి నా దగ్గిరపెట్టింది. తను కొంచెం దూరంగా కూర్చుంది. "లేస్తారా ? గంజి చల్లారిపోతుంది."

నా కా గంజిమీదా. అది తీసుకొచ్చి అక్కడపారేసి పోయిన ఆ యిల్లాలిమీదా, అది తాగమని బలవంతపెట్టే గోపీ మీదా, అందరిమీదా కోపం వచ్చింది. గంజి చప్పగా చల్లారిపోయి, పైన తరక కట్టినా, నా కోపం మాత్రం చల్లారలేదు. నేను కదలకుండా పడుకొని కళ్లు మూసుకున్నాను. గంటా గంటన్నర గడిచిపోయింది. గోపీ బతిమాలటం అంతా వ్యర్థమైపోయింది. ఆవిడ గుండె నీరైపోయింది. ఆ నీళ్లు ఆమె కంటి వెంట టపటపా రాలాయి.

గోపీ నాకు దుప్పటి కప్పుతుంది. నొసటన శొంఠి పట్టేస్తుంది. నియమప్రకారం ఔషధం కొలిచి గొంతుకలో పోస్తుంది. కాని '— ఈ గంజి విషయంలో మాత్రం తాను ఏమీ చెయ్యలేదు. తను కంసాలిది మరీ; నేను బ్రాహ్మణ్ణి. తను నా కాహారం ఎలా పెడుతుంది ? కాని నేను మాత్రం ఆహారం లేకుండా ఎంతసేపని వుండగలను ? గంట గంటన్నరలో నాకు శోష వచ్చినట్లు అయింది. నేను తల్లడిల్లిపోయాను. నేను మెల్లిగా కళ్లు తెరచి దిక్కుతోచక ప్రక్కనే కూర్చున్న గోపీని పిలిచాను.

"గోపీ ఽఽఽ !

"ఏమిటి ?"

"నేను కూర్చోలేను. గంజి త్రాగించు."

"నేనా ! నా చేతిమీదుగా పనికొస్తుందా మీకు ?"

"నీ చేత పనికిరాకపోతే యింకెవరిచేత పనికొస్తుందేం ?"

"నిజంగానే !"

"ఆహా ! నిజంగానే. దీని సాక్షిగా నిజం" అని నా హృదయం మీద చెయ్యి వేసుకున్నాను.

గోపి అక్కడనుంచి లేని మెరుపంత వేగంగా యింట్లోకి వెళ్ళింది. అరగంట లోపుగానే గంజికాచి పట్టుకొచ్చింది. ఎవరో పక్క యింటావిడ తెచ్చి పడవేసిన చల్లారిపోయిన గంజి నాకు పొయ్యడానికి - తన హృద యాన్ని ఎక్కడా తాకట్టు పెట్టుకోలేదు గోపి. తను స్వయంగా చేసిన గంజి. చెంచాతో నా నోటిదగ్గరకు తెచ్చింది. నేను చెప్పినమాటవినే మంచి పిల్లవాడిలా నోరు తెరిచాను. తన చేతితో పోసిన గంజితో నా అంతరాత్మ తృప్తి పడటం చూచిన గోపి ముఖంలో వ్యాపిం చిన తేజం, మాటలతో వర్ణించలేము. ఈ సర్వ భూమండలం కంటే ఎక్కువ విలువగల వస్తువ ఏదో తనకు దొరికినట్లు ఆనందపడింది. అది కృతార్థత వల్ల కలిగిన ఆనందం. అది గమనించిన నా కళ్ళు గంగా యమునా అయి ప్రవహించాయి. అది చూచి ఆవిడ ఆ వేగం ద్రవించి త్రివేణీ సంగమం ఏర్పడింది. హృదయంలో అచ్చు పడిపోయిన దదెంత సాత్విక దృశ్యమో ? ఆ దృశ్యం ఏ కవి అయినా చూచివుంటే - ఆ వెచ్చటి గంజీ. గాజులు లేకపోయినా నిండైన ఆవిడ చేతులూ, తృప్తిపడిన నా ముఖారవిందమూ, మా యిద్దరి కళ్ళవెంటా రాలుతున్న అమృతాభిషేకమూ, యివన్నీ అతని కవితలో శాశ్వతం చేసి వుండేవాడు. ఆ ఒక్క కవితతోటే అతనూ శాశ్వతమైన కీర్తి గడించుకునే వాడు.

"గోపి ! నువ్వు యివ్వాళ ఎవరి స్థానంలో వున్నావో తెలుసా ? సాక్షాత్తూ మా."

చటుక్కున తన అరచేతితో నా నోరు మూసేసింది. మాతృస్థానం అన్న అక్షరాలు నా నోట్లోనే కుక్కేసింది.

"అలా నోటికి వచ్చినట్లు మాట్లాడకండి ! భాగవతంమీద ఆన. తెలిసిందా ?"

ఆవిడ చెయ్యి నా నోటిమీదనుంచి తీసేసెయ్యాలని మణికట్టు గట్టిగా పట్టుకున్నాను. ఎంత చల్లగా, సుఖంగావుంది ఆ స్పర్శ ! ఆ మరుక్షణంలో గోపి ఆపాదమస్తకం వికసించి కళ కళకళలాడింది. ఆవిడ కనుపాపల్లో ఏదో ఒక కాంతి వచ్చింది. నేను జ్వరంతో కాగుతున్నాను. నాకు చల్లదనం కావాలనిపించింది. కళ్ళకీ, నుదుటికీ, హృదయానికికూడా ఆ అమ్మాయి

చేతిని ఆ ప్రదేశాలలో వత్తుకొని, చివరకు హృదయంమీద స్థిరంగా వుంచేశాను. ఆవిడ ఆ చేతిని నాకు దానం చేశానని అనుకుంది కాబోలు! జబ్బుతో వెల్లికిలా పడుకున్నవాణ్ణి ఆవిడవైపు తిరిగి వత్తిగిలి పడుకున్నాను.

"గోపీ! నే నీ విషజ్వరంనుంచి తేరుకొని బయటపడి మళ్ళా మా అమ్మకు కనిపిస్తే, ఆవిడ మాణిక్యాలతోటీ, ముత్యాలతోటీ నీ ఒడి నింపేస్తుంది సుమా!"

* "నా ఒడిని నింపడమా....?"

గోపీకి పొట్టలో బాణం గుచ్చుకున్నట్లయింది. తన ముఖాన్ని ఒక పక్కకు తిప్పుకుంది. నేను చేసిన పొరపాటు చటుక్కున నాకు స్ఫురించింది. ఒడినింపించుకునే భాగ్యానికి గోపీ ఏనాడో దూరమై పోయింది. కాని నా కా సమయంలో గుర్తులేదు. జ్వరం తీవ్రంగా వుండటంవల్ల నా వాక్కుకీ, వివేకానికీ కూడా మాంద్యం ఏర్పడింది.

"గోపీ!....గోపీ!.... ఏడుస్తున్నావా? ....పొరపాటున అన్నాను. కళ్ళు తుడుచుకో. ఇలా నాకేసి చూడు....ఏదీ...ఊ....నీకే కనక కోపం వస్తే, నేను అనాథనై పోతాను....చూడు. ఇంకా నీకు ఎక్కిళ్ళు వస్తూనే వున్నాయి. నీ ఛాతీ ఆయాసపడుతూనే వుంది. నేను వెళ్ళిపోనా యేమిటి యిక్కడనుంచి: పోయి అలా వీధిలోపడి ఆరాటపడి కొట్టుకలాడి చచ్చిపోతానంతే!

నేను ఒక పెట్టున లేవాలనే ప్రయత్నంచేశాను. ఆవిడ వెంటనే పమిటతో కళ్ళు తుడుచుకుంది. నా రెండు బుజాలూ పట్టుకొని నన్ను పక్కమీద పడుకోబెట్టాలని ప్రయత్నంచేసింది.

"ఒద్దు.... ఒద్దు. నేను నీ ప్రాణంమీదకు తెచ్చాను. ఇప్పుడు నన్ను పోనియ్యి యిక్కడనుంచి. నేను చచ్చిపోతున్నా సరే నీకు తెలియనివ్వను. నేను పౌరాణికుణ్ణి. ధర్మరాజూ, భీముడు, అర్జునుడు, రాముడూ, రావణుడు,

* గర్భిణీ స్త్రీలను ఉయ్యాలలో కూర్చోబెట్టి, ఊళ్ళో ముత్తయిదువ లందరూ పాటలతో ఆడి పాడి వాయినాలు తీసుకొచ్చి ఒడిలో వుంచటం ఒక ఆచారం. దానికి "ఒడినింపటం" అని వాడుతారు.

వీళ్ళంతా నా గుండెల్లో వుంటారు. నువ్వెంత వాళ్ళముందర? నల్లటి అషా వాళ్ళ ముఖమూ నువ్వూనూ. ఆ నొక్కు నొక్కుల జుట్టూ నువ్వూనూ. సిబ్బిలాంటి ముఖం నువ్వూనూ. నీకేం అధికారంవుంది నన్ను ప్రేమించ టానికి? ఇంద్రుడి ఐరావతం ఎక్కడా?.... చాల్లే. ఊరుకో."

"అమ్మా! అమ్మోయి! ఈయన ధోరణి అదేమిటోలావుందేమే? చూడవే వచ్చి."

నే నారోజున గోపీని ఏమేమిటో అన్నానని నాకా తరువాత తరువాత తెలిసింది. ఆవిడ నన్ను ఎలా శాంతపరిచిందో ఆవిడకే తెలియాలి. నేను ఎంత జ్వరతాపంలో చేసినా, ఆ దుర్భర అవమానాన్ని మింగేసి కడుపులోకి అణచివేసింది అంత ఓర్పు ఎక్కడనుంచి తెచ్చు కుందో మరి. గోపీకి నామీద పుట్టిన భావన పవిత్రమైనది కాదని నాకు తెలుసు. కాని నేను ఏముఖం పెట్టుకొని ఆమెను దోషి అంటాను? యౌవనంవున్న మనిషి. జీవితంలో వంచితురాలైన మనిషి....రక్తమాంసా లున్న మనిషి. కాని తన హృదయం వరించిన వ్యక్తికి సేవ చేస్తున్న ప్పుడు, అతన్ని యమపాశంలోంచి తప్పించి యివతలకు లాగుతున్నప్పుడు, సతీసావిత్రి వంటి సాధ్వులను ఆదర్శంగా వుంచుకొని వుండాలి. ఆవిడ త్యాగం కళ్లు మిరుమిట్లు కొల్పేటటువంటిది. ఆవిడ చేసిన శుశ్రూష ఏక దీక్షతో సాధించింది. గోపి ఆ సమయంలో కమ్మరి కొలిమిలో కాలుతూ వుండేది. కాని ఆ జ్వాలలు మింగి జీర్ణం చేసుకుంది. యమధర్మ రాజు పంపిన ఆహ్వానం తిరగగొట్టగలగటం నేనూ నా పూర్వులూ చేసిన పుణ్యంవల్ల కాదు. గోపి పుణ్యంవల్ల. నేను పూర్తిగా ఆరోగ్యవంతుణ్ణయిన తరువాత, ఒకరోజున తీరికగా కబుర్లు చెప్పుకుంటు న్నప్పుడు ఈ సంగతే ఆవిడతో చెప్పాను. కాని, ఈ శ్రేయస్సు తన దనానికి ఆవిడ ఒప్పుకోలేదు. ఆవిడ అభిప్రాయం సరిగా వ్యతిరేకంగా వుంది.

"మీరు పురాణం చెప్తూ వుండేవారా? నేను మీకేసే చూస్తూ కూర్చునేదాన్ని. మీకు దగ్గరలోనే, స్తంభానికి ఆనుకొని కూర్చున్న ఆవిడకు అదేం నచ్చలేదు. చటుక్కున లేచింది. ఎండిపోయి, ముడతలుపడి సన్నంగావున్న పొడుగాటి చేతులూపుకుంటూ వచ్చి, మీ ఎదుటనున్న పళ్ళెం

లోంచి యింత విభూతితీసి నాలుగు వేళ్లూ అంటేలా మీ ముఖాన పెట్టింది. ఆ సమయంలో ఆవిడ అన్నమాటలు జ్ఞాపకం వున్నాయా మీకు? "చక్కగా కళకళలాడుతున్న ముఖం. ఖంగున మ్రోగే కంఠం నాయనా నీది. పాపిష్టివాళ్ళ దృష్టి తగలకూడదు నీకు" అంది; కదూ? కాని, ఆవిడ ఏం చేసినా నా దృష్టి మీ మీదే వుండేది. చంద్రుడికి కళంకమే ఒక శోభ అయినట్లు, మీ కింకో కొత్త నిండుతనం వచ్చింది. ఆఖరికి ఆ ముసలిదాని మాటలే నిజమయినాయి. నా పాడు దృష్టి తగిలింది కనుకనే, మీ రింత జబ్బుపడ్డారు: నా చూపులు మీకు ప్రాణంమీదికి తెచ్చాయి. ఇహమీదట నేను మీ పురాణం వినడానికి రాను."

"ఏమయినా పిచ్చిదానవా ఏమిటీ? అలా దృష్టి దోషం తగిలేటట్టు అయితే, ప్రపంచంలో అందమైనవాళ్ల బ్రతికే వుండరు. మినుకు మినుకు మనే నక్షత్రాలు ఊడి క్రిందపడిపోయేవి. గోపీ: నువ్వు పురాణం వినడానికి రావడం మానెయ్యవద్దు. నువ్వు రాకపోతే. ఇహ నా పురాణ పఠనం రక్తికట్టదు. నీకు ఈ ఒక్క సాత్వికసుఖమే లభ్యంగా వుంది. ఇంకా అది గూడా ఎందుకు దూరంగా తోసేస్తావు?"

"మాటల్లోవున్న సుఖం మోసం చేస్తుంది. అది తృప్తి నివ్వదు. అగ్ని రగులుస్తుంది."

"ఆ అగ్నిమీద వివేకమనే నీళ్ళు పొయ్యి. వైరాగ్యమనే ధార వర్షించు."

"ఇవన్నీ మాటలలో చెప్పటం సులభమే."

"కాదు గోపీ: చెప్పటంగూడా అంత సులభం గాదు. మనస్సు. చంపుకొని చెప్పాల్సి వస్తున్నది. ఆత్మ నాశం కాకుండా వుండడం కోసం ఆచరించవలిసి వస్తుంది."

"నా కా నాశం, నశించడానికి యింకా నా కేం మిగిలివుం దసలు? నా పాలిట నిలిచివున్న దేముంది యిపుడు? మీ ఆ శర్మిష్టా శకుంతలా, మత్స్యగంధీ, వీళ్ళంతా రాత్రుళ్ళప్పుడు చీకటిలో నా చుట్టూ చేరుతారు. నన్ను హేళన చేస్తారు. నన్ను చూచి పకపకా నవ్వుతారు. "మేం, మా మనోభీష్టాలు తీర్చుకున్నాం. చేతకానిదానివి, వెఱ్ఱిదానివి. నీవల్ల ఏమవుతుంది?" అని నన్ను నీచపరుస్తారు. ప్రాణం పోవటంలేదు గనుక

జీవించి వున్నాను నేను. ఇలా హుష్కించి, కుళ్ళి సంవత్సరాల తరబడి చావటం కంటే, ఒకసారి, ఒక దివ్యమైన తేజస్సుమీద దూకి రెక్కలు కాల్చుకొని భస్మమై నశించిపోదామా అనిపిస్తుంది."

"ఇదే ఆత్మనాశం అన్నా నేను."

"అహం! ఎక్కడుందేం ఆ ఆత్మ! ఎవరైనా చూశారా? ఎవరైనా పట్టుకున్నారా?"

"నీ ఆత్మ నాకు కనిపించింది గోపీ! నాకోసం నీ బ్రతుకుమీద కూడా ఒక తులసీదళం పెట్టినప్పుడు, నీ ఆకలిదప్పులు మరచిపోయి నాకు సేవచేస్తున్నప్పుడు నీ ఆత్మ నాకు సాక్షాత్కరించింది. నువ్వుకూడా కొంచం అంతర్ముఖంగా చూడగలిగితే...."

కానీ, గోపీ! అంతర్ముఖి అవడానికిబదులు. అంతర్ధానమయింది. తన మనస్సులో, ప్రళయాన్ని నిభాయించుకోవడంకోసం తక్షణం నా దగ్గిరనుంచి లేచి వెళ్ళిపోయింది. నేనుగూడా లేచి ధర్మకర్తల దగ్గరకు వెళ్ళాను. నే నా మర్నాటినుంచీ మళ్ళీ పురాణపఠనం ప్రారంభించాలి. అంచేత నా మకాం దేవాలయంలోకి మార్చాలి. నేను వెళ్ళగానే ధర్మకర్తలు పూజారికి కబురుపంపించారు. ఆయన వచ్చి సంభాషణలు మొదలుపెట్టాడు.

"మళ్ళీ పురాణం మొదలు పెడ్తారా? మంచిదే. దాని కేం ప్రాయశ్చిత్తం పొద్దునపూటే చేసేసుకోండి. సాయంత్రం పురాణం మొదలు పెట్టవచ్చు."

నేను నివ్వెరపోయాను. ఈ ప్రాయశ్చిత్తం గొడవ యిదంతా నా కేమిటో అర్థం కాలేదు. నా ప్రశ్న నా ముఖంమీదనే కనిపించింది కాబోలు ఆ పూజారికి. అంచేత వివరణ సాగించాడు:

"ఏమిటండీ, మీరు యిన్నాళ్ళూ ఆ కంసాలమ్మాయి యింట్లో వున్నారా. ఒకవేళ ఆవిడచేతి అన్నం నీళ్ళూ పుచ్చుకోవాల్సివచ్చిందేమో! మీ దోషం ఏమీ లేదనుకోండి. కాస్త పంచగవ్యం పుచ్చుకొని, జంధ్యం మారుస్తే ఆ దోషం?"

నాకు కోపం వచ్చింది ఆ ధర్మకర్తలమీదా, పూజారిమీదా కూడాను. చిచ్చుబుద్దిలా లేస్తున్న కోపాన్ని అణచుకొని ఎట్లాగో మాట్లాడాను.

"జరిగిందానికి నా జవాబుదారి ఏమాత్రం లేదు. మీరు నన్ను మీ ఇళ్ళల్లో ఎక్కడైనా ఉంచి వుండినట్లయితే, నా కీ అవస్థ పట్టేది కాదు."

"పోనిత్తురూ! దాని సంగ తెందుకిప్పుడు".

"ఎందు కేమిటీ? మీ కందరికీ ఇంత ధర్మనిష్ఠ, కర్మకాండా ముఖ్యమయితే, నన్ను ఒక్క శుచిగల బ్రాహ్మణ గృహంలో ఎందుకు పడెయ్యలేరు? అది మీకు వీలుపడకపోతే, ఆఖరికి వీధిలోనైనా పారెయ్యాల్సింది."

"మీ రింత పండ్లుకొరకాల్సిన పనేంలేదు శాస్త్రిగారూ! మీకేం ఖర్చు వుండదు. ఆపద్ధర్మమనేది మాకూ తెలుసు. ఉత్త పంచగవ్యం; అంతే. కేవలం సాంప్రదాయం కోసం, బ్రాహ్మణపుటక పుట్టాము గనుక!"

"చాలించండి అంతటితో. ఇంకేం చెప్పక్కర్లేదు. నాకు ప్రాయశ్చిత్తం జరిగింది. ఈ రోజువరకూ తెలిసీ తెలియక నే నే తప్పుచేసి ఏ పాపం ఆర్జించినా, ఆ పుణ్యాత్మురాలైన గోపీ చేతి అన్నం తినబట్టి, నేను శుద్ధిపొందాను. ఏమనుకున్నారో."

"మీరు చెప్పేది లోక విరుద్ధమైన ప్రాయశ్చిత్తం. ఇది మా వూరి వారికి నచ్చదు. మావూరి దేవుడికే నచ్చదు. మీరు యీపళంగానే వచ్చి దేవాలయంలో కూర్చొని పురాణం చెప్పగలగటం మాత్రం పొసగదు."

"సరేలెండి. మీరు పవిత్రమనుకునే పద్ధతిలోనే పురాణం చెప్పవలసిన నిర్బంధంలేదు నాకు. ఈ రోజునుంచీ మన మధ్య జరిగిన ఖరారు తెగిపోయి, నా యిష్టం వచ్చిన చోటికి నేను పోవటానికి వీలు అయినట్లు భావిస్తున్నాను."

నేను ఒక్క ఉదుటున లేచి వెళ్ళిపోయాను. నే నా పూట తిలోదకాలు విడిచింది ఒక్క పురాణపఠనానికే కాదు. ఆ వూళ్ళో నేను సంపాదించుదా మనుకున్న ద్రవ్యానికీ, కీర్తికీ కూడాను. ఉత్తచేతులతో వచ్చినవాణ్ణి ఉత్త చేతులతోనే వెళ్ళిపోవాల్సివస్తున్నది. కాని యీ నష్టాన్ని యింకే వూళ్ళో అయినా నేను పూడ్చుకోవచ్చు. కాని, వాళ్ళు చెప్పినట్లు విని, ప్రాయశ్చిత్తం చేసుకొని, గోపీని అవమానం చేస్తే,నా మానుషత్వానికి కలిగే హానీ, నష్టమూ మాత్రం నా జన్మలో పూడ్చలేను. పుస్తకంలోవున్న

ధర్మకర్మలకు అతీతమైన ధర్మం ఒకటుందని గోపీయే బోధించింది నాకు. అదైనా వట్టి మాటలతో కాదు, ఆచరణతో.

ఇంటికొచ్చి నేనీ సంగతులన్నీ చెప్పగానే, గోపీ వైఖరి విలక్షణమైంది. ఆవిడ సంతోషపడుతోందో, విచారపడుతోందో కూడా నాకు మొదట్లో అర్థంకాలేదు. నే చెప్పిన సంగతులన్నీ విన్నతరువాత ఆవిడ ముఖం దైవికమైన నిర్వికారంతో నిండిపోయింది. ఆమె కళ్ళు విప్పారాయి. ఆ కళ్ళద్వారా నన్ను అంతర్లీనం చేసుకుంటోందా అనిపించింది. ఉన్నట్లుండి ఆవిడలో ఉప్పెన పుట్టింది. ముఖం దీనంగా అయిపోయింది. నిస్తబ్ధురాలైంది. మౌనంగా అలాగే చాలాసేపు కూర్చుని వుండిపోవటం చూసి, నేనే మాట్లాడటం మొదలెట్టాను.

"గోపీ ! మాట్లాడవూ ! నువ్వు చెప్పవలసిం దేమిటో యివ్వాళే చెప్పు. ఈ పగలూ, ఈ రాత్రి లోపల అంతా చెప్పి ముగించు. రేపు గ్రామానికి ఒక్క దణ్ణంపెట్టి వెళ్ళిపోతున్నాను."

"నేనే మనగలను? ఎంత పెద్ద ఔన్నత్యం సృష్టించి కూర్చోపెట్టారు నన్ను. ఎంత ఎత్తుకు తీసుకెళ్ళారు మీరు. నా చేతి అన్నం తిని మీరు నేనీపవిత్రులయ్యారా ?"

"పోనీ ఆ మాటే నా ఎదుట, యింట్లో ఏకాంతంలో అన్నట్లయితే, నన్ను ముఖస్తుతి చేస్తున్నారని అనుకొనివుందును. మీరు వెళ్ళి ఆ ధర్మకర్తల దగ్గరా ఆ పూజారితోటీ బహిరంగంగా చెప్పివచ్చారు. ఈ బహుమానం నేను రెండుచేతులాకూడా మొయ్యలేను. మిమ్మల్ని మీరు దోచుకొని నాకు సమర్పించారు. మీ సంపాదనా, మీ కీర్తీ నట్టేట ముంచి, నన్ను గట్టు ఎక్కించారు. నిజంగా నన్ను తరింపజేశారు. ఇప్పుడప్పుడు మీరు చెబుతూవచ్చిన ఆత్మ అనే దానియొక్క ఒక్క చిన్న కిరణం నా హృదయంలో మసలుతోంది. అది ఒక నూతనమైన అనుభూతిని అనుభవింపజేస్తున్నది. ఆ ప్రకారంలో బ్రతకగలనేమో ప్రయత్నిస్తాను. దాని వెలుగులోనే నా భావిజీవితానికి ఒక క్రొత్తదోవ గోచరిస్తుందేమో వెతుకుతాను."

అలా మాట్లాడుతూ వుండగానే ఆవిడ కంఠం గాద్గదికం చెందింది. పమిటి చెంగులో ముఖం దాచుకొని వెక్కి వెక్కి ఏడ్చింది. నే నింకా ఓ రెండు నెలలపాటు తన కళ్ళముందరే వుంటాను కదా అని ఆవిడకి వున్న ఆశ అకస్మాత్తుగా భగ్నమైపోయింది. ఇంక మా సాహచర్యం ఒక రోజుమట్టుకే. నే నా యింట్లోంచి వెళ్ళిపోవడమంటే, తన బొందె లోంచి ప్రాణం పోతున్నట్లే. నాకూ ఆ విషయంలో చాలా దుఃఖం వచ్చింది. పురాణపఠనం త్యజించటం నా చేతిలో పని. కానీ గోపిని ఓదార్చి, ఆవిడ దుఃఖం పోగొట్టటం నావల్ల అయ్యేపని గాదు. అది ఆ పాండురంగడే ఆవిడమీద దయదలచి సాధించాలి.



75

# మొగలి పువ్వు

కొట్టంలో పశువులని విప్పలేదు. పువ్వులమీది మంచు ఆరలేదు. గూళ్లోంచి కాకులు బయలుదేరలేదు. చెట్ల చివరలనున్న పచ్చటి ఆకుల మీద సూర్యుడి బంగారుకాంతి ప్రసరించలేదు. అటువంటి కనుచీకటి సమయంలో, గడగడలాడించే చలిలో అంతోబాసాధలే వచ్చి, విశ్వనాధం వీధిగుమ్మంముందు నుంచున్నాడు.

నాలుగుమైళ్లు నడిచి ఈ వూరు వచ్చిన అంతోబా ఎంతో వేకువ జామునే బయలుదేరివుండాలి. చిన్నవే అయినా. చక్కగా. చురుకుగావుండే అతని కళ్లు ఎంతో అలిసినట్టున్నాయి. మనసులో ఏవో వ్యధ వున్నట్టు ముఖంలో వ్యక్తం అవుతోంది. వీటినిబట్టి చూస్తే అతను ఆ గడచినరాత్రి చాలా అస్వస్థతతో గడిపివుంటాడని ఎవరికయినా అర్థమవుతుంది. మోకాలి మీదికే కట్టుకున్న పంచా, కిర్రుకిర్రుమంటూన్న చెప్పుజూ. రెండు బొత్తాములు పెట్టుకోకుండానే వదిలేసిన చొక్కా, హరిదాసులాగ నడుముకి బిగించిన ఆకుపచ్చ శాలువా - యిట్టాటి వేషంతో ప్రత్యక్షమయాడు.

విశ్వనాధం పెరట్లో వున్న పనసచెట్టు క్రింది ఎండుటాకులు పోగు చేసి తీసుకొచ్చి, తమ్ముళ్ళకి చలిమంట వేసే ప్రయత్నంలో వున్నాడు.

అంతోబాని చూడగానే, చేతిలో పని విడిచిపెట్టి, వసారాలోకి వచ్చి, తివాసీ పరిచి "రండి, కూర్చోండి" అన్నాడు.

"నేను కూర్చోటానికి రాలేదు" అన్నాడు అంతోబా కటువుగా, తన పల్చటి పెదిమల్లోంచి.

"అయితే మీ యిష్టం ! నా గృహస్థధర్మం నేను నెరవేర్చు కున్నాను."

"నాకు మీ గృహస్థ ధర్మం ఎట్లాంటిదో తెలిసింది: నాలుగు పక్కల ఊళ్ళనుంచీ వందమంది పోగయిన పందిరిలో, పరాయివాళ్ళ ఆడపిల్లని గురించి నోటికి వచ్చినట్లు మాట్లాడడమూ, లేనిపోని నిందలు వెయ్యడమూ యివి కూడా మీ గృహస్థ ధర్మాలే కాబోలు !"

"ఎవరుచేశారు అట్లాగ? నేనా?"

"మీరు కాకపోతే, మీ అమ్మగారు."

"ఓహో, వెనకటికి ఈసప్ కధలలో తోడేలు యిట్లాగే అన్నదట, నీళ్లు తాగుతున్న మేకపిల్లని."

"నువ్వు కాకపోతే, నీ అయ్య" అని.

"ఇదేం వేళాకోళం కాదు. నా మనసుని దహిస్తున్న విషయం యిది. వారం రోజులక్రితం కరమాళీ గ్రామంలో ఆ బాబూరావుగారి కొడుకు పెళ్ళి జరిగింది. నూరు నూటయాభై మంది వుండగా, మీ అమ్మగారు ఏమందో తెలుసా? చూడమ్మా, ఆ అంతోబాసాథలే కూతుర్ని మావాడికి చేసుకో మన్నారు: నేనే తిరగ్గొట్టేశాను. ఎదురుకాళ్ళను పుట్టిన పిల్లమ్మా ! ఎవరు చేసుకుంటారోగాని మరీ, అడుగెట్టిందంటే కొంప కూల్చిందన్నమాటే ! ఆ విషయమే మీ అమ్మగారిని కనుక్కుందామని వచ్చాను. లేకుంటే 'నువ్వు ఏమయినా మంత్రసానిగా వచ్చావా మా ఆవిడ పురిటికి?' అని అడగాల్నుంది."

"అంతోబా" యిట్లా కోపంతో గడగడా మాట్లాడుతూండడం విని, విశ్వనాథం తల్లి యివతలకి వచ్చింది.

"ఏమే అమ్మా ! చూశావా, ఏమంటున్నారో ఈయన: నువ్వు వాళ్ళ అమ్మాయిని గురించి ఏమన్నా వేమిటి?" అని తల్లిని అడిగాడు విశ్వనాథం.

"నే నేమన్నానురా బాబూ ? ఉత్తుత్తి అభాండాలు వేస్తున్నారు నామీద. నా కేం బట్టిందీ – ఆ అమ్మాయి నిలువుగా పుట్టిందో, అడ్డంగా పుట్టిందో ? ఎట్లాపుడితే నా కెందుకురా బాబూ?" అంటూ ఆ ఆరిందా యిల్లాలు, నెత్తిమీది ముసుగు విసురుగా చెవుల వెనక్కి తీసుకుంది.

"ఇప్పుడు మా అమ్మ చెప్పింది విన్నారా ? ఆవిడ ఏమీ అనలేదుట మీ అమ్మాయిని గురించి."

"అనలేదని ఆవిడగారు అంటే సరిపోతుందా ఏమిటి ? కావలసినంత సాక్ష్యం వుంది. నేను ఋజువుచెయ్యడానికి సిద్ధంగా వున్నాను" అంటూ అతను నడుముకు కట్టుకున్న శాలువా ఓసారి విప్పి, మళ్ళీ నడుముకి బిగించాడు.

"ఋజువు చెయ్యవయ్యా అయితే ! నామీద ఈ అసత్యప్రచారం చెయ్యడానికి తెగించిన వాళ్ళెవరో ఓసారి చూపించు నాకు. పద, నీతో వస్తాను."

తల్లి ఆవేశం అంతా విశ్వనాథం చూస్తూనేవున్నాడు. ఆవిడ కాస్సేపటిలోనూ మూడుసార్లు ముక్కు ఎగపీల్చింది – పనిపాటల కోసం పైకి ఎగదోపుకున్న కుచ్చెళ్ళు యింకోసారి పైకి దోపుకుంది ; పమిటకొంగు బిగించి నడుమున దోపింది. అంకోబాకంటె ముందుగానే వీధి వాకిలి మెట్లు దిగింది.

విశ్వనాథం యిదంతా చూసి, "అమ్మా, నువ్వు యింట్లో వుండు. నే వెళతాలే ఆయనతో" అన్నాడు.

మరు నిమిషంలో విశ్వనాధమూ, అంకోబా, కరమళ్ళీగ్రామం వెళ్ళే బాటపట్టారు. దోవపొడుగునా యిద్దరూ నోళ్లు నిప్పలేదు. వాళ్ళ కిర్రుజోళ్లు మాత్రం మాట్లాడుకున్నాయి అంకోబా ముందు నడుస్తున్నాడు. అంచేత అతని రుమాలుక్రిందినుంచి తొంగిచూస్తున్న జుట్టుముడి కొనగాలిలో కొట్టుకుంటోంది. విశ్వనాథం అతని వెన్నువేపే చూస్తూ, "మా అమ్మగారి మీద అభాండం వేస్తున్నావా ? కరమళ్ళీ వచ్చి, నీ ఎర్రటి ముఖం మసి మూకుడులాగా చెయ్యకుండా తిరిగివస్తానేమో చూసుకో !" అని మనసు లోనే అనుకుంటూ నడుస్తున్నాడు.

అసలు ఈ రభసకంతకీ మూలకారణమయిన ఆ అమ్మాయిని కొన్ని నెలలక్రితం విశ్వనాథానికిస్తామని వచ్చారు. అంతోబా మొట్టమొదట ప్రయత్నించాలనుకున్నది విశ్వనాథం సంబంధమే. అది కుదరకనే, యితర సంబంధాలు చూడ్డం మొదలుపెట్టాడు. అదేకనుక సరిఅయివుంటే, ఈ రోజున వారిద్దరూ అల్లుడూ, మామగా హాయిగా కబుర్లుచెప్పుకుంటూ ఏక బాటని నడుస్తూండేవారు.

కాని అప్పుడు విశ్వనాథం ఒప్పుకోలేదు. కారణం, ఆ అమ్మాయి ఎమరుకాళ్ళని పుట్టిందని గాదు. ఆ విషయం అతను కలలోకూడా పట్టించుకోలేదు. విశ్వనాథం ఒప్పనందుకు అసలు కారణం మరోటి.

ఆ అమ్మాయికి తల్లివేపున వున్న దగ్గిరచుట్టాలు చాలామంది తెలుసు విశ్వనాథానికి. ఆ పది పదిహేను మైళ్ళలో వున్న చుట్టు ప్రక్క గ్రామాలలోనే వున్నారు వాళ్ళంతా. ఆ అమ్మాయి తల్లి పుట్టింటివారు బాగా తెలుసు. ఆ అమ్మాయి మేనత్తల వృత్తాంతం తెలుసు. ఆ అమ్మాయి అమ్మమ్మ చరిత్ర కూడా తెలుసతనికి. వాళ్ళందరూ చూడడానికి గంగి గోవుల్లా వుంటారు. కను ముక్కుతీరు చక్కగా వుంటుంది అందరికీ. అందరివీ బంగారంఛాయ శరీరాలు. అందరూ ఒక్కటే మచ్చు. ప్రతి ఆవిడా అత్తవారింట అడుగుపెట్టగానే, ఎట్లాటి భూకంపాలు తెచ్చారో, అన్నీ విన్నాడతను. వాళ్ళంతా పయోముఖవిషకుంభాలని చాలామంది చెప్పారతనికి. ఇప్పుడు ఈ అమ్మాయికూడా ఆ వంశంలోనే పుట్టిన లేతమొలక. ఆ మచ్చునే ఎదుక్కొస్తుంది. పెల్ల ఒకటయితే, మట్టి యింకో టెందుకవుతుంది? తన యింట అడుగు పెట్టిందంటే, అమ్మా, అమ్మమ్మల ఆసువాయితీయే తన యింట్లోనూ తెచ్చిపెడుతుంది. తన కింకా యిద్దరు చిన్న తమ్ము ళ్లున్నారు. ఒక చెల్లె లుంది. వాళ్ళందరిమధ్యా షష్ఠాష్టకంపెట్టి ఊరుకుంటుంది. "ఈ బంగారపుసూది మన పొట్టలో గుచ్చుకోవడం ఎందుకులే" అనుకుని, ఆ సంబంధం వద్దన్నాడు. అమ్మాయి అందంగా వుంటుంది. అంగసౌష్టవం బాగుంది. చదువూ బాగానే వచ్చు. ఇన్ని పద్దులు జమవేపున వున్నా, తను ఆ సంబంధం వద్దన్నాడు. ఈ గుణాలన్నీ మనసులో ఎంచుకుంటూ, తమ సంబంధం తప్పకుండా ఒప్పుకుంటారని వచ్చిన అంతోబాకి. ముక్కూ చెవులూ కోసినట్టయింది, ఆరోజున.

అసలు ఆ అమ్మాయి పేరు వినడానికయినా యిష్టంలేదు విశ్వనాధానికి. ఆవిడని ఏపూరు యిచ్చినాసరే. ఎవరు చేసుకున్నాసరే, తను ఆ వూసుకూడా వినేఅవసరం లేదనే మన స్తత్వంలో వున్నా డతను. అయినా యిప్పుడా అమ్మాయినిగురించి ఎవరో ఏమిటో అన్నమాట నిజమా, కాదా అని ఋజువు చేసుకోవటానికి తను కరమాశి గ్రామానికి బయలుదేర వలసివచ్చింది.

ఇద్దరూ బాబూరావుగారి యింటికి రాగానే. ఆయన స్వాగతం చెప్పి కూచోపెట్టాడు. అంతోబా భార్య పానకం చేసి తీసుకురాబోయింది. అంతోబా ఆవిడతో అసలు విషయం చెప్పాడు, నిజం చెప్పుతానని దేముడి మీద ఒట్టేసుకోమన్నాడు, ఆవిడ. బయటికొచ్చి విశ్వనాధాన్ని చూసి నివ్వెర పోయింది. కాని భగవంతుడుమీద వొట్టుపెట్టుకున్న సంగతి జ్ఞాపకం చేసుకుని, విశ్వనాథం తల్లిగారు ఆ మాట అన్నది వాస్తవమేనంది. అంతోబా, పెద్ద విజయం సాధించినవాడిలాగ ఒక్కచూపు విశ్వనాధంవేపు విసిరాడు. ఇంతట్లో పొరుగింటి "వేణు అక్కయ్య" మోకాళ్ళ మీద చేతులు ఆన్చుకుంటూ, ఒక్కొక్క మెట్టే ఎక్కుతూ వీధి వసారా లోకి వచ్చింది. ముంగిలిలో ఉండగానే సమాచారం అంతా విన్నది. అడిగితేనే గాని కలగచేసుకో కూడదనే పట్టింపు ఆవిడ కేనాడూ లేదు. అలికి శుభ్రంగా వున్న నేలమీద చతికిలబడుతూనే, మాట్లాడ్డం ప్రారంభించింది.

"అన్నదమ్మా, విశ్వనాథం తల్లి అల్లాగే అంది. ఎదురు కాళ్ళని పుట్టిన పిల్లమ్మా అంది. అసలు నే నప్పుడె మందలించాను కూడాను. ఇదిగో నర్మదా, నిజమే అవనీ, అబద్ధమే అవనీ, పెళ్ళికాని పిల్లనుగురించి పదిమందిలోనూ నువ్విలా అనడం బాగుండలేదు సుమా, అన్నాను. ఆవిడ ఊరుకుంటేగా :"

ఇప్పుడు అంతోబాకి పరిపూర్ణమయిన విజయం లభించినట్లయింది. విశ్వనాధంవేపు చూసి, "యిప్పుడు తృప్తేనాండి ? ఋగ్వేదమంత ఋజువు దొరికిందా మీకు ? ఈ 60 ఏళ్ళ వృద్ధురాలు చెప్పింది విన్నారుగా :" అన్నాడు.

విశ్వనాథానికి ముఖం వాడిపోయింది. తను అంతోబాకు తాటాకులు కట్టించాలని వచ్చాడు. అవి తనవెనకే వేళ్లాడుతున్నాయి. వంచిన తల ఎత్త

లేదు. అతనికి ఎవరి విషయంలో అయినాసరే న్యాయం జరగాలనే పట్టింపు మహా ఎక్కువ. అబద్ధమూ. అన్యాయమూ అంటే కోపంవచ్చేది. తనే ఒక న్యాయాధిపతి స్థానంలో కూచునివుంటే, తనముందే ఈ అంతోబా ఈ అభియోగం తీసుకొచ్చి, ఈ ఋజువులు కనబరిస్తే, తన తల్లికి తప్పకుండా దండన విధించివుండేవాడు.

విశ్వనాథం నిస్సహాయస్థితిని గమనించి, అది పూర్తిగా వుపయోగించుకో దల్చుకున్నాడు అంతోబా. ఇంతట్లో యిరుగూ పొరుగూ నలుగురు పెద్దమనుషులు వచ్చి అరుగుమీద కూర్చున్నారు. వాళ్ళని ఉద్దేశించి, అంతోబా తను చెప్పుకోవలసింది మొదలుపెట్టాడు :

"బాబుల్లారా : 'పంచముఖీ పరమేశ్వరో' అన్నారు. మీరే నాకు దేముడితో సమానం. యిప్పుడు నా చిక్కేమిటో మీకు చెప్పుకుంటాను.

"తళవణీ గ్రామంలో కింజవడేకర్‌గారి అబ్బాయికి మా అమ్మాయిని చేసుకోవాలని మాటలు జరిగాయి. ముహూర్తం నిశ్చయించటం ఒకటే తరవాయి. ఇంట్లో అప్పడాలూ, వడియాలూ తయారయ్యాయి. చీరలూ, నగలూ కూడా సిద్ధం చెయ్యడం అయింది. సాంఖళీ గ్రామం వెళ్ళి సిద్ధాంతులతో సంప్రతించి, ముహూర్త పత్రం వ్రాయించి పట్టుకొచ్చాను. ఇంతట్లో మొన్నటి రోజున 'ఓసారి వచ్చి కలుసుకోండి' అని వియ్యాలవారు కబురు పెట్టారు. వెళ్ళాను. 'మీ సంబంధం మాకక్కరలేదు' అన్నారు. కారణం చెప్పమని బలవంతపెడితే, యీ వృత్తాంతం అంతా బయటికొచ్చింది. అయితే. 'మనం బయలుదేరి వెళ్ళి యిందులో నిజం ఎంతో, అబద్ధం ఎంతో తేల్చుకుందాం రండి' అన్నాను. దానికి పెళ్ళికొడుకు తండ్రి ఒకటే సమాధానం చెప్పాడు. పంట పండితేనేగాని అమ్మకం అంటూ వుండదు; పువ్వు పూడితేనేగాని పరిమళం అంటూ వుండదు. మీ అమ్మాయి సర్వవిధాలా సలక్షణమయిన పిల్లే కావచ్చు. మేం కాదనటం లేదు. కాని, మాకు మీ సంబంధం అక్కర్లేదు. అంతే !

"బాబూ యిప్పుడు మీరే ఆలోచించండి పెళ్ళీడొచ్చిన పిల్ల. ఇప్పుడు నిశ్చితార్థం కూడ జరిగిన యీ పెళ్ళి ఆగిపోతే, యిహ యింక ఏ సంబంధమూ ఎక్కిరాదు. అసలు ఈ పాటికి ఈ విషయాలు నాలుగు ఊళ్ళల్లోనూ పాకే వుంటాయి. అంచేత. ఈ క్రీనీడ మమ్మల్ని వదలదన్న మాట.

ఇటువంటి పరిస్థితులవల్ల మా అమ్మాయికి పెళ్ళికాకనేపోవచ్చు ! అప్పుడు అమ్మాయి అలాగే పుట్టింట వుండిపోతే, రేప్రొద్దున్న ఏదయినా ఒడిదుడుకు జరిగితే ఎవరిది బాధ్యత ? నరంలేని నాలుకతో నాలుగు ముక్కలూ అని ఎవరిమటుకు వాళ్లు వెళ్ళిపోయారు. వాళ్ళకేం ? నా పిత్రుదేవతలు మాత్రం నరకంలోపడి ఏడుస్తూండాలి ! పైగా మా పరువూ ప్రతిష్ఠా...."

విశ్వనాధం ఈ వుపన్యాసం అంతా వింటూనే వున్నాడు. ఒక్కొక్క వాక్యమూ అతన్ని కందిరీగ కుట్టినట్టు కుడుతూనే వుంది. ఈ అంతోబా తనను అవమానం చెయ్యాలనీ, తన రణంమీద ఉప్పు రుద్దాలనీ యిలా మాట్లాడుతున్నప్పటికీ, అతను చెప్పే విషయాల్లో మాత్రం అబద్ధం ఏమీ లేదు. నిజంగానే, ఆ పిల్లకి యిక సంబంధాలు కుదరకపోవచ్చు. తన తల్లి ఏదో తెలివితక్కువవాగుడు వాగినందువల్ల, ఒక అమాయకపు యువతి బ్రతుకంతా అర్థాంతరమయిపోయే పరిస్థితి ఏర్పడింది. సదసద్వివేకం వున్న విశ్వనాథం, కావలసినంత కారణం వుండిగనుకనే, అంతోబా యిలా ఆవేదన పడుతున్నాడనీ, ఆగ్రహంతో మాట్లాడుతున్నాడనీ గ్రహించాడు. దీనికంతకీ తన తల్లి కారణం. ఇలాగే, న్యాయమూర్తిలాగ రెండువేపులా ఆలోచిస్తూ కూర్చున్నాడు. తలవంచుకుని ఆలోచించి ఆలోచించి, చివరికి ఒక నిశ్చయానికి వచ్చాడు. అప్పుడు ఆ పెద్దలందరినీ ఉద్దేశించి :

"పెద్దల్లారా, మా అమ్మగారు చేసిన పొరపాటు స్వల్పమయినది కాదు. నోరు జారిన తరువాత కూడదీసుకోవటం అసాధ్యం. ఆ అపరాధానికి ఒకటే నిష్కృతి వున్నట్టు కన్పిస్తోంది. అంతోబాగారు, మొదట్లో వా రమ్మాయిని నాకిచ్చి పెళ్ళిచేయడానికి ప్రయత్నం చేశారు. నేను వద్దన్నాను. దానికి కారణం మా అమ్మగారు సూచించినది కాదు. అయినా యిప్పు డదెందుకులెండి! ఇప్పుడు కూడా అంతోబాగారికి మాతో సంబంధం యిష్టంవుంటే, ఆ అమ్మాయిని నేను చేసుకుంటాను."

ఈ మాటలు వినేటప్పటికి అక్కడ కూచున్న అయిదారుగురు పెద్దలకీ కళ్ళు విప్పారాయి. గారడివాడు వచ్చి కనికట్టు చేశాడేమో అనిపించింది. ఈ విషమ పరిస్థితికి యిటువంటి పర్యవసానం కలుగుతుందని వాళ్లు కలలోకూడా అనుకోలేదు. ఈ క్షణంవరకూ వాళ్ళ సానుభూతి అంతోబామీదే వుంది. కాని అది యిప్పుడు చటుక్కున విశ్వనాధంవేపు

మొగ్గింది. బాబూరావుగారు అంతోబావేపు తిరిగి, "యింకేమయ్యా మరి? గంధక తైరలాగా ఆరంభమయినది పూలదండలాగా మారింది! ఏమంటావు నువ్వు?" అన్నారు.

"నిజమే అనుకోండి. కాని యిప్పుడన్న మాటమీద ఈయన నిలబడతారా అని. అయినా మీరంతా సాక్ష్యం వున్నారనుకోండి."

"ఖరారుపత్రం వ్రాసియిమ్మన్నారా?" అన్నాడు కోపంగా, విశ్వనాధం.

అంతోబా అక్కర్లేదన్నట్లు తలతిప్పుతూ, 32 పళ్ళూ కనిపించేలాగ నవ్వాడు. అతనికి తన విజయం రెండురెట్లయినట్టనిపించింది. మొదట్లో అక్కర్లేదని విదిలించుకున్న పెద్దమనిషే, యివాళ తలవంచుకుని తన కూతురిని చేసుకోవడానికి ఒప్పుకున్నాడు, ఏ షరతులూ పెట్టకుండా.

ఆ తర్వాత ఒకవారం రోజులలో, అంతోబా వేయించిన బ్రహ్మాండమయిన పందిరిలో, విశ్వనాధానికీ, కుముదకీ శాస్త్రోక్తంగా పాణిగ్రహణం జరిగింది. యథావిధిగా, కన్యాదానం చెయ్యడానికి కుముద తల్లి ఎలాగా అక్కడ వుండవలసిందే: కాని, ఆవిడతో పాటు పెళ్ళికూతురు అమ్మమ్మా, మేనత్తయూ కూడా హాజరయారు. పెద్ద పనున్నవాళ్ళలాగా తిరుగుతూ, ఎక్కడ చూసినా వాళ్ళే అగుపించారు. వాళ్ళ అత్తవారిళ్ళు దగ్గిర దగ్గిర వూళ్ళల్లోనే! ఒక్క అచ్చులో పోతపోసిన విగ్రహాల్లాగా, ఒకళ్ళని చూస్తే ఒకళ్ళని చూడక్కరలేదు. అందరివీ కాస్తోకూస్తో పిల్లికళ్ళే. అలాగే కుత్సితమయినవీని. అందరివీ గోధుమ తాచువంటి శరీరచ్ఛాయలే. అందరి కంఠస్వరాలూ ఒకటే రకం. అంటే ఆడవాళ్ళయినా మగవాళ్ళలా ఖంగుమని అధికారం చేసే గొంతుకలు. వాళ్ళంతా సన్నిహిత బంధువులని ఎవరూ చెప్పక్కర్లేకుండానే, కొట్టొచ్చినట్టు కనుపిస్తుంది. ఈ బొమ్మలన్నీ ఒక మట్టితో తయారయినవే అని చూడగానే తెలుస్తూంటుంది.

ఈ మాత్రు వంశపు వారసత్వం అంతా పుణికిపుచ్చుకున్న ఈ పెళ్ళికూతురు కుముద - పదహారేళ్ళయినా నిండని దోరపడుచు - విశ్వనాధానికి ఎదురుగా పీటమీద కూచునివుంది. అదే శరీరచ్ఛాయ, అవే కళ్ళు, అవే

స్వరూపమూను. స్వరం ఎట్లా వుంటుందో యింకా అతని చెవినిపడలేదు. ఆమెవేపు చూస్తూంటే. విశ్వనాథానికి మనసులో ఆలోచనలు సుడిగుండాలు తిరిగాయి. "స్వభావమూ అట్లాటిదే అయివుంటుంది. కళకళలాడుతూ వున్న యింటిని చితక్కొట్టే స్వభావం : స్వార్థాన్నిగురించే ఆలోచించే స్వభావం. ఎదటివాళ్ళ కష్టాలని ఖాతరు చెయ్యని స్వభావం :"

మధ్య మధ్యని ఆవిడవేపు చూశాడు. కాని ఆ చూపు పెళ్ళికొడుకూ, భర్తచూసే చూపు కాదు. విమర్శకుడి నిశితవీక్షణం కాకపోతే అతనికి చాలా విషయాలు గోచరించి వుండేవి. అతినేర్పుగా కాటికదిద్దిన ఆవిడ కళ్ళల్లో ఎంతో సౌమ్యమయిన ఆకర్షణవున్నట్టు అతనికి తెలిసివుండేది. కొత్తచీర యొక్క నిగనిగతో ఆవిడ శరీరచ్ఛాయ పోటీపెట్టుకున్నదని అతనికి కనిపించివుండేది. ప్రతి ఆభరణమూ ఆవిడ వంటినంటుకుని, ఆవిడని స్వర్ణలతలా చెయ్యడానికి తోడ్పడిందని అతనికి తోచివుండేది.

ఊరేగింపు అయినతర్వాత, లక్ష్మీపూజ జరుగుతుండగా- తన తల్లి ఆజ్ఞ ప్రకారం ఆ అమ్మాయికి "గిరిజ" అని అత్తింట వాడుకునే పేరు పెట్టాడు. కాని అతనికి మాత్రం మనసులో ఆ అమ్మాయికి కైకేయి అనో, మంధర అనో పేరు పెడితే సార్థకం చేసుకునేదనిపించింది. లక్ష్మీపూజ సమయంలో కుసుద భర్తపక్కని కూర్చున్నప్పుడు, వాళ్ళిద్దరి మోకాళ్ళూ తగలక తప్పలేదు. కాని మనసులు చేరికఅవలేదు. అతని మనసులో ఎటువంటి ఆలోచనలు రేగుతున్నాయో ఆవిడ ఊహించుకోలేక పోయింది. తను నవవధువుగా. అతని శృంగారసరోవరములో రాజహంసగా, అతని గృహలక్ష్మిగా యీ అత్తింటికి కొత్తగా వస్తోంది. ఆరోజంతటిలోనూ అనేకసార్లు అతని కళ్ళల్లోకి చూసింది. కాని ప్రతిసాటూ అతను ముఖం తిప్పుకున్నాడు; దృష్టి మరల్చుకున్నాడు. అతని నోట వచ్చిన ఒక్క కోమల శబ్దం. అతని కళ్ళల్లో పొడగట్టిన ఒక్క కుతూహలకిరణం, అతని పెదవుల మీద తోచిన ఒక్క భావగర్భితమయిన స్మితరేఖ, వీటికోసం తను రోజంతా ఎదురుచూసి, ఎదురుచూసి తల్లడిల్లిపోయింది. ఆవిడ మనసులో ప్రశ్నపరంపర ఉద్భవించింది. "ఎంచేత యిలాగ? ఈపెళ్ళి ఈయనకి యిష్టంలేదా? ఓసారి వద్దన్నారు. మళ్ళీ సరేఅన్నారు. ఇందులో బల

వంతపెట్టడం ఏమయినా సంభవించిందా? ఏమయితేనేం, యీ శిలాప్రవృత్తిని ఛేదించటానికి మొత్తానికి నేనో తపస్సు చెయ్యాలసి వచ్చేలా వుంది!

ఇదేసమయంలో విశ్వనాథం మనసు మాత్రం ఊరికే కూచుందా మరి? "నా తరువాత యింకా యిద్దరు తమ్ముళ్ళూ, ఒక చెల్లెలూ వున్నారు. ఇంకా చిన్నవాళ్ళు వాళ్ళు. నాన్నాగారా లేరు. నేనే తండ్రిలాగ వాళ్ళని సంరక్షించి, వృద్ధిలోకి తేవాలి. ఇప్పుడు యీవిడ నా భార్య నంటూ యింట్లోకి వస్తోంది. కాని నా సోదరులని కాపాడడంలో ఈవిడ నా క్షేమాత్రపు సహాయం చేస్తుందో తెలిసినసంగతే. తన వంశపు వైఖరిలోనే ప్రవర్తిస్తుందనుకోటానికి ఏమీ సందేహం అక్కరలేదు. మెరుస్తున్న ఆ పిల్లి కళ్ళలో ఆ సంగతి తెలుస్తూనేవుంది. ఈవిడ కావేషాలకీ, కలహాలకీ కావలసినన్ని విత్తనాలు వేస్తుంది. అలా జరగకుండా చేయాలంటే, యిప్పటినుంచీ యీవిడని కత్తిమీద నడిపిస్తూ వుండాలి. మొత్తానికి యిది ఓ తపస్సు చేసినంతపని!"

కాని, మరుదుళ్ళూ. మరదళ్ళూ మాత్రం ఆవిడ విషయం యింకోలా నిర్ణయించుకున్నారు. కుముదవంటి చురుకయిన, సంతోషమయిన సందడిగల వదిన దొరికినందుకు వాళ్లు చాలా ఆనందపడ్డారు. వాళ్ళకి ఆవిడ అన్నివిధాలా నచ్చింది. మొదటి ఏడెనిమిది రోజులూ వాళ్ళావిడని ఒక్క నిమిషమయినా విడిచిపెట్టలేదు. చుట్టేసుకు తిరిగారు. ఇంట్లోనూ, పెరటోనూ వున్న ప్రతి వస్తువూ ఎంతో వుత్సాహంతో చూపించా రావిడకి.

ఇప్పుడిప్పుడే గోచీ పెట్టుకోవటం ఆరంభించిన ఆత్మారామ్, "వదిన కళ్లు ఎంచక్కా జీడిగింజల్లా వున్నాయికాదురా!" అన్నాడు. అప్పటికే పంచకట్టుకుంటున్న 12 ఏళ్ళ వామనరావు మాత్రం "వదిన మొత్తంమీద అందంగానే వుందిగాని, రెండు పైపళ్లు మాత్రం కాస్త ముందుకి వున్నాయి. ఆ పైన ఒక్క రవ్వ ఆ చెవులుకూడా కాస్త పెద్దవే! మరీ అంత పరుచుకున్నట్లు ఉండకుండావుంటే బాగుండిపోయేది" అన్నాడు తల ఒక పక్కకిపెట్టి ఆలోచిస్తూ. వీళ్ళిద్దరి మాటలూ విని, అందరికంటే చిన్నదయిన ఆరేళ్ళ మనూ "పొండిరా పిచ్చాళ్ళల్లారా! వదిన అసలు ఎంచక్కా వుంది!" అని తీర్పు చెప్పేసింది.

తన మరదలకి తను ఎంతో నచ్చిందనీ, ఆ పసిహృదయం తనని ప్రేమిస్తోందనీ తెలుసుకున్నప్పుడు, కుముదకి ఎంతో అపురూపమయిన అదృష్టం పట్టినట్టనిపించింది. కాని తను మనస్ఫూర్తిగా తృప్తి పడాలంటే గొడవలు యింకా చాలా వున్నాయనిపించింది. కారుమేఘం నడినెత్తికి వచ్చినా. చినుకనేది భూమిమీద పడకపోతే. ఎంత చిరాకుగా వుంటుందో. ఎంత ఉక్కపెట్టినట్టుంటుందో. ఎంత దుర్దిన మనిపిస్తుందో, అలాగేవుంది తన స్థితికూడా. తనూ ప్రయత్నిస్తోంది; ఉపాయాలు వెతుకుతోంది; ఒక్కొక్కప్పుడు తను కోరినది చేతికి దొరికినట్టుకూడా భ్రాంతి కలుగుతోంది: కాని గుప్పెడివిప్పి చూసుకుంటే. అందులో ఏమీ వుండటంలేదు.

ఆవిడ మనసులోనే తర్కించుకోవటం మొదలుపెట్టింది. "యిందు, తీసుకో అని చూపించి, ఆశపెట్టి, చేయి జాపినప్పుడు. అరిచేతిలో ఛళ్లుమని చరవటం ఏం న్యాయం? ఆయన మనసారా ఒక్కమాట మాట్లాడరేం నాతోటి? నావేపు చూడడంకూడా, ఏదో పహరా వున్నవాడు ఖైదీవేపు చూసినట్లు చూస్తారేం? పోనీ నేనంటే అసహ్యమేమో అనుకోవటానికి మళ్ళీ ఊపిరి సలపనివ్వరు అప్పుడు. కాని నా పమిటకొంగు గాలితగులే చాలు, తప్పించుకొని తిరుగుతారు. ఇంతకీ ఆయన ఆపేక్ష అంతవరకేనా? నే నీ యింటవున్న ప్రయోజనం అంతేనా? నా మనసులో వున్న ఆలోచనలమీది ముసుగు తప్పించి, ఒక్కసారయినా తొంగిచూడాలన్న ఆలోచనే రాలేదా ఆయనకి? నాకున్నది ఈ శరీరంమట్టుకే, మనసూ హృదయం అనేవి లేనేలేవని అనుకుంటున్నారా? అందంగా శృంగారించి తెచ్చిన, ప్రాణంలోవున్న ఆటవస్తువని అనేనా ఆయన అభిప్రాయం! లేక లోలోపల ఏదయినా ఒక గడ్డుసమస్య పట్టుకుందా? పెళ్ళికి ముందు జరిగిన రభస నాకు తెలుసు. కాని అందులో నా తప్పేముంది! మా నాన్నగారిమీది కోపానికి నేను ప్రాయశ్చిత్తం అనుభవించాలా? ఆయన సామీప్యం ఒక విధంగా సుఖాన్నిచ్చినా, యింకొకరీతిగా దహించివేస్తోంది. ఇహ యింక యిల్లా గడపవలసిందేనా? ఎండవస్తుంది. కాని ఎన్నటికీ వసంతం రాదా? నా జన్మ అంతా యిలా తెల్లవారవలసిందేనా? ఏమిటి చెయ్యడం? సలహా చెప్పేవారు మాత్రం ఎవరున్నారు.

ప్రతి ఉదయమూ కుముద పడకగదిలోంచి బయటికి రావడం

అప్రసన్నమయిన మనసుతోనే వచ్చేది. ముంగిలి తుడవటానికి చీపురు చేత పట్టాలన్నా ఓపిక వుండేది కాదు. ఇంటిముందు పంటకాలువ కలకల మంటూ వుండేది. పిట్టగోడ దగ్గిర సంపెంగచెట్టు పరిమళం వెదజల్లుతూ వుండేది. ఎడంవేపు కొట్టంలో వున్న ఆవు పాలు తాగుతూన్న దూడని నాకుతూ వుండేది. పోకచెట్ల శిఖరాల నున్న ఆకుల మీద పిల్లగాలులు ప్రసరిస్తూవుండేవి. ప్రాకారంలో వున్న నేరేడుచెట్టు మీది గూట్లోంచి, పక్షి పిల్లలు చూకుతూ వుండేవి. కాని యింతటి ఉత్సాహపూరితమయిన వాతావరణంలోనూ, ప్రకృతి అంతా ఆనందంతో గంతులు వేస్తున్నా, కుముదకి ఉల్లాసం ఉండేది కాదు. బాహ్య ప్రపంచం అంతా సుఖంగా వుండేది; అందంగా వుండేది. హాయిగా వుండేది కళకళలాడుతూ వుండేది. కాని, తన ఆంతరంగంలో ? అందులో సంశయ ముండేది. తెలియని భయం వుండేది. తీరని వ్యధ వుండేది. గాఢాంధకారం వుండేది.

ఆ తరువాత, స్వల్ప వ్యవధిలోనే, విశ్వనాథుడి మనసులో వున్న బ్రహ్మముడి ఏమిటో ఆవిడకి బోధపడింది. అదెల్లా సంభవించిందంటే.

ఒకరోజున ఓ పాలేరుపెళ్ళాం. పది జీడిమామిడి పళ్ళు మూటగట్టి తెచ్చి మరదలు మనూ చేతికిచ్చింది. అంతట్లో ఆత్మారాం ఆ మూటకోసం పెనుగులాడటం ప్రారంభించాడు. క్షణంలో వామనరావువచ్చి జొరబడ్డాడు. మూట ఊడిపోయి పళ్ళన్నీ చెల్లాచెదరయిపోయాయి. పిల్లలు యెవళ్ళ కందినవి వాళ్ళు పోగుచేసుకున్నారు. మనూకి రెండే రెండుపళ్ళు దొరికాయి. అందులో ఒకటి వెంటనే నోట్లో కుక్కేసుకుంది. రెండోది తినబోతూండగా ఆత్మారాం క్రిందనుంచి దానిచేతిమీద ఒక్క దెబ్బకొట్టి పండు ఎగరగొట్టేశాడు. పైపండు పైనే పట్టుకుని తన నోట్లో పెట్టేసుకున్నాడు. దాంతో మనూ యిల్లెగిరిపోయేలాగ ఏడవటం సాగించింది. కుముద ఆ పిల్లని దగ్గరకి తీసుకుంది. తన పమిటకొంగుతో రెండుసార్లు, మూడుసార్లు దాని కళ్ళు తుడిచింది – కాని మనూ ఏడుపు ఆపలేదు. కళ్ళనీళ్ళు తగ్గలేదు. ఇక ఆ పసిదాన్ని సముదాయించటానికని కుముద తన ముఖం అమ్మాయి దగ్గరగా పెట్టి, చెవిలో ఏమిటో చెబుతూ ఊరడించింది. "అమ్మా, మనూ ! ఏడవకుమరి రేపే నేను చాలాచాలాపళ్ళు కోసి తెచ్చిపెడ్తాను. నీ ఒక్కర్తెకే

పెడతాను ఏం? ఆత్మారామయ్య మంచివాడు కాడు. మనం ఆతని జల వుండవద్దు ఏం? నువ్వూ. నేనూ జత సరేనా?"

అప్పుడే యింట్లోకి ప్రవేశిస్తున్న విశ్వనాథానికి ఆత్మారామయ్య మంచివాడు కాడు అన్న ఒక్కవాక్యమూ వినిపించింది. నివ్వెరపోయాడు. వాళ్ళిద్దరివేపూ ఒక్కసారి ఉగ్రంగా చూశాడు ఆయన ముఖంలో అమిత మయిన ద్వేషం కనిపించింది. మనూమీద చూపెట్టాడు కోపం అంతా.

"మనూ....ఏమిటా దుర్మార్గపు రహస్యాలు? లే అక్కడనుంచి! రాక్షసీ!....ఇంకేం? మంచిపనే! పచ్చగావున్న కొంపలో చిచ్చుపెట్టావు!"

ఆఖరి రెండు వాక్యాలూ కుముదని వుద్దేశించే అన్నాడతను. ఆవిడకి ఈ గర్జన ఏమిటో అర్థమే కాలేదు.

"ఇప్పుడు పచ్చగా వున్న కొంప" ప్రసక్తి ఏం వచ్చిందసలు? ఏం పొరపాటు చేశాను? నేను ఏదో ఏడుస్తున్న పసిపిల్లని ఊరడించి నవ్వించాను. నిజానికి ఆయన అసలు నన్ను మెచ్చుకోవలసింది. అది లేక పోతే పోయింది - ఏమేమిటో నిందలు వేస్తున్నారేమిటి?

కాని ఆ సందేహం తీరడానికి ఆటేసేపు పట్టలేదు. వంటింట్లో వున్న తల్లిదగ్గరకి వెళ్ళి విశ్వనాథం పదపళ్ళు తొక్కటం ప్రారంభించాడు.

"అమ్మా! అనుకున్నంతా అయేలాగేవుంది! ఒకరిని చూస్తే ఒకరికి కిట్టకుండా పుల్లలాగ విత్తనాలు వెయ్యటం ఆరంభించింది కోడలు! ఈపూట మనూని దగ్గరకితీసుకుని ఆత్మారామన్నయ్య చెడ్డవాడని చెప్పటం. రేపు ఆత్మారాముణ్ణి కూచోబెట్టుకుని వామనరావు దుష్టుడని చెప్పడమూ, ఆఖరికి కొంపలో కొరకంచు పూర్చటమూను; పుట్టింటివాలు పూరికే పోనివ్వలేదు! ఈవిడ తల్లిగారు అత్తింట అడుగుపెట్టగానే మూడుపొయిలు ఏర్పాటు చేసింది. ఒక మేనత్త అమాయకుడయిన మరిదిని దేశాంతరం తరిమేసింది. రెండో మేనత్త మొగుడికీ, బావగారికీ మధ్య పచ్చగడ్డేస్తే భగ్గుమనేలాగ చేసింది. ఇహ ఈవిడ అమ్మమ్మగారు చెప్పనే అక్కర్లేదు! ఇప్పటికీ వంగి వంగి నడుస్తూ, ఆ ముడతలుపడ్డ ముఖంతో ఎంత వెట కారంగా మాట్లాడుతుందో విన్నావుగా నువ్వు! ఈ వంశంవారితో సంబంధం పెటుకోకూడదని నేను ఎంత జాగ్రత్తగావున్నా, చివరకి తప్పిందికాదు.

నువ్వు నోరు పారేసుకోబట్టి, ఈ కొంపలు కూల్చేదాన్ని యింటికి తెచ్చు కోవాలసి వచ్చింది. ఈ తంపులమారిని పెళ్ళిచేసుకోవాలసి వచ్చింది. కుచ్చితపు మనిషితో సంసారం చెయ్యాలసివచ్చింది!"

నట్టింటోవున్న కుముదకి ఈ కోలాహలం అంతా వినిపించింది. భర్త నిప్పులు చెరగటం, అంతదూరాన్ని వున్నాకూడా ఆవిడకి స్పష్టమంటూనే వుంది. ఆయన మనసులో యిన్నాళ్ళనుంచీ కలుక్కుమంటున్న చీపురుముల్లు ఏమిటో యిప్పుడర్థమయిం దావిడకి. ఆహా, ఎంత ముళ్ళకంపక్రింద ఎంచు కుంటున్నారు తనని. నిజానికి తనదగ్గిర ఒక్క ముల్లు అయినావుందా? తను మరదలిని ఊరడించడానికి ప్రయత్నం చేసింది. కాని పరిణామం యిలా ప్రమాదకరంగా ఏర్పడింది. అది తెలుసుకున్నకొద్దీ ఆవిడకి దుఃఖం పొంగి వచ్చేసింది. 'అంచేత ఉతకవలసిన బట్టలు తీసుకొని బావిదగ్గిరకి వెళిపోయింది. అక్కడ పొంగుని బట్టలు ఉతుకుతూంటే, ఆవిడ కళ్ళనీళ్ళు కూడా అనివార్యంగా అరటి చెట్లకి ప్రవహించాయి. ఎవరికీ కనపడకుండా ఎంతోసేపు ఏడ్చింది.

ఆ తర్వాత తనలో తనే ఆలోచించుకుంది.

"ఇప్పుడింక ఈ పరిస్థితి తొందరలో ఏం మారదు: ఆయనగారు నన్నుగురించి మందరే ఒక నిశ్చిత అభిప్రాయం ఏర్పరచుకున్నారు. ఇంకిప్పుడు నేను ఏమిచేసినా వంకరఅర్థాలే వస్తాయి. నాహృదయం ఇంకిప్పు డెలాఅర్థమవుతుం దాయనకి? నేను చెయ్యగలిగిందేముంది? ఎప్పుడో మును ముందు కీడుచేయనని యిప్పుడు ఆయనకి నమ్మించటంఎలా? యిహఒక్కటే వుపాయం. నోరుతెరచి మాట్లాడకుండా ఉండడం."

అంతే. ఆరోజునుంచీ ఆవిడనోటికి తాళం వేసుకుంది. అత్తగారు చెప్పిన పనులు నోరెత్తకుండా చెయ్యటం, ఆవిడ ఏమయినా ప్రశ్నలు వేస్తే సాధ్యమయినంతవరకూ తల ఆడించీ, అంత మరీ అవసరమయితే, 'ఆఁ' 'ఊఁ' అనీ సమాధానాలు చెప్పడమూ, వీలయినంతవరకూ తప్పించుకు తిరగడమూను. కాని తను తప్పుకు మసలినా పిల్లలు తనచుట్టూనే చేరే వారు. చిన్న పిల్లలు వేసే చిన్న చిన్న ప్రశ్నలు వందలకొద్దీ వేస్తూండే వారు. వాళ్ళతో మాట్లాడం అంటే తనకీ సరదాగానూ, సంతోషంగానూ

వుండేదే కాని సముద్రపు పొంగులా హృదయంలో ఉబికివచ్చే సమాధా నాలు, పెదవులు దాటకుండా అణిచేసేది. ఎంతో బాధపడి నిగ్రహించు కునేది. ఎందుచేతంటే, విశ్వనాథం ఆనాడు అన్న మాటలు ఆవిడ చెవులలో అనుక్షణమూ గింగురు మంటూండేవి.

"కొంపలు కూల్చేది; తంపులమారి; కుచ్ఛితపు మనిషి."

ఒక్క మాట మాట్లాడేది కాదు. తన కళ్ళల్లో ఒక్క క్షణంపాటు మెరిసిన ఉత్సాహం యిట్టే అణగారిపోయేది. ఉన్నవీ లేనివీ పనుల మిష పెట్టుకుని, ఆ పిల్లల మధ్యనుంచి లేచి పారిపోయేది.

వదిన ఎందుచేతనో తమతో సరీగా మాట్లాడటంలేదని పిల్లలు నాలుగు రోజుల్లోనే గ్రహించేశారు. "చెప్పు: ముందు నేనడిగినదానికి సమాధానంచెప్పు? లేకపోతే నిన్నెక్కడికీ వెళ్ళనివ్వను" అని ఆత్మారాం కొంగుపట్టుకు వదిలేవాడు కాదు. మనూ ఎదుటికి వచ్చి, మోకాళ్ళు కౌగలించుకుని బంధాలువేసేది. ఇహ అప్పుడు మాట్లాడక తప్పదేమోననిపించేది కుముదకు. కాని ఏమని చెప్పడం వాళ్ళకి? వంకర అర్థంచేయడానికి వీలులేని మాటంటూ ఏమున్నాయి? మాట్లాడక పోవడానికికూడా అపార్థం తీయవచ్చునే! "చూశావా, యిప్పటినుంచీ మరదలిని విదిలించి అవతల పారేస్తోంది; అంతే వంశలక్షణం ఎక్కడికి పోతుంది?" అంటారేమో ఆయన! అందుచేత వాళ్ళందర్నీ దగ్గరకితీసుకుని "మా ఆత్మారాం ఎంతో తెలివయినవాడు!" "మా మనూ ఎంతో మంచి పిల్ల!" అని రెండు మాటలు పలికి, మళ్ళీ నోటికి తాళం బిగించేసేది.

ఈ మధ్య నవ్వటం, మాట్లాడ్డం పూర్తిగా మానేసింది కుముద. అవసరమయినప్పుడు ఎంతతక్కువగా మాట్లాడాలో అంతే మాట్లాడుతున్నట్లు విశ్వనాథం గ్రహించాడు. ఆవిడ ముఖంలోనూ కళ్ళల్లోనూ ఏక్షణమూ ఉల్లాసం అనేది లేకుండా పోయిందని గమనించాడు.

"ఆ రోజున అమ్మదగ్గర నేనన్నమాటలకి, ఈ రాణీగారు యింకా కోపం పెట్టుకునే వున్నట్టుంది! ఈ దీర్ఘద్వేషం అలాటివాళ్ళకి నైజమే!" అనుకునేవాడు. కాని ఆ మరుక్షణమే మరో ఆలోచనకూడా తనలో ఉద్భవించేది.

"మనం 'పాము పాము' అని తడపనిపట్టుకు వాదటం లేదుకదా?

వంశపారంపర్యంగా యిటువంటి దుర్గుణాలు అబ్బితీరుతాయనడానికి నిదర్శనలు ఏమున్నాయి? వంశం ఎట్టాటిదయినా మంచివాళ్లు మాత్రం ఎందుకు పుట్టకూడదు? ఇంతకీ నా భార్య స్వభావమూ, ప్రవర్తనా నిజంగా అటువంటివా? లేక నేను ఆ దృష్టితో చూస్తున్నానా?"

పరస్పర వైరుధ్యంగల ఈ ఆలోచనలమధ్య కొన్నాళ్లు కొట్టుకుని ఒక నిర్ణయానికి వచ్చాడు విశ్వనాథం.

"ఎట్టాటిదయినాసరే, మనం జాగ్రత్తగా వుండటమే మంచిది. ఆవిడ ప్రవర్తనలో అటువంటి లక్షణం ఏమాత్రం పొడగట్టినా, తక్షణం ఖండించి వెయ్యటమే క్షేమమయిన మార్గం. తన భర్త, తన తండ్రికిమల్లే డూ డూ బసవన్న కాడనీ, తన మేనత్త మొగుడికి మల్లే, పీటక్రింది పిల్లికాడనీ, ఆవిడ యిప్పటినుంచీ తెలుసుకునేలాగ చెయ్యటమే ఉత్తమం. ఇక్కడ వున్నది నూటికి నూరుపాళ్ళూ మీసం మెలేసే మొగాడు గాని...."

ఇట్లాగే చాలా రోజులు గడిచిపోయాయి. చిన్న పిల్లలతో కిలకిలలాడుతూన్న ఆ యింట్లో, కుముద కుమిలిపోతూ కాలం గడుపుతోంది. మాట కట్టేసుకోవటం అలవాటు చేసుకున్నప్పటినుంచీ, మనసులో వ్యధ ఎక్కువయింది. ఇప్పుడు తనమీదే తనకి కోపం వస్తోంది. "లోకంలో ఎవరయినా, మొదట ఒక తప్పుచేసి ఆ తర్వాత శిక్ష అనుభవిస్తారు. కాని నా యింటో ఎప్పుడో చెయ్యబోయే అపరాధానికి యిప్పుడే శిక్ష అనుభవించవలసి వస్తోంది!"

ఒక రోజున కొబ్బరి చిప్పలు ఎండబెట్టి కాపలా కూర్చుంది పెరటి వసారాలో. తనలో తనే ఆలోచించుకుంటోంది. అత్తగారు పొరుగింట్లో అప్పడాలు వత్తడానికి వెళ్ళింది. పిల్లలు ఎక్కడో యింటో ఆడుకుంటున్నారు. తను కూర్చున్నదగ్గిర ఆత్మారాం దిగబెట్టిన పలకా పుస్తకాలూ పడివున్నాయి. ఏమీతోచక ఆ పలక పుచ్చుకుంది ప్రక్కనే పడివున్న బలపం ముక్క అందుకుని ఏవో గీతలు గీయటం మొదలుపెట్టింది. ఆ తర్వాత ఏమయినా అక్షరాలు రాద్దామనుకుంది. అనుకునీ అనుకోవడంతోనే తనపేరు రాసింది. "కుముద..." కాని ఆచేయి అంతటితో వూరుకోలేదు. ఆ బలపం కదుల్తూ పోయింది. ఏం రాస్తున్నదో తెలియకుండానే యింకో మూడుమాటలు పలకమీది కెక్కాయి.

కొంపలు కూల్చేది. తంపులమారి, కుచ్చితపు మనిషి" తన హృదయం లోతుల్లో దూరి, తనని నఖశిఖ పర్యంతం తేళ్ళలా కుడుతున్న ఆ మాటలు అప్రయత్నంగానే పలకమీద ప్రత్యక్షమయాయి. ఆవిడ. అలా వాటికేసే చూస్తూ కూచుంది. తనంతట తనకే ఆశ్చర్యం వేసింది ఎవరు రాశారా అని. ఇంతట్లో ఆత్మారాం వచ్చాడు. ఆ రాసిన అక్షరాలు కూడబలుక్కుంటూ చదివాడు. అంతట్లో వామనరావూ, మనూకూడా వచ్చేశారు. ఆత్మారాం వాళ్ళకా పలక చూపించాడు. "చిన్నన్నా, చిన్నన్నా. చూడరా, వదిన ఏమిటో వ్రాసింది :"

"కొంపలుకూల్చేది. తంపులమారి. కుచ్చితపుమనిషి".

"అంటే ఏమిటి వదినా ?" అన్నాడు ఆత్మారాం.

ఎంచేతనో ఎవరు చెప్పగలరు, కాని, యిన్నాళ్ళూ అణచి పుంచబడిన ఆవిడ వాక్కు యిప్పుడు వరదవచ్చిన నదిలాగ ముందుకు దూకింది.

"మరిదీ, అవి అన్నీ నా పదవులోయ్" అంది.

"ఛా, పదవులు యిలా వుంటాయా ఏమిటి ?" బిఏ; ఎం ఏ; అన్నట్టు వుంటాయి. మూడో యింట్లో శంకరం పూనాలో చదువుతున్నాడు. అతనువచ్చే సంవత్సరం బికాం అవుతాట్ట" అని వామనరావు తన విజ్ఞానం అంతా వెళ్ళబుచ్చాడు.

"మరీ. మంచి మంచి మనుషులకి. మంచి మంచి పదవులుంటాయి. చెడ్డవాళ్ళకి చెడ్డపదవు లొస్తాయి యిలాటివి."

"ఛట్. చెరిపెయి ఇవన్నీ ? ఎవరన్నారు నువు మంచిదానివికాదని. అంటూ వామనరావు చటుక్కున ముందుకువచ్చి, వదిన చేతిలోవున్న పలక మీది అక్షరాలు గట్టిగా అణచి తుడిచేశాడు. తర్వాత ఆవిడ కళ్ళల్లోచూస్తూ.

"నువ్వు అంత మంచిదానివి కావన్నమాటకూడా నిజమేలే, పోయిన వారం పదిరోజులనుంచీ నువు మాతో ఒక్కసారయినా మాట్లాడలేదుగా ?"

"నిజమేనయ్యా నేను మంచిదాన్నికాదు. రోజు రోజుకి మరీ చెడ్డదాన్ని అయిపోతున్నాను. పూర్తిగా చెడ్డదాన్ని అయిపోతాను. అప్పుడు ఏంచేస్తానో తెలుసా ?"

"ఏంచేస్తా వేమిటి" అన్నాడు ఆత్మారాం.

"కొంప కూల్చేస్తాను."

"హూట్, ఉత్తది. కొంప కూల్చెయ్యటానికి నువ్వేమ ఖనా మర్రి చెట్టువా? మద్ది చెట్టువా?" అని తోసిపారేశాడు వామనరావు.

"అదికాదోయ్! కొంపలు కూల్చేది అంటే, యిల్లు బద్దలుకొట్టేది అన్నమాట. అంటే యీ యింట్లో మధ్యగా గోడపెట్టించేస్తానన్నమాట. అక్కడ దేవుడిగది దగ్గరనుంచి, ఆ ముందర వీధిసావిడివరకూ" అంది కుముద, ఎంతో గంభీరంగా ఏమీ నవ్వకుండా.

"అవునులే కాని ఎందుకూ?" అన్నాడు ఆత్మారాం.

"ఎందుకా, మిమ్మల్ని అందరినీ వేరు చెయ్యటానికి. మిమ్మల్నందర్నీ ఆ పక్క వుంచేసి నేను ఈపక్కని వుంటాను."

"ఒక్కత్తివీనా?"

"పిచ్చి వెధవా, ఏరా, ఆత్మా! ఒక్కత్తే ఎందుకుంటుంది? అన్నయ్య వుంటాడు ఆవిడకి తోడుగా" అన్నాడు వామనరావు.

"నేను ఈపక్కని వుండను బాబూ. వదినవున్న వేపే వచ్చేస్తాను" అని నిస్సంశయంగా చెప్పేశాడు ఆత్మారాం.

"కాని నేను మధ్యవున్న తలుపు గడియ వేస్తాగా" అంది కుముద అతి గంభీరంగా,

"అంతేనా? నేను గోడఎక్కి నీవేపు దూకేస్తా నంతే!" అప్పుడు నేను, "ఉహూఁ ఆత్మారాం! నాయింట్లోంచి వెళ్ళిపో అంటాను"

"నేను వెళ్ళక పోతేనో."

"అప్పుడు పొయిలో కొరకంచు తీసుకువస్తాను."

"అమ్మనాయనోయ్! వద్దుబాబోయ్! నే పరుగెత్తుకుపోతాను. నాకింకా జ్ఞాపకం వుంది ఒకసారి అమ్మ అంటించింది. కొరకంచు. చుర్రుర్రు మంది. ఇంత పెద్ద బొబ్బ వేసింది. పెద్ద పోకకాయంత బొబ్బవేసింది. ఇదిగో యీ చేతిమీదవుంది మచ్చ యింకా."

"అవునుగదా, నేను రెండో చేతిమీద అంటిస్తాను."

"అల్లాగే చూద్దాం. నేను గబుక్కున వెళ్ళి పెద్దచెంబుతో నీళ్ల

పట్టుకొస్తాను. నువ్వు కొరంకంచు ఎయ్యగానే, దానిమీద పోసేస్తాను. అది పుస్సస్సమని ఆరిపోతుంది. అప్పుడేం చేస్తావు?"

ఇప్పుడిక కుముద గంభీరంగా వుండలేకపోయింది. పక్కున నవ్వింది. పసివాడి ఊహలకీ, యుక్తికీ ఆవిడకి ముద్దేసుకొచ్చింది. ఏది ఏమయిపోయినా, వీళ్లు తనని వదిలిపెట్టడానికి యిష్టపడడంలేదు. అలాగే పకపకా నవ్వుతూ వుండిపోయింది. ఆవిడ సమాధానం ఏమీ చెప్పలేదుగదా అని.

"చెప్పుమరి. నీ కొరకంచు ఆర్పేస్తే ఏం చేస్తావు అప్పుడు" అన్నాడు ఆత్మారాం.

"అప్పుడా? భరిణిలోవున్న లడ్డూలుతీసి చేతిలో పెడతాను. ఆత్మారాం వెళ్లి చెట్టునీడను కూర్చుని తిని. చెయి కడుక్కుని పరుగెత్తు" అంటాను.

"అన్నీ వాడికే పెట్టేస్తావా, నాకోమరి" అంది మనూ ముందుకు వస్తూ.

"మా ముద్దుల మరదలిని ఎలా మరిచిపోతాను నేను. నీకూ పెడతాను లడ్డూలు" అంటూ తన మీదికివాలిన మనూని దగ్గిరికి లాక్కుని గట్టిగా కౌగిలించుకుంది. ఆ కౌగిలింతలో హాయిగా వున్న మనూ, కుముద ముఖంమీద వాలివున్న ముంగురలని వెనక్కి తోస్తూ "మళ్ళీ మా అందరితోనూ మాట్లాడుతావా మరి! యింకెప్పుడూ మాతో డిక్కా అనవుగా" అంది.

"అననమ్మా అనను! మీ అందరితోనూ మాట్లాడతాను. మాట్లాడక పోతే నాకు మాత్రం ఏం నెమ్మది వుంది?" అంటూ మనూని యింకోసారి గట్టిగా అదుముకుంది.

కుముద, యింతసేపూ వ్యంగ్యంగా మాట్లాడుతూ వచ్చింది. విశ్వనాథం తనమీద వేసిన మిథ్యారోపణని, ఆత్మనిందద్వారా ఉపశాంతి చేయడానికి ప్రయత్నిస్తోంది. విశ్వనాథం తన ఎదుట లేడు నిజమే, లేకపోతేమాత్రం ఏం? తను ఎలాగో అలాగ తన మనస్సులోవున్న వ్యధ బయట పారెయ్యాలి. కాని, ఆత్మరాముడూ, మనూ తన వ్యంగ్యాన్ని అర్థం చేసుకోలేదు. వాళ్ళు, ఆవిడ తనమీద ఆరోపించుకుంటూన్న

దుష్టత్వాన్ని దూరంగా తోలేశారు. తన భర్త, తనమీద కారణం లేకుండా అనుమానం పెట్టుకుని, తనకి నానారకపు పేర్లూ పెట్టి, తన మనస్సుమీద ఒక మూగదెబ్బ కొట్టాడు. ఇప్పుడీ అమాయకపు పిల్లలు, అది నమ్మక యింకోవేపునుంచి దాడి చేస్తున్నారు. కాని వీళ్ళ దాడి మధురమయినది. వీళ్ళు కొట్టిన దెబ్బలవల్ల రక్తం కారటంలేదు సానుభూతి చిమ్ముతోంది. అంచేత కుముదలో ఒక పరివర్తన వచ్చింది.

"పెద్దవాళ్ళూ తెలివయినవాళ్ళూ ఏమంటేనేం? ఈ పసివాళ్ళకి నామీద నమ్మకంవుంది. నేనంటే ద్వేషంలేదు. వీళ్ళ హృదయాల్లోవున్న పరమేశ్వరుడు నన్ను సరిగా అర్థంచేసుకున్నాడు" అనుకుంది. ఈ ఆలోచనరాగానే, కుముదకి కళ్ళల్లో నీళ్ళుకూడా వచ్చాయి.

"వదినా ఏడుస్తున్నావా?" అన్నాడు ఆత్మారాం ఎంతో కంగారుగా.

"ఆకలేస్తోందా?...." అంది మనూ బుంగమూతి దగ్గిరగాపెడుతూ.

భరించటానికి వీల్లేనంత ఆకలేసినప్పుడే ఏడుపు వస్తుందన్న సంగతి తెలుసు ఆ ఆరేళ్ళపిల్లకి. ఒకవిధంగా ఆ మాట నిజమే. కుముదకి భరించరానంత ఆకలి వేస్తున్నమాటా నిజమే.

ఒక్క అనునయపు పలకరింపుకోసం, ఒక్క సానుభూతితో కూడిన చిరునవ్వు కోసం, ఒక్క హృదయపూర్వకమయిన ప్రేమవీక్షణంకోసం, తను మొగం వాచిపోయిన మాట నిజమే! విశ్వనాథం ఆవిడని ఈ విషయాల్లో ఉపోషమే వుంచేశాడు. ఒకరోజు రెండురోజులూ కాదు; తను యీ యింటికి వచ్చినప్పటినుంచీని. ఈ ఉపోషంలో శోష్లిల్లిపోయే తనను, యీవాళ యీ పిల్లలు తమ ఆపేక్ష అనే అమృత బిందువులు చిలికి మూర్ఛ కాకుండా కాపాడారు, కాని ఉపోషం మాత్రం అంతం కాలేదు.

ఆత్మారాముడికి, వెంటనే పొరుగింటికి వెళ్ళి 'వదిన ఏడుస్తోంది' అని అమ్మతో చెప్పిరావాలనే వూహ కలిగింది. అంచేత బయలుదేరాడు. కాని నట్టింట్లోకి వచ్చేటప్పటికి అక్కడ గుమ్మంలో పెద్దన్న నుంచునివున్నాడు. తమ్ముణ్ణి చూడగానే, తను అసలు ఆ వూరివాడే కానట్లు చూపులోవున్న కొడవలి ఏసుకుని వెళ్ళిపోబోయాడు.

"అన్నయ్యా వదిన ఏడుస్తోంది. వచ్చిచూడు ఓసారి. ఎందుకేడు

స్తోందో కనుక్కో. మాతో ఏం చెప్పటంలేదు" అన్నాడు విశ్వానాధంతో. ఉత్తమాటలతో ఊరుకోనూ లేదు. అన్నగారి అడుగులి కడ్డంపడి, "వచ్చి ఓసారి చూడు" అని చెయిపట్టుకున్నాడు. విశ్వనాధం తమ్ముడి చెయి విదిలించేసుకుని, చరచరా పొలంవేపు వెళ్ళిపోయాడు.

ఒక గంటా, గంటన్నర యాక తిరిగి యింటికి చేరుకున్నాడు. అతని చేతులో అప్పుడెకోసిన పసుప్పచ్చటి మొగలిపువ్వు ఒకటి వుంది. ప్రతి రేకా సగంసగం తెరుచుకుని వుండబట్టి అది చూడ్డానికి ఎంతో అందంగానూ ఎంతో మూరానికికూడా పరిమళం చిమ్ముతూనూ వుంది.

కుముద, మినప్పప్పు కడిగి పొట్టుతీస్తోంది భావిదగ్గిర ఒక్కత్తీని. ఆమెడ కెదురుగా నిలబడి ఆ మొగలిపువ్వు అందించాడు విశ్వనాధం.

"తీసుకో...తీసుకోమంటూంటే,

కుముద చెయిచాపి తీసుకుంది. ఒకసారి విశ్వనాధంవేపూ, ఒకసారి ఆ పువ్వుకేసీ చూసింది.

"ఏమిటీ ? అలంకారం ?....ముళ్ళకంపలాంటి మనిషికి, ముళ్లున్న పువ్వు యివ్వాలని అభిప్రాయమా ?" అంది.

"అభిప్రాయం అదికాదు ; పైకి ముళ్ళు ముళ్ళుగా కనిపించినా హృదయంలో ఎంతటి సువాసనా, మార్దవతా వుందో గుర్తించమని, ప్రతి వస్తువూ పైకి కనిపించినట్టే వుండదన్న సంగతి. ఈ రేకులు విడమర్చి చూసి, శోధించి తెలుసుకోమని."

"మిరెప్పుడు శోధించి కనిపెట్టారు"

"ఇవ్వాళే, కాస్సేపటి క్రితమే : దేనికోసమో వెతుకుతూంటే ఏదో లభిస్తుందంటారే. నిజమే ఆమాట !"



# దూరమైన ప్రాణి

మాలవికకు మట్టుకు ఆ రోజు ఏమీ సవ్యంగా ప్రారంభం కాలేదు. ఆ ఉదయం ఏమీ ఉత్సాహకరంగా లేదు. కడచిన రాత్రి ఏ నాటకానికో, సినీమాకో వెళ్ళి కూర్చున్నందువల్ల నిద్ర పోవడమూ కాదు. రాత్రంతా తన మంచంమీద పడుకునే వుంది. ఆ రాత్రి పదకొండూ, పన్నెండూ, ఒంటిగంటా, మూడుగంటలూ కొట్టడం తను విన్నది. నిద్రపోవాలని ఎంతో ప్రయత్నించింది. కాని రెప్పలు మూతపడనే లేదు. "ఏం నిద్ర పట్టడం లేదా ?" అని అడగడానికి పక్కను ఎవరూ లేరుకూడాను. భర్త శ్రీనివాసరావుగారు. ఫ్యాక్టరీ చూసుకోవడానికి పొరుగూరు వెళ్ళారు. అంచేత తన సరసనున్న తలగడా ఖాళీగానే వుండిపోయింది. ఆవిడ. తన అంత పెద్ద బంగళాలోనూ ఒంటరిదయి పోయింది.

కాని మాలవిక బంగళాలోపలే వుందని గట్టిగా ఎట్లా చెప్పగలం ? ఆవిడ బంగళాలోనే వున్నప్పటికీ, బంగళాకి దూరంగా వుంది. మెత్తటి పరుపుమీద పడుకుని కూడా పడకకి దూరమయింది. ఆవిడ ఆలోచనల అరణ్యంలో తిరుగుతున్నది. శోభ అనే సుడిగుండంలో చిక్కుకుపోయింది. ఒంటరిది, అసహాయ ; మనసులో రేగిన సుడిగాలి ఆవిడని ఒక ఎండు టాకులాగా ఎక్కడెక్కడికో ఎగరగొట్టేసింది. ఆవిడ మనసు ఆ పెద్ద బంగళా

లోకీ, ఆ మెత్తటి ప్రక్కమీదికీ, ఆ స్వచ్ఛమైన చాందినీ క్రిందికీ, ఛాయలోకీ సమ్మెసరా రానంది. ఒక్కతన్ను తన్ని, ఒక్క త్రోపు తోసి, ఆ మనసు ఎక్కడో అంతరిక్షంలో సంచరిస్తోంది.

అసలు దీ నంతకీ కారణం ఎంత చిన్నదని ! తన నాలుగేళ్ళ మహేశ్, ఎంతో ప్రమాదంలోంచి బయటపడి తను ప్రసవించిన ఆ కూన, వాడు పట్టినపట్టు విడవనేలేదు గదా !

రాత్రి పడుకోబెట్టడానికి పంపించే ముందు పాలు గ్లాసులో పోసి తీసుకొచ్చింది తను. తాగిద్దామని వాణ్ణి తన దగ్గరకి లాక్కుంది; తను నోటిదగ్గర పెట్టిన సగిషీ గ్లాసుని వాడు తాకనే తాకలేదుగదా ! స్వెటరుమీద చెయివేసి వెన్ను నిమిరింది బుగ్గలూ గడ్డమూ పుణికి బతిమాలింది. "ప్రొద్దున్నే నాన్నగారు వస్తారు, నిన్ను "వం వం" లో కూర్చోబెట్టి షికారు తీసుకెళ్తారు" అని ఆశలుపెట్టింది. కాని, ఊహుఁ. వాడిది ఒక్కటే పల్లవి !

"నువ్వొద్దు, శేవంతిని తాగించమనూ...." అని. వాడి మొండితనం చూసి మాలతికకు కోపంవచ్చింది. ఆవిడ కంఠస్వరమూ హెచ్చింది. కేవలము హెచ్చుటమేకాదు, కఠోరంకూడా అయింది.

"నేను ఎంచక్కా తాగిస్తుంటేనూ, శేవంతే తాగించాలట, తాగు కిక్కురుమనకుండా, ఊఁ...."

"నువ్వొద్దు, శేవంతే, ఊఁ.... ఊఁ .." అంటూ మహేశ్ మొహం పాలగ్లాసుకి పెడగా తిప్పేసుకున్నాడు.

"శేవంతి లేదమ్మా మా చిన్నితండ్రికి బిస్కట్లు తేవడానికి బజారు కెళ్ళింది కాదుమరీ, నువు తొందరగా పాలుతాగేశెయ్యి; మనం వీధిగుమ్మం లోకివెళ్ళి పిలుచుకొద్దాం, ఏం ? ఇంద మా రాజావి కదూ నువ్వు !" మాలతిక అతి ప్రయత్నంమీద తన గొంతు సౌమ్యంచేసుకు బ్రతిమాలింది. అయినా వాడిది ఒక్కటే జవాబు.

"ఊఁ.... ఊఁ.... ఊఁ.... శేవంతీ...."

ఉత్తరక్షణంలో వాడి స్వెటరు వీపుమీద ఒక్క చరుపు పడింది. పిల్లవాడు గొంతెత్తి కప్పు ఎగరగొట్టేశాడు; కూచున్నచోటే కాళ్ళు తపతపా

కొట్టడం మొదలెట్టాడు. ఆవిడ "ఊరుకో" అంది. మళ్ళీ చెయ్యి ఎత్తింది; కళ్ళు పెద్దవి చేసింది. కాని వాడు స్వరం ఏమీ తగ్గించలేదు. పెద్దగా ఎక్కెక్కి ఏడవడం లంకించుకున్నాడు.

శేవంతీ, ఎక్కడో బంగళా వెనుకవున్న "అవుట్ హౌస్"లో, చపాతీలు చేస్తోంది. ఆ ఏడుపు చెవిని పడింది. చెవి ఒగ్గి వింటోంది. ఏదో మామూలు ఏడుపేలే అనుకుని పిండి మర్దిస్తోంది. కాని, రెండు మూడు క్షణాల్లో, ఆ ఏడుపు మామూలు ఏడుపుకాదని అర్థమయింది. చటుక్కున చేతులు ఒకసారి నీళ్ళల్లోముంచి, బంగళాలోకి పరుగెత్తింది శేవంతీ. బంగళాలో, భోజనాలగదిలో బల్లమీద కూర్చొని రాగాలుతీస్తున్న మహేశ్‌ని, తను యింట్లోకి రాకముందే పిలవడం ఆరంభించింది. వచ్చి వాడిప్రక్కన నుంచుంది. యజమానురాలి వైఖరి వైపు చూసైనా చూడకుండా, "చిన దొరుగారూ! ఎందుకయ్యా ఏడుపు?" అని అక్కరాలనగా అడిగింది.

వాడు తక్షణం శేవంతీ వేపు చేతులు సాచాడు. ఆవిడ వాణ్ణి చంకనేసుకుంది, కళ్ళు తుడిచింది, "యేడవకండి" అంటూ వాడి పుట్టువెంట్రుకలు తీర్చిదిద్దింది. వాడు ఆవిడ బుజంమీద తలకాయ ఆనించాడు; ఎక్కిళ్ళు మింగేసి ఒక్క నిమిషంలో ఏడుపు మానేశాడు.

ఆ తర్వాత ఆ గ్లాసులో పాలే, శావంతి తాగించింది. వాడూ గప్‌చిప్‌గా తాగి గ్లాసు ఖాళీ అవగానే, తడి తువ్వాలుతో వాడి మూతీ, బుగ్గలూ తుడిచింది; అతన్ని చిన్న మంచంమీద పడుకోపెట్టింది. వాడూ, దాని కాళ్ళమీద తలపెట్టుకుని పడుకున్నాడు. శేవంతీకి ఏవో నాలుగు, కొంకణదేశపు జోలపాటలు కొస్త కొస్త వచ్చు. అవే పాడుతూ వాణ్ణి జోకొట్టింది. అయిదునిముషాల్లో నిద్దరపోయాడు. శేవంతి నెమ్మదిగా వాడి తలకాయ తన కాళ్ళమీంచి తీసి, మెత్తటి తలగడా మీదపెట్టింది. తరవాత తనూ ఆ మంచంమీంచి లేచి, దోమతెర దింపి తను కప్పుకుంది. సర్వమూ సవ్యంగా జరిగిపోయింది.

కాని ఆ సంఘటనే మాలవికకి ముల్లు గుచ్చుకున్నట్టుంది. ఇట్లా జరగడం యిదే మొదటిసారి అయితే ఆవిడ అంత కష్టం పెట్టుకునేది కాదు; పైగా మహేశ్‌ని గారాబంకూడా చేసివుండేది. "మొత్తంమీద మీ యిద్దరి గోత్రాలు ఒక్కటి కాబోలు" అని శేవంతీని కూడా పొగుడుతూనే మాట్లాడివుండేది;

కాని, యిలా జరగటం యిది మూడోసారి. నాలుగు రోజుల క్రితం తను ఎంతో ముచ్చటపడి మహేశ్‌కి చొక్కా లాగు తొడగాలని తయారయింది. "నువ్వొద్దు. శేవంతీని తొడగనీ" అంటూ పరుగెత్తి వెళిపోయాడు. అంతకుముందు రెండోసారి, తను పండు కోసి పెడదామని దగ్గరకు వెళితే, వాడు సాంతం కత్తి తీసుకుని శేవంతి దగ్గరకి వెళ్ళి "నువ్వు కోసి పెట్టు" అంటూ బాసినపట్టేసుకు కూచున్నాడు.

ఇహ, ఇవాళటి సంగతి సరేసరి! ఇవాళ మహేశ్. తల్లిని మరీ అవమానపరిచాడు. తనను నిర్లక్ష్యంచేసి. తండ్రి దగ్గరకో, తాత దగ్గరకో, అవ్వ దగ్గరకో. మామయ్య దగ్గరకో. చేతులు చాచినా బాధ వుండేది కాదు. పసివాడు, దాసీదాని బుగ్గని బుగ్గచేర్చి గారాబం కుడవటం మరిగాడు. చూడగా చూడగా, వాడికి కన్నతల్లి పరాయిదీ, దాసీది సొంతమనిషీ అయిపోయి నట్టుంది. ఈ పరిస్థితి మాలవికకు దుర్భర మనిపించింది. అన్నం నీళ్ళూ ముట్టకుండా అలాగే మంచంమీద పడుకుని వుండిపోయింది. ఆలోచనలు ఆవిడ తలని తొలిచేస్తున్నాయి. ఆ బాధ సహించడానికి శక్యంగాకుండా వుంది ఆవిడకి. ప్రక్కనున్న బీరువా తెరచి, నిద్ర పట్టడానికి ఒక మాత్ర వేసుకుంది. కాని అదీ నిరుపయోగమే అయింది. మహేశ్‌ని ప్రసవించినప్పుడు కూడా తను యింత బాధ పడలేదనుకుంది. రాత్రి మూడోఝాముకి మనసు అలసిపోయి శరీరం కునుకు తీసింది.

తెల్లగా తెల్లారిన తర్వాత కిటికీలోంచి ప్రవేశించిన పిల్లగాలి మాలవికకు మెళకువ తెప్పించింది. నెమ్మదిగా రెప్పలు ఎత్తి కళ్ళుతెరచి, మేలుకుంది. కాని ఆ మేలుకోవడంలో సౌఖ్యం కనిపించలేదు. ఉల్లాసం లేదు. రాత్రి అనుభవించిన ఆందోళన యింకా వదలలేదు. ఆ నీరసం ఆవిడ పాలిపోయిన శరీరాన్ని అంటిపెట్టుకునే వుంది. ఇంకా కొంచెంసేపటి వరకూ ప్రక్కమీంచి లేవకుండా పడుకునే వుండిపోదామనిపించింది ఆవిడకి. ఆయన ఇంట్లో వుండివుంటే, ప్రొద్దున్నే ఆయనకు కప్పులో టీ పొయ్యటానికి విధిగా లేవవలసి వచ్చేది. ఆయనతోపాటు తనూ టీ పుచ్చుకోవలసి వచ్చేది. కాని, ఇవ్వాళ ఆ ఇబ్బందిలేదు. రెండు కర్రమంచాలు దగ్గరగాచేర్చి ఏర్పరచిన ఆ విశాలమయిన ప్రక్కమీద ఆవిడ ఇంకా ఒక గంటసేపు పడుకున్నా, ఆవిడని ఎవరూ పిలవరు.

అయినప్పటికీ, పక్కమీంచి లేచింది; లేస్తూ లేస్తూండగానే ఎదుట బిళ్లోరీఅద్దంలో తన ప్రతిబింబం కనిపించింది. కోసయిన గడ్డము తన ముఖానికి ఎంతో అందం తెచ్చిందని తను ఒకప్పుడు చాలా గర్వపడేది. తన స్నేహితురాండ్రందరికంటే కూడా తన శరీరచ్ఛాయ మెరుగైనదనీ, అసాధారణ మయినదనీ ఆవిడకి రోజూ అనిపిస్తూనే వుంటుంది. ఇంత మంచి బంగాళాకి తన అంత అందమయిన యజమానురాలు ఉండడమూ ఉచితమని ఆవిడకి అనేకసార్లు స్ఫురించింది. గడ్డం క్రింద చూపుడువ్రేలు పెట్టుకుని తీయించుకున్న తన ఫొటో ఒకటి పడకగది గోడని అలంకరిస్తోంది తన కెంతో యిష్టమయిన వస్తువుల్లో ఆ ఫొటో ఒకటి.

కాని ఈ మధ్య ఈ మధ్య తనకో మానసిక బాధ ఏర్పడింది. మహేశ్‌ని కడుపుతోవున్నప్పుడూ, కన్నప్పుడూకూడా తాను చాలా కష్టపడింది. ఆరోజుల్లో హంసలా తెల్లగా వుండే శరీరం సున్నంలా పాలిపోయింది. ఇన్నాళ్ళు గడిచినా కూడా వందలకొద్ది రూపాయలు డాక్టర్ల జేబులో చేరుకున్నాయే గాని తన ముందటి రంగు మళ్ళీ శరీరానికి చేరలేదు. అంతకంటే ముఖ్యమయినదేమిటంటే, యింకా ఈ నడియౌవ్వనంలోనే తననొక్కలు నొక్కుల తలకట్టులో అక్కడక్కడ తెల్లతీగలు కనిపించటం మొదలుపెట్టాయి. శరీరంలో కలిగిన యీ మార్పుల కారణంగా తను ఎప్పుడు యిల్లుకదిలి బయటికి బయలుదేరవలసివచ్చినా ముస్తాబవటానికి చాలా సేపు పడుతోంది; తనకోసం ఆయనగారు మోటారు హారను 10, 12 సార్లు మోగించవలసి వస్తోంది. అద్దంలో కనిపిస్తూన్న తన ప్రతిబింబము చూచుకుని అల్లాగే నివ్వెరపడిపోయింది. రాత్రంతా నిద్రలేకపోవటంచేత తన పాండువర్ణం మరీ పేలవమైపోయినట్లు తోచింది. ఇంకో నాలుగైదు తెల్లవెంట్రుకలుకూడా ప్రత్యక్షమవుతాయేమో అని అనుమానం పట్టుకుంది; తన రెండు అరచేతులతోనూ ఒకసారి జుట్టు నిమురుకుంది. అద్దంలో చూసుకుంది. పమిట సర్దుకుంది. మంచం క్రిందవున్న రబ్బరుచెప్పులు తొడుక్కుంది. వేణ్ణీళ్ళలో ముఖం కడుక్కోవడానికి స్నానాల గదివేపు బయలుదేరింది.

కాని, త్రోవలోనే. తన తలాపుదిక్కునే, మహేశ్ పడుకునే చిన్న మంచం వుంది. దానిమీదవున్న తెల్లటి సన్నగళ్ళ దోమతెర గాలికి కొంచెం కదులుతోంది. దాని లోపల తన వంశోద్ధారకుడు, మహేశ్ యింకా నిద్ర

పోతున్నాడు. మాలవిక దోమతెర నెమ్మదిగా తప్పించి కుఱ్ఱాణ్ణి చూసింది. మహేశ్ యింకా గాఢంగానే నిద్రపోతున్నాడు. వాడి ముఖంమీద గులాబీ కాంతులున్నాయి. తెరచీ తెరవని ముత్యపు చిప్పలోంచి తొంగిచూస్తున్న ముత్యంలాగ, ఇంకా ఏ నరుడిచెయ్యి సోకని నిర్మాలిన్యమయిన ముత్యంలాగ మహేశ్ ముఖం ఆ కొద్దిగా తప్పించిన దోమతెర ఖాళీలోంచి కనిపిస్తోంది. తనకి మల్లేనే తెల్లటి వళ్ళు, తనకి మల్లేనే కోలముఖం. పూర్తిగా మాతృముఖుడయిన పుత్రుడు, నిద్రపోతున్న పిల్లాడికేసి తదేక దృష్టితో చూస్తూ వుండిపోయింది మాలవిక. 'ఈ పిల్లాడు నిజంగా మన పిల్లాడేనా' అనిపించింది. "సంసారం చేసుకునే స్వర్గవాసిని ఎవరో, రాత్రి భూమికి దిగివచ్చి, పెల్లవారుఝామున తిరిగిపోయే తొందరలో, తన కూనని మరిచిపోతే, ఆ పసివాడు శేవంతికి దొరికితే, శేవంతే తీసుకువచ్చి ఈ మంచంమీద పడుకోపెట్టిందేమో" అనిపించింది. వాణ్ణి ఒక ముద్దు పెట్టుకోవాలని అనివార్యమయిన వాంఛ కలిగింది. అందుకోసమని దగ్గరగా వంగింది కూడాను. కాని మరుక్షణంలో వారించుకుని నిలబడింది. 'చిన్నితండ్రి నిద్రపాడై పోతుంద'ని పించింది. పైగా ఇదివరకోసారి శేవంతి అన్నమాట కూడా జ్ఞాపకం వచ్చింది. "చిన్న పిల్లలు నిద్రపోతున్నప్పుడు ఎన్నడూ ముద్దు పెట్టుకోకూడదు."

పిల్లల్ని పెంచడంలోవున్న సూక్ష్మాలూ, నేర్పులూ, పద్ధతులూ, ఆచారాలూ, అనేకమయినవి, శేవంతియే తనకి అప్పుడప్పుడు చెబుతూ వచ్చేది. శేవంతి అజ్ఞానురాలే, దానికి వున్నవి మూఢనమ్మకాలే. కాని, పసిపిల్లలంటే దానికి అపరిమితమయిన ఆపేక్షకూడా వుంది; గారాబమూ చేసేది, గద్దించనూ గద్దించేది. ఆవిడ హృదయంలో మాతృత్వం, సహజంగావున్న సుగుణం. ఆ మాతృహృదయం ఏర్పరచిన నిబంధనలను పాలించటమే ఆవిడకి పరమానందము.

కాని మాలవికకు యిలాంటి గొడవలన్నీ తెలియనే తెలియవు. మాటలతో చెప్పడానికి అతీతమయిన, ఎంతో ఆహ్లాదదాయకమయిన స్ఫురణ ఏదో మాతృత్వాన్ని ఆవరించి వుంటుంది. స్త్రీకి గర్భచిహ్నాలు కనిపించి నప్పుడే, ఈ భావనకూడా అంకురమవుతుంది. "నీవొక అమ్మవు కాబోతున్నావు, యింకొన్నాళ్ళకి రెండు చిన్న పెదవులు ఆ పేరుతో పిలుస్తాయి

నిన్ను. అది నీకు వినిపిస్తుంది....అమ్మా! అవును నేను అమ్మని. అదితి. కౌసల్యా యశోద మొదలయిన అద్వితీయ మాతృదేవతల పరంపరలో నేనూ ఒక చిన్న కణాన్ని నీ గర్భంలోనూ, వాళ్లు కనినటువంటి దైవాంశే వృద్ధి అవుతోంది. నీవుకూడా అటువంటి దైవతుల్యుడయిన శిశువునే ప్రసవించబోతున్నావు. ఆ భాగ్యంకోసం ఆ ప్రసవవేదన సహించబోతున్నావు".

కాని, ఇటువంటి అంతర్వ్యథ ఏదీ తన హృదయాన్ని సోకకుండానే మాలవిక ప్రసూతిగృహం ప్రవేశించింది. తను తల్లి అవడం కేవలం ప్రకృతి ఏర్పర్చిన పరిణామము. తను చదివిన ఇంగ్లీషు మరాఠీ పుస్తకాలు ఇంకేరకమయిన ఊహలనీ ఉద్భవింపచెయ్య లేదు. దుప్పటి ఎలాంటిది వుండాలో, ఛడ్డీ ఏలాటిది కుట్టాలో, స్వెట్టరు అల్లితే గుండీలు ముందు వేపు పెట్టాలా, వెనకవేపా? ఏ ఋతువులో ఎటువంటి దుస్తులు తొడగాలి; ఆ దుస్తులు ఎటువంటి బట్టలతో తయారుచేయించాలి: పసిపిల్లలకి పాలపీకి నోటిలో వుంచుకోవడం అలవాటు చెయ్యడం మంచిదా, చెడ్డదా; ఏ వయసులో ఎన్ని గంటల కొకసారి పాలు పొయ్యాలి. ఇలాటి వివరాలు సవిస్తరంగా బోధించే పుస్తకాలు ఆవిడ ఒకటికి రెండుసార్లు చదివింది. గర్భవతిగా వున్నప్పుడే, ఆ పుస్తకాల్లో ఎక్కడో ఒక హెచ్చరిక మాత్రం ఆవిడకి బాగా జ్ఞాపకం. "మీ యింటికి ఒక క్రొత్త మనిషి వస్తున్నాడు. అతని సదుపాయంకోసం ఫలాని ఫలాని ఏర్పాట్లూ తయారీలూ చేసివుంచుకో" అతను నీతో కలకాలం వుండిపోయే అతిథి!"

కాని వచ్చేది అతిథి కాదు; ఒక క్రొత్త మనిషి కాదు - నీలో ఒక భాగమే వృద్ధిపొంది, ప్రతిబింబంలా నీ యెదుట నిలబడుతుందనీ, ఆ రాబోయే ప్రాణి నీ రక్తమాంసాలతో నిర్మాణం చెందినదనీ, నీ నీడలోనే పెరుగుతుందనీ, నీ విచ్చే సంస్కృతితోటే అభివృద్ధి చెందుతుందనీ, నువ్వేలా పెంచితే అలా పెరుగుతుందనీ, ఎలా వంచితే అలా వంగుతుందనీ, ఈ విషయాలు మాత్రం ఆవిడ కెవరూ బోధించలేదు. అంచేత పుట్టినప్పటినుంచీ, మహేశ్‌ని ఒక కొత్త వ్యక్తిగానూ, అతిథిగానూ నే అనుకుంటూ వచ్చింది అయితే తనకు చాల యిష్టమయిన అతిధి మాత్రం అవును! తనకు ప్రాణప్రియమయిన అతిథి. కాని మొత్తంమీద అతిథే!!

అంచేతనే, శేవంతీ మహేశ్‌ని గారాబం చేస్తున్నప్పుడల్లా, "ఏవోలే అజ్ఞానురాలు" అనుకునేది తను. పిల్లవాడి నెత్తిన చమురు పెట్టాలి; నిజమే. కాని మునుముందుగా. గిన్నెలోంచి రెండు చుక్కలు భూమిమీద వెయ్యడం ఎందుకు? శేమంతిని తను ఒకసారి ఎగతాళికూడా చేసింది ఆ విషయంలో. కాని. ఆ పిచ్చిపిల్ల అదంత లక్ష్యపెట్టలేదు సరి గదా, పైగా ఏమందో తెలుసా? "చూడండమ్మగారూ! — మన చుట్టుప్రక్కల యెల్లప్పుడూ భూతాలూ, గాలులూ వుంటాయమ్మా; మన కళ్ళ క్కనిపించవు గానీ, అక్కడే వుంటాయి. వాటి దృష్టి ఎప్పుడూ పసిపిల్లలమీదే వుంటుంది. అందులోనూ, ముఖ్యంగా వాళ్ళకి పోసే పాల మీదా, నెత్తిన అంటే చమురు మీదాకూడాను. అందుకనే, తలంటేటప్పుడు రెండు చుక్కలు వాటికి, ముందుగానే యిచ్చాం అంటే అవి సంతోష పడతాయి. యిహ, అప్పుడు పిల్లల జోలికి రావు"

దృష్టి దోషం విషయమైనా యింతే, తలిదండ్రులతో మోటారులో కూచుని సాయంకాలపు షికారుకు వెళ్ళిన మహేశ్ గుమ్మంముందు దిగీ దిగగానే, ఉప్పు ఆవాలూ * చేత్తో పట్టుకుని శేవంతి ఎదురుగాహాజరయేది.

కుడి పిడికిటిలో ఉప్పూ, ఎడమ పిడికిటిలో ఆవాలూ, పిల్లవాడి ముఖం ముందు తిప్పి దిగతుడిచేది. వెంటనే పట్టుకెళ్ళి నిప్పుల్లో పోసేది. అవి పటపటమని పేలగానే, మాలవిక దగ్గరకువచ్చి ఏకరువుపెట్టేది. "మీ కిదంతా నవ్వుగా వుంటుంది. కాని చూడండి, ఎట్టాటి వాసన వస్తోందో! చినబాబు మీద ఏవో పాపిష్టి కళ్లు పడ్డాయి. లేకపోతే గాలే సోకిందో! మండి బస్మమయిపోయిందిరెండి!"

"మండినట్టుగానే వుంది నీ భూతాం వెఱ్ఱి, నీకు ఎక్కడచూసినా గాలీ, భూతం, దెయ్యం, దేవరా తప్ప యింకేమీ కనిపించవు" అని మాల విక వెటకారం చేసేది. "మీచేత నమ్మించటం ఎల్లాగ?" అని నోటితో

* మన ప్రాంతాల్లో, ఉప్పు మిరపకాయలూ దిగతుడుపు తిప్పడం ఆచారం. కాని వివిధ ప్రాంతాలల్లో వున్న ఆచారవ్యవహారాలు అర్థం చేసుకోవడం కూడా ఉచితమే గనుక. మహారాష్ట్ర ఆచారం యధాతధంగానే వుంచుతున్నాను.

అనువాదకుడు.

అన్నంత స్పష్టంగా అర్థమయే ముఖభావంతో శేవంతీ అక్కడినుంచి చక్కా పోయేది.

శేవంతీ అజ్ఞానురాలే కావచ్చు. ఆవిడ చేసే పనులూ, పాటించే ఆచారాలూ, మూఢ విశ్వాసాలే కావచ్చు. ఆ చేతలకి హేతుభూతమయినది మాత్రం, అజ్ఞానమూ కాదు; మూఢ విశ్వాసమూ కాదు; అపరిమితమయిన వాత్సల్యమే ఆవిడ ప్రవర్తనకి మూలకారణం. ఆవిడ శ్రద్ధగా దృష్టి తీయడంలో అంతర్గతమయిన ముఖ్య భావాలు రెండు వున్నాయి.

మొదటిది: తన చినబాబుగారు, బంగారపు తునకలాంటి వాడు అనీ ప్రపంచకంలో ప్రతి మనిషీ ఆ పసివాడికేసి చూసి మురిసిపోయి, ముచ్చట పడతాడనీ, భూతాలకీ దయ్యాలకీ కూడా ఆ పిల్లవాడు లిమకు కావాలని పిస్తుందనీ ఆవిడ నమ్మకము.

ఇహ రెండోది: ఆవిడ నిశ్చయము ఎవరు ఎన్ని అనుకున్నా సరే; నేను పిల్లాడిమీద ఈగయినా వాలనివ్వను. నా హృదయాన్నే ఒక కోటగా చేసి అందులోపెట్టి అతన్ని భద్రంగా కాపాడుతాను. అతనికోసం నిద్రాహారాలు కూడా మానేస్తాను. అతనివేపు ఏ ఆపదవస్తున్నా, అది నా నెత్తిన వేసుకుంటాను. అతనికోసం నిప్పులతో స్నానం చేస్తాను, గాలాలు మింగుతాను. ప్రాణాలు ధారపోస్తాను....

వాస్తవికంగా, యిటువంటి భావాలు, మహేశ్‌ని గురించి ఎవరి కుండాలన్నా అంటే, మాలవిక కుండాలి! కాని ఆవిడకి యిట్లాటి భావాలు ఎప్పుడూ పుట్టలేదు. అంటే. మాలవికకి పిల్లాడంటే, అనురాగము లేదనీ కాదు; ఆవిడ ముద్దూ ముచ్చటా చెయ్యలేదనీ కాదు. బిస్కట్లతోటీ, టాఫీల తోటీ, పిప్పరమెంట్లతోటీ నిండిన రంగురంగుల డబ్బాలూ, సీసాలు సీసాలుగా టానిక్కులూ, మందులూ. అనేక రకాలఫేసుపౌడర్లూ, యిలాటి వాటితో మహేశ్‌కోసం ప్రత్యేకం కేటాయించిన బీరువా అంతా నింపేసింది మాలవిక. మహేశ్ కోసమని కుట్టిన రంగుల స్వెటర్లతోనూ, చడ్డీలతోనూ. సిల్కుచొక్కాలతోనూ, ఊలు దుస్తులతోనూ ఒక పెట్టెపెట్టి తయారయింది పోయింది. ఆటవస్తువు లయితేనా, ఇల్లంతా అవే! ఇవన్నీ చూసుకుని "నాకు పిల్లాడంటే ఎంత ఆపేక్ష!" అనుకునేది.

కాని, పిల్లాడు రోజు రోజుకూ తనకు మరీ దూరమయిపోతున్నట్లు మాత్రం ఆవిడకి తెలియనే లేదు. నిన్న రాత్రి అకస్మాత్తుగా వాతపడినట్లు తెలిసింది, ఈ శోకడ. తను కన్నకొడుకు తను పాలుతాగిస్తే తాగలేదు! తను ఎంత గద్దించినా ఏడుపు ఆపలేదు. శేవంతికి మాత్రం క్షణంలో అలిసి అయూడు. అదయినా, అది చెయ్యి ఎత్తలేదు; కళ్లు పెద్దవి చెయ్యలేదు; సర్వసాధారణంగా, అతిసులభంగా వాణ్ణి సముదాయించేసింది! మాలవికకి పరాభవం జరిగింది. కన్నకొడుకే పరాభవం చేశాడు! అదయినా ఎల్లా? నౌకరీ చేసుకునే దాసీదాని బుజంమీద తలపెట్టుకు పడుకుని, కన్న తల్లిని పరాభవం చేశాడు. మాలవిక, కడచిన రాత్రంతా ఆ పరాభవాగ్నిలోనే తపించిపోయింది అనేకరకాల ఆలోచనల సుడిగుండాల్లో సొమ్మసిలి పోయింది. మంచంమీద చెప్లతూవచ్చిన పిల్లగాలి సోకినాకూడా, ఆవిడకి ఆ తాపం తగ్గలేదు. ప్రశాంతమయిన ఆ ప్రాతఃకాలంలోకూడా, ఆవిడ మానసిక ఆందోళన అణగలేదు.

శేవంతీ అవుట్‌హౌస్‌లోంచి బంగళాలోకివచ్చి పనులు చూసు కుంటోంది. మహేశ్ లేవకముందే, తను చేయవలసిన పనులన్నీ త్వర త్వరగా ముగించుకుంటోంది. మాలవిక ముఖంకడుక్కుని స్నానాలగది లోంచి బయటకురాగానే "ఫలహారం ఏం చేయించమన్నారు ఆమ్లెట్ వేయించనా, ఉత్త టోస్టుమట్టుకేనా?" అని అడిగింది శేవంతి. "ఉత్త టీ మట్టుకు".... అని శేవంతివంక చూడకుండానే. పుల్లవిరుపుగా జవాబు చెప్పింది మాలవిక. శేవంతీ యింట్లో మసులుతున్న అలికిడే అసహ్యమని పించింది మాలవిక కివ్వాళ! దాన్ని చూస్తేనే వళ్లు మండిపోతోంది. నల్లగా వున్నా, నిర్మలంగావున్న శేవంతీ ముఖం, యివాళ మాళవిక దృష్టికి కాలకూటంకంటె కంటగింపుగా కనిపించింది. మాలవికకి ఈ రోజు వరకూ. శేవంత అంటే మంచి అభిప్రాయమే వుంటూవుండేది. తన పిల్లాణ్ణి పుట్టినప్పటినుంచీ, శేవంతీయే సంరక్షిస్తూవస్తుంది, సాకుతూవచ్చింది. చంకనివేసుకుని ఆడిస్తూవచ్చింది. బుజంమీద పడుకోబెట్టుకుని, జోకొడుతూ వచ్చింది. ఆడిస్తూ పెంచుకొచ్చింది వాణ్ణి.

ప్రసవం అయిన తరువాత, నాలుగునెలల వరకూ మంచం మీంచి లేవనేలేక పోయింది మాలవిక. ప్రక్కనంటుకునే వుండిపోయింది బాలింత

రాలు. ఏ రెండు మూడు సార్లు, ఆ చిన్ని పెదవులు ఆవిడ పమిటక్రింద పాలు పుణికాయో, అంతే! డాక్టరు "కూడద"న్నాడు. ఆవిడకి మాత్రం అంత తీవ్రమయిన యిచ్ఛ ఎక్కడిదీ? తరుణవయస్కురాలుగా వుండటం ఎలాగనీ. శరీరం బింకంగా వుంచుకోవడం ఎలాగనీ, మనసులో మథన పడుతూనే వుండేది మాలవిక.

అంచేత వేళ తప్పకుండా, శేవంతి పడుతూవచ్చిన పోతపాలతోనే పెరుగుతూ వచ్చాడు మహేశ్. పడుకున్న పిల్లవాడు నిద్రలేచినప్పుడు శేవంతీ మేలుకునేవుంటే, వెంటనేవచ్చి వాణ్ణి ఎత్తుకుని ప్రక్కనేవున్న మంచంమీదికి తెచ్చేది. మాలవిక. ఆ చిన్నినోరు పాలు చీకుతూండడమూ, చేతులూ, కాళ్ళూ ఆడిస్తూ వుండడమూ, ఊరికేనే "ఫస్‌స్" అని ఊది బుగ్గలమీద సొట్టలు పడేసుకోవడమూ, ఏవో ఆనందంతో కేకలు వెయ్యడమూ, గంటలతరబడి చూస్తూ వుండిపోయేది మాలవిక. కొంచెంసేపు తన దగ్గరకి తీసుకునేది కూడాను! వాణ్ణి ముద్దుపెట్టుకునేది. ఏదయినా ఆటవస్తువు ఆ చిన్ని పిడికిళ్ళకి అందించేది. తన రెండు చేతుల్లోనూ వాణ్ణి ఎత్తి పట్టుకునేది. వాడి ముక్కు తన బుగ్గమీద రాసుకొనేది. తను వల్లినవీ, తను కుట్టినవీ వాడికి తొడిగి వున్నప్పుడు ఎంతో ఆనందపడేది.

కాని, వాడు ఏడవటానికి మూతి ముడిచినా, బట్ట తడుపుకున్నా, తక్షణం "శేవంతీ! ఒసే, వీణ్ణి తీసుకో" అని ఒక్క కేక పెట్టేది. ఎక్కడినుంచి వచ్చేదోకాని, శేవంతే ఎగిరివచ్చి అక్కడ వాలేది. వచ్చి వాణ్ణి తన చేతుల్లోనుంచి తీసుకోగానే, తనకో పెద్ద ఆపద తప్పినట్లని పించేది.

5, 6 నెలలు గడిచినతర్వాత, పరుపు చుట్టబెట్టించి కాస్త మామూలు మనిషి అయింది తను. తన పనులు తను చూసుకోవడం ఆరంభించింది. గోడని తగిలించిన బాట్‌మెంటన్‌బాటు తీసి దుమ్ము దులుపుకుంది. క్లబ్బుకి వెళ్ళడం సాగించింది. బాట్‌మింటన్ బంతీ తన చేతిలోవున్న బాట్‌యొక్క తడాఖా తెలుసుకోవటం ఆరంభమయింది. టేబిలుమీద పేకముక్కలు ఉల్టా సీదా అవటం మొదలయింది. రాత్రిపూట స్నేహితుల ఇండ్లలో విందుభోజనాలు ఆరగించటం ఆరంభమయింది. ఎప్పుడయినా కారు తీసుకు బజారువెళ్ళి, ఇంటిలోకి కూరగాయలు కొని తీసుకురావడం కూడా జరిగేది.

క్లబ్బుకి వెళ్ళిందా. కాలునిలవని లేడి అయిపోయేది. నిర్విచారంగా నవ్వుతూ పేలుతూ వుండేది. ఆవిడ ఉత్సాహం నిండు పౌర్ణిమ అయింది.

తనలాటివాళ్ళే మరో నలుగురు సంపన్న గృహస్థుల రాణులు ఒకచోట చేరినప్పుడు, సంభాషణల్లో మొట్టమొదట వచ్చే విషయం నౌకర్లను గురించి. "రోజు రోజుకీ యీ నౌకరీ చచ్చినాళ్లు మరీ గడుసు మీరి పోతున్నారు వాళ్ళని పనిలో పెట్టుకోవడం అంటే, మనమే వాళ్ళ నౌకర్ల మవడం అన్నమాట. వాళ్ళకి మన యిళ్ళల్లో భోజనాలు బాగానే వుంటా యట. కాని టీ మాత్రం రెండోసారి నీళ్లపోసి యివ్వగూడదుట! తెగ బలుస్తారు పీనుగలు మన యిళ్ళకొచ్చి. ఎంత ప్రాణపదంగా చూసుకున్నా, ఒక్క వెధవన్నా. పట్టుమని ఆరు నెలలుంటే ఒట్టు!" ఆ యిల్లాళ్ళందరిదే యిదే ధోరణి.

అటువంటి సందర్భాల్లో, తమ శేవంతిని ఎంతో మెచ్చుకుంటూ మాట్లాడేది మాలవిక. "ఆ శేవంతియే పిల్లాడికి సకలచాకిరీ చేస్తుంది. నేనేమి కలుగచేసుకోనే అక్కర్లేదు. అది రోజు రోజంతా, వాణ్ణి చంక వేసుకుని మోస్తూనే అన్ని పనులూ చేసుకుంటుంది." ఇది ఆశ్చర్యంగా వింటూన్న స్నేహితురాళ్లు "నువ్వు చాలా అదృష్టవంతురాలివి, బాబూ!" అని అసూయపడే వారు. ఆమాట విన్నప్పుడు తన ఘనత ఎంతో పెరిగి నట్లనిపించేది మాలవికకి.

ఆనాడు అంతటి గుణవంతురాలుగా కనిపించిన శేవంతే, ఈనాడు తన కంట బడకుండా వుంటే నయమనిపించింది.

మాలవిక టీ త్రాగడం తెమిలే టప్పటికీ, గడియారం ఎనిమిది కొట్టింది. క్రొత్తరోజు ప్రారంభమయినాక, ఒక గంటసేపు గడిచినట్టు గడి యారం సూచించింది. ఇంకా పదకొండు గడవాలి. అవిహాతా ఎలాగో గడ పాలి. అంచేత యింటిచుట్టూ వున్న తోటలో షికార్లకి బయలు దేరింది. బంగళా మెట్లు దిగి, తోటలో ప్రవేశించింది. శేవంతి భర్తే తోటమాలి. అమ్మగారు వస్తూండడం చూచి దణ్ణం పెట్టాడు. ఒక మహారాణీ ఠీవిగా అది స్వీకరించింది మాలవిక. తోటమాలికి అమ్మగారి పాపిడి కొంచెం వంకరగా వుందనిపించింది.

తోటలో గులాబీలు బాగా విచ్చివున్నాయి. అరటిగెల పండబారివుంది. గాలి పరిగెడుతోంది. చెట్లు ఊగుతున్నాయి. సూర్యభగవానుడి ఔదార్యం విరజల్లివుంది. వీధిలో మనుషులు అటూయిటూ పోతున్నారు. కూరగాయలు అమ్మేవాళ్లు కేకలువేస్తూ వెళుతున్నారు. పాలమ్ముకునేవాళ్లు పరుగెడు తున్నారు. మాలవిక బంగళా ముందు, ఒక పెద్ద మేడ కొత్తగా కడు తున్నారు. అక్కడ గానుగ ఎద్దులు తిరుగుతున్నాయి. ఉప్పరాళ్ళు, వడ్డెర్లూ ఆడవాళ్ళు మగవాళ్లూ బరువు పనులు చేస్తున్నారు. ప్రపంచకం అంతా పనిలో నిమగ్నం అయివుంది. ఆ సాయంత్రపు అన్నం మెతుకుల కోసం చెమటలు కారుస్తోంది.

ఏపనీ లేనిది, మాలవికకు ఒక్కర్తెకే. శేవంతి పిల్లాడి పోషణ చూసుకుంటూంది. శేవంతి మగడు తోటపని చూసుకుంటున్నాడు. వంట వాడు భోజనాలు తయారు చేస్తున్నాడు. దాసీది బిండెలు తోముతోంది. డ్రైవరు మోటారు నడుపుతున్నాడు. భర్త ఫ్యాక్టరీ నడుపుతున్నారు. ఖాళీగావున్నది మాలవిక మట్టుకే. ఆవిడ చేతులు ఎప్పుడూ మురికి కాలేదు. ఆవిడ అరికాళ్ళకున్నూ ఎప్పుడూ మట్టి అంటలేదు, ఎంచేతంటే మట్టితో ఆవిడ ఏవిధమయిన సంబంధం పెట్టుకోలేదు. తోటలో తిరుగుతున్నప్పుడు, ఏవో రెండు మూడు కణాలు ఆవిడ పాదాలకు అంటుకున్నా. బంగళాలో ప్రవేశించేటప్పుడు కాళ్లు శుభ్రంగా పీటమీద తుడుచుకుని, ఆ మట్టి వదల్చుకునేది.

ఆవిడకీ పనికీ ఏవీ సంబంధంలేదు. ఆవిడకీ మట్టికీ ఏవీ సంబంధం లేదు. ఆవిడ తెల్లగా వుంటుంది. నిగనిగలాడుతూ వుంటుంది. పాలిపోయి వున్నది. ఆవిడకి వయసు పెరుగుతూవచ్చినా వార్ధక్యం రాలేదు. దేహానికి తీరుబడి వుండేది. మనసుకీ, అంతే. తిని తిరగటంలోనే ఆవిడకి తలనొప్పి వచ్చేసేది. పరుపుమీద అటూ యిటూ పొత్తిగిలుతూంటేనే "ప్చ్-ఏమిటో!" అనిపించేది.

తన ఇంటిలోవున్న వంటగది తనకి పరాయిస్థలం; సామాను గది తనకి పరిచయంలేనిది; దేవుడిగది ఆ బంగళాలోకట్టనేలేదు. ఆ సంసారంలో ప్రతీ వస్తువుకీ మాలవిక యజమానురాలె! మోటారూ, గుర్రపుశాలా, తోటా

అప్పుట్ హౌసూ; ఇవన్నీ వున్న ఆ పెద్ద బంగళా. వీటన్నిటికీ ఆవిడ యజమానురాలే !

కాని, వీటిల్లో ఏవీకూడా ఆవిడ హృదయంలో ఒక స్థానం సంపాయించుకో లేదు. వీటన్నిటిమీదా లౌకికంగా ఆవిడగారి నిఘా వుంటూనే వుంది. పర్యవేక్షణ తీక్షణత పడుతూనే ఉంది. కానీ వేటిమీదా అంతఃకరణలో మమతగానీ, అపేక్ష అనే బంధంగానీ ఏర్పడలే దావిడకి. లిగెలాగ కోమలమయిన తన శరీరాన్ని ముస్తాబు చేసుకోవడంలోనూ, రకరకాల రంగు రంగుల దుస్తులతో అలంకరించుకోవటం లోనూ ఎవరో కష్టించి తయారు చేసి తన ముందుకి తెచ్చిపెట్టిన అన్నమూ, ఫలహారాలూ చెంచాలో నాలికమీద వేసుకోవడం లోనూ తప్ప ఆ బంగళాలో ఏ పనీ చేసిందీ కాదు; ఏ వస్తువూ సర్దిందీ కాదు. తను వళ్లు వంచి ఎవరికోసమూ దేనికోసమూ శ్రమించిందీ కాదు. ఆవిడ, తన సంసార సముద్రంలో ఏ కల్లోలము లేకుండా, ప్రశాంత చిఱు తరంగాలమీద మెల్లిగా ఊగుతోంది. తన గది తను ఎప్పుడూ పరిశీలించి చూసుకోలేదు; చూడడానికి ప్రయత్నం కూడా చెయ్యలేదు. తన భార్యను సుఖపెట్టడమే లక్ష్యంగా పెట్టుకున్నాడు ఆవిడ భర్త. కాని సుఖమంటే, ఏమిటి అనే విషయాన్ని గురించి మాత్రం, ఆ దంపతులు ఎప్పుడూ ఎక్కువగా ఆలోచించలేదు.

కాని. "నే నెవరికోసం, నా కెవరున్నారు" అనే ఆలోచన మాత్రం మాలతిక మనసులో రేగడం మొదలు పెట్టింది. తన నాలుగేళ్ళ కొడుకు, తను ఎట్టఎదుట వున్నా, తను లేనట్టే ప్రవర్తించటంతో ఆవిడకి ఈ ఆలోచన పట్టుకుంది. వాడు రోజురోజుకీ తనకు దూరం అయిపోతున్నట్టు కనుపించినప్పుడు, ఈ ఆలోచన పట్టుకుంది. మాలతిక వాడి మీద ఎండపొడ పడనివ్వ లేదు. వాడికి ఎన్ని దుస్తులు. ఎన్ని బొమ్మలు, ఎన్ని ఆటవస్తువులు ఎన్ని చెప్పులూ .... తను తన పిల్లాణ్ణి ఎవరూ చేయనంత గారాబం చేస్తోంది. "జన్మ జన్మలకీ యిలాటి తల్లే దొరకా" లని ప్రార్థిస్తా డసలు యింకే పిల్లాడయినా ! కాని వీడు ఎవరి భుజంమీద పడుకుంటాడయ్యా అంటే, ఆ శేవంతీ బుజంమీద. మారాం ఎవరిదగ్గర చేస్తా

డయ్యా అంటే. దాసిదగ్గర. ఎవరి కొంగు పట్టుకు తిరుగుతాడయ్యా అంటే- దానికొంగు - ఆ దాసీదాని కొంగు.

మాలవిక ఈ ఆలోచనల భారంతో బరువుగా నడుస్తూ తోటలోవున్న కొలను దగ్గరకువచ్చి నిలబడింది. ఆ కొలను మధ్యవున్న 'ఫౌంటెన్' నీళ్ళ తుంపరలని పైకి చిమ్ముతోంది. పైకెగిరిన నీటిబిందువులు, తమ యజమానురాలికి వంగి నమస్కారాలు చేశాయి. కాని ఆవిడ వాటివేపు శూన్యదృష్టితో చూస్తోంది. ఆ నీళ్ల కిందపడిపోతున్నాయి. తీరికలేని కార్యక్రమం ఆ నీటిధారలది. ఆవిడలో ఆలోచనలు కూడా విరామం లేకుండానే ఎగచిమ్ముతున్నాయి. కొంచెం దూరంలోవున్న బత్తాయిచెట్టు వందలకొద్దీ కాయలు కాసింది. ఆ కాయలన్నిటినీ తనశక్తిని వినియోగించే మోస్తోంది. కొమ్మలు అతిగా వంగిపోయాయి. విరిగిపోతాయేమోనన్నంతగా వంగిపోయాయి. అయినా. ఆ కాయల బరువు అంతటినీ అదే మోస్తోంది. మాలవిక ఆ చెట్టువేపే చూస్తూ నిలబడిపోయింది. ఆవిడకి ఆ దృశ్యంలో అర్థం. కొంచెం కొంచెం అవగాహన అవడం మొదలయింది.

ఇంతట్లో మహేశ్ పరుగెత్తుకుంటూ తోటలోకి వచ్చాడు. ఊరికే పరుగెత్తుకుంటూనే కాదు, పకపక నవ్వుతూ కూడాను! శేవంతి పాలచెంబు చేత్తో పుచ్చుకుని అతని వెనక పరిగెడుతోంది. ఆ క్షణంలో వాళ్ళిద్దరూ రేపల్లెలోని యశోదా కృష్ణులేమో ననిపించింది. చేతిలో పిల్లనగ్రోవి ఒక్కటే తక్కువ. పరిస్థితికూడా సరీగా, గోకులంలో పరిస్థితే! కన్నది దేవకీ, పెంచినది యశోదాను: ముస్తాబై. ముద్దులొలుకుతూ, పరుగులెడుతున్న ఆ బాలబ్రహ్మని చూస్తూంటే మాలవికకి ఎంతో ముచ్చటేసింది. వాడి కొంటెపనులు చూసి ఆవిడకి కూడా బుగ్గమీద సొట్ట పడింది. ఆవిడ పాలిపోయిన ముఖానికి, ఎరుపు తెచ్చుకున్నట్టు ఎరుపు రంగు వచ్చింది. ఆవిడకికూడా, మహేశ్ చేతిని తన చేత్తో పట్టుకుని తోటలో తిరుగుదా మనిపించింది, వాడికి పూవులన్నీ చూపిద్దామనిపించింది. పిట్టల గూళ్ళు చూపిద్దామనుకుంది.

కాని వాడి వెనకాలే వుంది-ఆ శేవంతి: నిన్ను వదలి పెడతానా, అన్నట్టు వెంటాడుతోంది. చప్పట్లు కొట్టుకొంటూ వాడి వెనకాలే తోటలో

పరుగెడుతోంది. మాలవికకి, శేవంతిని చూస్తే చురచుర లాడింది. "ఈశేవంతీ కొత్తగా పిల్లాణ్ణి పట్టుకున్న దయ్యం అయిపోయింది. అను క్షణమూ అంటుకునే వుంటుంది" మాలవికి అసూంతం కసిరినట్లు మాట్లా డింది. "ఎందుకే వాడివెనకే తిరుగుతావు ? వెళ్ళి పనులుచూచుకో. ఎప్పుడూ ఏ విషయంఅడిగినా, ఒక్కటే సమాధానంచెప్తావు పైగా; చినబాబుగారు ఆపని చెయ్యనివ్వలేదు, చినబాబుగారు ఈ పని చెయ్యనివ్వలేదు "అంటూను.

పాపం ! శేవంతి ! అమ్మగారి నిష్ఠూరపుమాటలుపడి తలవంచుకుని బంగళావేపు వెళ్ళిపోయింది. మాలవిక తన పరాక్రమం చూపించానని తృప్తి పడింది. మహేశ్‌చేతిని తన చేతిలోకి తీసుకుందామని రెండడుగులు ముందుకి వచ్చింది. కాని, వాడెంత మొండివాడని ! "శేవంతీ" అంటూ పొడూగ్గా పిల్చుకుంటూ దానివెనకే పరుగెత్తాడు.

"ఓరి చచ్చినాడా !" అన్నమాట అప్రయత్నంగానే మాలవిక నోటి నుంచి బయటి కురికింది. ఆవిడకి మొదట్లో కోపం వచ్చింది. ఎట్లాగా కంది పోయింది. ఆ తరవాత చల్లబడిపోయింది. ఉద్వాసన చెప్పిన విగ్రహంలాగ నిస్తేజురాలయిపోయింది. ఆవిడ కోపంతో ఎర్రగా కాగిపోవడమూ, పశ్చాత్తా పంతో చల్లబడడమూ, క్షణంలోనే జరిగిపోయినాయి. శ్రావణమాసంలో ఎండా, వానా ఏర్పడ్డట్లు మహేశ్ లేని ఆ తోటకేసి చూసింది. తల యూపు తున్న పువ్వులు తనను చూసి నవ్వుతున్నాయా అనిపించింది ఆవిడకి. దగ్గి రలోవున్న ఒక తిన్నెమీద కూచుంది.

వీధి కటువైపు కొత్తగా కడుతున్న మేడ దగ్గిర పని చురుకుగా సాగుతోంది. ఆవేపునుంచి అనేక రకాల శబ్దాలు వినబడుతున్నాయి. ఆడ వాళ్ళవీ మగవాళ్ళవీ స్వరాలు కలిసిపోయి హడావిడిగా వున్నాయి. యంత్రాలు కటకటమనీ, కిర్రుమనీ శబ్దాలు చేస్తున్నాయి. మేస్త్రీలు కసురు తున్నారు. ఆడ కూలీలు లక్ష్యం చెయ్యకుండా నవ్వుతూనే వున్నారు. దగ్గి రలో వున్న ఒక తుమ్మచెట్టు కొమ్మకి, ఒక పాతగుడ్డతో ఏర్పరిచిన ఉయ్యాల వేళ్ళాడుతోంది. అందులో అప్పుడప్పుడు కొంత కదలిక బయటికి కనిపిస్తోంది. ఎవరో ఒడ్డెకూలీ యొక్క పసికూన అందులో పడుకుని వుంది. ఆరుబయలులో గాలి ఆ పిల్లాడికి జోలపాడుతోంది. ఆ వుయ్యాల

కప్పులో, అంటే ఆ తుమ్మచెట్టు కొమ్మల్లో కొన్ని పక్షులు కూచుని, ఆ కూనకి కథలు చెబుతున్నాయి. అప్పుడప్పుడు ప్రకృతి ప్రభావంవల్ల యిటూ అటూ కదులుతున్నాడు. లోపలి ఆ కదలికతోపాటు ఉయ్యాల అంతా వూగుతోంది. కొమ్మను పట్టుకువేళ్లాడే గబ్బిలంలాగా. రెండు మూడు సార్లు కొంచెం వూగి, ఆ తర్వాత మళ్లీ నిశ్చలంగా వుండిపోతోంది వుయ్యాల.

మాలవిక ఈ దృశ్యమే చాలాసేపు చూస్తూ వుండిపోయింది, కాని దాని భావంమాత్రం ఆవిడ మనసుకి తట్టలేదు. ఆవిడ ఆ దృశ్యంవేపు అంతసేపూ చూస్తోందిగాని, ఆ దృష్టి శూన్యదృష్టి. ఆవిడ దృష్టి శూన్యంగా ఉండటానికి కారణం, ఆవిడ మనసు శూన్యంగా వుండటం. ఆవిడకి స్థల సమయ భావంకూడా శూన్యమయిపోయింది. సూర్యుని లేతకాంతి, తన పూలు స్వెటరులోంచి చొచ్చుకుని వెన్నుమీద కొంత వెచ్చ పుట్టిస్తోంది. కాని ఆవిడ హృదయానికి మాత్రం వెచ్చ ఏమాత్రమూ సోకలేకపోయింది.

అలాగే కొంతసేపు గడిచింది. 'ఎంతసేపని ఇక్కడే కూర్చోవడం, అనుకుని లేచింది. చెప్పులలో వున్న తన నాజూకు పాదాలతో సున్నితంగా అడుగులు వేసుకుంటూ, బంగళావేపు బయలుదేరింది. బంగళా ముందు భాగంలో పిల్లాడి తోపుడుబండి వుంది. దిలీప కులదీపకుడయిన దాశ రామ చంద్రుడో అనే కళతో మహేశ్, శేవంతి చిటికినవేలు పట్టుకుని బంగళా లోంచి బయటకు వస్తున్నాడు. వంటిని ఆకుపచ్చ స్వెటరూ, మెడకి కాఫీ రంగు మఫ్లరూ, నొక్కుల వెంట్రుకలలో పక్కపాపిడీ – కాళ్ళకి నిగ నిగ లాడే బూట్లూ, కొంటెతనంతో నవ్వుతున్న కళ్లుగల ఆ ముఖమూ .... కాళ్ళు వచ్చి నడిచివస్తున్న సూర్యబింబమా ? మాలవిక ప్రక్కలో పుట్టి వికసించిన పువ్వు – తన కడుపున కాచిన అమృతఫలం.

ముచ్చటగా ముస్తాబయివున్న ఆ బాలమూర్తిని చూసి మాలవిక ప్రసన్నురాలయింది. చిరునవ్వు నవ్వింది కూడాను. కొంచెంసేపటి క్రితమే వాడు తనని ధిక్కరించాడనీ. చిన్నబుచ్చాడనీ మరిచిపోయింది. వాడి దగ్గరకి వెళ్ళి తనకు దగ్గిరగా లాక్కుని ఒక్క ముద్దు పెట్టుకుంది. శేవంతి తన చెయ్యి పట్టుకునివుంటే. తల్లి చేసే ఆ మాత్రపు లాలనకు వాడెప్పుడూ అభ్యంతర పెట్టలేదు :

ప్రొద్దుటి భోజనం పొట్టనిండా తిని బడికి బయలుదేరాడు. మహేశ్ రెండుమూడు నెలలే అయింది మహేశ్ బళ్లో ప్రవేశించి. గ్రోపుడు బండి దగ్గరకి తీసుకువచ్చి నిలబెట్టింది శేవంతి. "చినబాబుగారూ కూచోండి మరి" అంది. కాని, వాడు "ఊఁ....హూ...." అని ముఖం అటు తిప్పేశాడు.

"అదేమిటండి మరి, ఆ బళ్లో కెళ్ళరా ఏం ?"

"వెళ్తాను "

తల అలా అడ్డంగా ఊప్తూతారేం మరి. కూచోండి బండిలో."

"ఉ హూఁ" అని మహేశ్ మళ్ళీ తల అడ్డంగానే తిప్పాడు.

"ఏమిటి బాబుగారూ."

"బండివద్దు నాకు. నువ్వెత్తుకో."

"చూడమ్మామరీ".

కాని మహేశ్ అప్పటికప్పుడే రెండు చేతులూ ఎత్తి శేవంతికి అటుక్కుపోయాడు. శేవంతి మాలవికకేసి చూసింది. "చూడండమ్మా మీ అబ్బాయిగారి గారాబం" అందా చూపు. "అదేమిటి నాయనా చూడు నీకీబండి ఎంత బావుందో" అంది మాలవిక. కాని వాడెక్కడ వింటాడు. వాడు శేవంతి మోకాళ్ళమీద కరుచుకుపోయాడు. ఆఖరికి శేవంతికి వాణ్ణి ఎత్తుకోక తప్పలేదు. కొంగు బిగువుగా దోపుకుని కట్టుకున్నందువల్ల సన్నబడిన నడుముమీద చటుక్కున అమిరాడు మహేశ్. "మమ్మీ, టాటా టా టా" అంటూ తన లేతచెయ్యి తల్లివేపు ఆడించాడు.

మాలవిక అలాగే చూస్తూ నిలబడిపోయింది. చూస్తూ చూస్తూండగానే, మహేశ్‌ని తన నడుముమీద సవరించుకుంటూ శేవంతి గేటుదాటి వెళిపోయింది.

పిల్లవాడి హఠం చూస్తూఉన్నది మాలవిక; నెరవేర్చినది శేవంతి ; ఇష్టంలేకుండా నూ. విసుగుకుంటూనూ కాదు; నవ్వుతూను, ఆపేక్షతోనూ. వాడి ఆగడపు చేష్టలు సాగనిచ్చేది శేవంతి. అదీ చూస్తూనేవుంది మాలవిక. ఒక్క క్షణానికి ఆవిడ మనస్సులో దుమారం రేగింది. "ఈ మొండిపట్టే మహేశ్ ! నా దగ్గిర పట్టివుంటే, నేను వాడి కోరిక చెల్లించగలిగి వుండేదాన్నా ? నేను వాణ్ణి చంకనువేసుకుని బడివరకూ మోసుకువెళ్లేదాన్నా ?

ఆహా, నా చేతనయ్యేది కాదు; ఏం నా ప్రతిష్టో? వ్యర్థప్రతిష్ట. నేనో పెద్ద బంగళాకి యజమానురాలిని! ఒక ఫ్యాక్టరీ ప్రొప్రయిటరుగారి భార్యని! శ్రీమంతురాలిని. మరి నాలాటి శ్రీమంతురాళ్లు తల్లుల మెందుకవటం? ఎంత బనాయి ఇదంతా! నా కడుపున పుట్టినకొడుకుయొక్క ముద్దుముచ్చటల కంటే, పనికిరాని ప్రతిష్టే నా కెక్కువన్నమాట! ఇంతేగా దీ నర్థం? పదిమంది శ్రీమంతురాండ్రు పనిలేక కూర్చుని యేర్పరచిన ప్రతిష్ట నియమాలనీ, నిబంధనలనీ గట్టిగా కాపాడించుకు కూడున్నా నన్నమాట! ఈ డాంబీకపు ప్రతిష్ట తీపి అనుకున్నందువల్ల, నా కన్నకొడుకు చే దమూ దన్నమాట. పసలేని ప్రతిష్టకోసం వాణ్ణి దూరం చేసుకున్నా నన్నమాట! యిది నే చేతులారా చేసుకున్నాను. వాడి బ్రతుకులో నేను ప్రవేశించనే లేదు.

వాణ్ణి గురించి అప్పుడప్పుడు శ్రద్ధపట్టానే? కాని, అది బెత్తం పుచ్చుకుని ఎవరో బెదిరిస్తే సంధ్యవార్చినట్లు.

నా హృదయంలో ఒకపోగు తీసి, వాడి హృదయంలో దారాంతో జోడించి, పెనవేసి ఒక బంధం వేసుకోలేక పోయాను. వాడికి ఎప్పుడూ నీళ్ళు పోయలేదు. ఒళ్ళు తుడవలేదు. వాడి నెత్తిన ఎప్పుడూ నూనెచుక్క పెట్టలేదు.

ఈ సేవలన్నీ శేవంతి చేసింది. అంచేతనే అదంటే వాడికి ప్రాణం అయి కూచుంది. కడుపునకన్నదే అసలయిన తల్లి అని ఆ కుర్ర వెధవకి ఎలా తెలుస్తుంది? దాని సహవాసంలో - అదిచేసే గారాబంలో, అది చెప్పే కాకమ్మకథలు వింటూ, అది ముద్దుచేస్తే ముద్దుమాటలు పలుకుతూ, అది తినిపించిన గోరుగోరు ముద్దలు తింటూ, వాడు పూర్తిగా దానివాడయి పోయాడు. నా దృష్టిలో అది పనిమనిషే కావచ్చు. కాని వాడి దృష్టిలో అదే వాడి తల్లి. నేను నా చేతులారా చేసుకున్న పనే యిది. ఆహా! నేను ఏపనీ చెయ్యకుండా అశ్రద్ధ చేసినందువల్ల వాణ్ణి శేవంతికి చేరువ చేశాను. నేను మంచంపట్టినా, బాధపడినా, ఏడ్చినా వాడు నావేపు తిరిగి అయినా చూడడు! కాని శేవంతీ కాస్త అటు తిరిగి కూచుందంటే, వాడు తన రెండు అరచేతుల తోటీ దాని ముఖం తనవేపు తిప్పుకొని, "శేవంతీ ఒక్క ముద్దుపెట్టుకో" అంటాడు.

ఈ ఆలోచన ఆవిణ్ణి చాలాదూరం తీసుకుపోయింది. ఆవిణ్ణి ఎప్పుడో మునుముందు రాబోయే భవిష్యత్తులోకి లాక్కుపోయింది. ఆవిడకి కళ్ళ ఎదట, మసగ తెర తప్పించుకుని ఒక దృశ్యం సాక్షాత్కరించింది.

తను ముసలిదయింది. జబ్బుచేసి మంచం పట్టింది. తన మహేశ్ యిప్పుడు పెద్దవాడయినాడు. అతను డాక్టరుని పిల్చుకువస్తున్నాడు. నర్సుని ఏర్పాటు చేశాడు. ఔషధాలూ, టానిక్కులూ, పళ్ళూ వగైరా సర్వసామగ్రీ రాసులు పోస్తున్నాడు తన మంచం ప్రక్కన బల్లల మీద—

అది సాయంకాలం. తనకి మామూలుకంటే కూడా అస్వస్థత ఎక్కువగా వున్నట్లనిపిస్తోంది. మహేశ్ తన దగ్గర కొంచెంసేపు కూచుంటే బాగుండునని కోరిక కలిగింది. అతన్ని మెల్లిగా అడిగిందికూడాను. అతను ఆవిడ కోరిక పూర్తిగా విని "అది కాదమ్మా నా కిప్పుడు బొత్తిగా తీరిక లేదు....ఒక పెద్ద మీటింగు వుంది ఇప్పుడు. మళ్ళీ అక్కడనుంచి ఒక స్నేహితుడి ఇంటికి భోజనానికి వెళ్ళాలి. నీ దగ్గరే వుండి మాత్రం నేను చేసే దేముంది చెప్పు. నీ సంరక్షణ కేమయినా లోటు జరుగుతోందా ? ఆఁ ? అట్లా అయితే, నే వెళ్ళేటప్పుడు ఓసారి డాక్టరుని పంపిస్తాను. కావాలంటే యింకొకళ్ళనో, యిద్దరినో నర్సులను పంపిస్తాను. ఏం ? సరా, మరి ? నే వస్తా."

మహేశ్ చక్కా పోయాడు ! మోటారు బంగళా ముందు నుంచి కదిలిన శబ్దం వినగానే, ఆవిడకి యింకొక నర్సు అక్కర్లేదని అర్థమైంది. ఆవిడకి డాక్టరు అవసరం లేదని అర్థమయింది. తనకి కావలసినది తన కొడుకు ! అతను ఒకసారి చేయివేసి తాకటం, తన నుదుటిమీద అతనొక్కసారి చెయ్యి వెయ్యటం. అతను సానుభూతితో, ఆపేక్షతో, ఆదుర్దాతో, ఒక ప్రశ్న వెయ్యటం అవీ తనకు కావాలిసినవి, అతను స్వయంగా తన చేతులతో ఒలిచి తీసిన ఒక బత్తాయి తొన తన నోటి కందియ్యటం.

ఈ దృశ్యం కనిపించినట్లనిపించి, అదృశ్యమవగానే, మాలవికకి ఒళ్ళంతా వణకి పోయింది. మనసు మంచుగడ్డయి పోయింది. అసలే పాలిపోయినముఖం యింకా వెలవెల పోయింది. దుర్భరమయిన తలనొప్పి పట్టుకుంది. తన జన్మలో ఈనా డొక్కరోజే, యింత తీవ్రంగా ఆలో

చించటం పెట్టుకుంది. ఆలోచన అనేది ఎంత కఠోరమైనదో, ఎంత దయా శూన్యమయినదో. అల్ట్రావయలెట్ కిరణాల్లాగా, మనిషిని బయటా లోపలా కూడా ఎలా వేయించేస్తుందో యివాళే మొట్టమొదటగా అనుభవంలోకి వచ్చింది మాళవికకి. ఆవిడకి తలనొప్పి దుర్భరమవటానికి యిదే కారణం.

తన పడకగదివేపు దారితీసింది. వెళ్ళి ఒక్క 'కోడో పైరిన్' మాత్ర గొంతుకలో వేసుకుని నీళ్ళు తాగింది. ఆ పైన కదలకుండా మంచంమీద పడుకుంది. ఆవిడ ఎటుచూసినా మహేశ్‌కోసం తను ఎంతో అభిమానంతోటీ, ఆత్మగౌరవంతోటీ కొన్న వస్తువులే ప్రతిచోటా పడివున్నాయి. అద్దాల బీరువానిండా అవే కనిపిస్తున్నాయి. కాని మాలవికకి యీ పూట అవేవీ చూడాలనిపించలేదు. అవన్నీ తనని ఒళ్ళంతా కుడుతున్నట్లనిపించింది. అంచేత కళ్ళు మూసేసుకుంది. ఆవిడ చాలాసేపు అలాగే కదలకుండా పడుకుని వుండిపోయింది. మహేశ్ అల్లరిచిల్లరగా పారేసిన కొయ్యబొమ్మలాగా, చైతన్యం లేకుండా.

ఆ తర్వాత ఎప్పుడో చాలా సేపటికి లేచింది. జీవం లేనట్లున్న బొందిని ఎట్లాగో స్నానాల గదికి ఈడ్చుకువెళ్ళి నాలుగు చెంబులు వేణ్ణీళ్ళు గుమ్మరించింది. ఎప్పుడోవచ్చి బల్లదగ్గిరకూచుని రెండు మెతుకులు కొరికింది. చేతులు కడుక్కున్న తక్షణం మేడమీదికి వచ్చేసింది. అక్కడ ఒక ప్రక్క వరండాలోకి, ఒక పేముకుర్చీ ఈడ్చుకుని అందులో కూచుంది. అంతట్లో మధ్యాహ్నం ఒంటిగంట కొట్టారు.

ఎదురుగా వున్న భవన నిర్మాణం చటుక్కున ఆగిపోయింది. కూలి వాళ్లు అన్నం తిని, కాస్త విశ్రమించడానికి గడువుగంట కొట్టింది. పనివాళ్లు క్షణంలో అటూ యిటూ చెదిరిపోయారు. మాలవికకి యిదంతా కనిపిస్తూంది. తనకి ప్రొద్దున్న కనుపించిన గుడ్డవుయ్యాల యింకా ఆ చెట్టునే వేళ్ళాడుతూ వుంది. ఆ పనివాళ్ళలోంచి ఒక ఆడమనిషి ఆ వుయ్యాల దగ్గిరకి వచ్చింది. ఆ వుయ్యాలలోకి వంగిచూసింది. ముఖం చాటంత చేసుకుని నవ్వుకుంది. ఉయ్యాలలో కదలిక గలిగింది. అందులోవున్న జీవకణం చేతులూ కాళ్ళూ ఝాడించింది. ఆ కూలిమనిషి, ఆ పసికూనని ఉయ్యాలలోంచి ఒక్క ఉదుటున బయటికి తీసింది. మూతిమీద ఒక్క ముద్దు పెట్టుకుంది. దాంతో, ఆ పసివాడికి, కాస్తోకూస్తో మిగిలివున్న

నిద్రమత్తు పాంతం ఎగిరి పోయింది. కళ్ళు తెరిచాడు. తన చిన్నపాదాలతో తల్లి పొట్టమీద రెండు మూడు తాపులు తన్నాడు.

ఆ ఒడ్డెమనిషి ఆ చెట్టుక్రింద నున్న పుళ్ళూగిళ్ళూ కూడా లెక్క చెయ్యకుండా, చటుక్కున చతికిల బడింది. నీడలోకూచున్నా ఆ మనిషికి వళ్ళంతా చెమటపోసింది. అసలే నల్లగావున్న శరీరం చెమటతో నిగనిగ లాడింది. కాని ఆ పసివాడు చెమటా గిమటా తుడుచుకోనివ్వ లేదు. వాడు అదేపనిగా తలతో తణుముతున్నాడు. వాడి నోటివెంట చొంగ కారుతోంది. ఆ తల్లి ఒక్క క్షణం ఆలస్యం చెయ్యలేదు. ఆ చాలీ చాలని. చిరిగిన పమిట సళ్ళించింది, పక్కకి తీసింది. ఆ అమృతకుంభం తన చేతితోటే వాడి నోటి కందించింది.

వాడు గుటుకూ, గుటుకూ పీల్చటం ప్రారంభించాడు. పాలతోపాటు ఆవిడ వంటిన పట్టిన చెమటకూడా ధారలుకట్టి వాడి నోటిలోకి వెళుతోంది. ఒక శరీరంలోని జీవరసం ఇంకో శరీరంలో ప్రవహిస్తోంది. ఆ సమైక్యంలో రెండు జీవాలూ ఒక్క జీవమయి తన్మయత చెందుతున్నాయి. తన ఎడమమోకాలు ఎత్తిపెట్టి పిల్లవాడి పిర్రలకి ఆధారంచేసి, చెట్టు మొదటలో పెట్టిన గుడ్డమూట అందుకోవడానికి ఒకచెయ్యి చాపింది. మూట ముడి విప్పి తనూ ఒక జొన్న రొట్టెముక్కా, ఒక కారముక్కా నోటిలో వేసుకుంది. తల్లీ. తనయుడూ ఇద్దరూ ఒక పనిమీదే వున్నారు.

తింటూ తింటూనే తన ఎడమచేత్తో ఆ పిల్లవాడి ముఖం మీది ముంగురులు పైకి తీసి దిద్దుతోంది. తన వక్షస్థలం నుంచి దూరంగా లాగి వేయబడుతున్న వక్షోజాలకేసి ప్రశాంతంగా చూసుకుంటోంది. ఆ సమృద్ధి గల వక్షోజాలు తనవి. ఆ చేపు తనది. అది తాగి నోటిలోంచి కార్చు కుంటున్న ఆ పసి ప్రాణి కూడా తనదే.

మాలవిక తను కూర్చున్న ప్రదేశం నుంచే యిదంతా చూస్తోంది. ఆవిడ దృష్టి అక్కడే లగ్నమయి పోయింది. నౌకర్లనీ, కూలివాండ్లనీ, కార్మికులనీ, శ్రమజీవులనీ, ఆవిడ ఎప్పుడూ మనుషుల్లో లెక్కకట్టుకోలేదు. కాని ఈ రసవత్తర దృశ్యంలో ప్రవహిస్తున్న వాత్సల్యం చూచేటప్పటికి, తన సంకుచిత అభిప్రాయాన్ని అణగార్చగలిగిన శక్తి వచ్చింది. ఆ దృశ్యం

వల్ల తనకు కూడా హృదయసీమలో ఏదో సంచలనం కలుగు తున్నట్ట యింది. స్త్రీ జీవితంలోని ఒకానొక స్వర్గ సౌఖ్యం, ఆ ఒడ్డెమనిషినుంచి తనలోకూడా ప్రసరించినట్లయింది. 'మాతాశిశువులు'-'తల్లిప్రేమ' వాసేం చేసినా దానికోసమే. అదే వాడికి పరబ్రహ్మ.

మరి నేను? నా మహేశు? వాడు నా కోసం ఏడుస్తాడా? వాడు నాకోసం నవ్వుతాడా? వాడికి ఆ శేవంతి వుంటేచాలు. వాడికి నాతో ఏ సంబంధమూ అక్కరలేదు. శేవంతే వాణ్ణి అరచేతిలోపెట్టి ఆడిస్తుంది. వాడు నామీద ఏమీ అధికారం చలాయించడు. దానిమీద అన్ని అథార్టీనూ చేస్తాడు. వాడు నా వాడవుతాడా? సర్వవిధాలా నాకు సొంతం అవుతాడా? ఆ ఒడ్డెదాని పిల్లడిలాగ. కాని....కాని నేను మహేశ్‌కి ఏ సంరక్షణా చెయ్యలేనే. వాడికి నీళ్లుపోసి అన్నంపెట్టి, ముస్తాబు చెయ్యడం చేతకాదే నాకు. నేను వాణ్ణి చంకనేసుకుని బడివరకూ మోసుకెళ్ళగలనా? వాడి కోసమని నేను, నా క్లబ్బూ, పేకాటి, పరాయియిళ్ళ విందులూ మానేసుకోగలనా? నేను తల్లిని కాను. శ్రీమంతుల వ్యర్థ వ్యామోహాలకి నేనొక బానిసని. అల్పమయిన, అనవసరమయిన శ్రీమంతుల బడాయి సంస్కృతికి అమ్ముడుపోయిన దాన్ని. నా అంతట నేనే వాడికి దూరం అయిపోయి, నే కనుక్కున్న పిల్లాడు నన్ను ప్రేమించితీరాలని వాంఛిస్తు న్నాను. కొత్త బట్టలూ, ఆటవస్తువులూ, చాక్‌లెట్లూ పిప్పరమెంట్లూ, లంచం యిచ్చి వాడి ప్రేమ సంపాయించాలని ప్రయత్నిస్తున్నాను.

కాని, కాని. యిదంతా వ్యర్థం. పూర్తిగా వ్యర్థం అని అనేకరకాల తైలచిత్రాలు తాను చాలాసార్లు చూచింది. కాని యిప్పుడు తను చూస్తున్న చిత్రం సజీవమయినది. కంటికి నిండుగా వున్నది. పరిమళిస్తూ వున్నది. ఈ దృశ్యంయొక్క ఆశయ పరిమళాన్ని తను చూపులతోటే ఆస్వాదిం చేద్దామా అని అనిపించేటంత ఉత్కృష్టంగా వున్న దృశ్యం అది.

మాలవికకి ఆ ఒడ్డెమనిషి అంటే అసూయ పుట్టుకొచ్చింది. తనకున్న యింత పెద్ద బంగళాలోకాని, అంత శుభ్రమయిన పురిటిగదిలోగాని, ఈ మాతృభావ సుఖం తన శరీరంలో ఏనాడూ కలగకపోవడం, తన బ్రతుకు లోనే ఒకలోపం అనిపించింది. అయినా అటువేపే చూస్తూ కూచుంది.

నిజానికి అసలు తన దృష్టి దయ్యమయి ఆ మాతాశిశువులని వదలిపెట్ట నంటోంది.

మాలవిక కంటే, ఆ కూలిమనిషే ముందుగా ఈ లోకంలోకి వచ్చింది. ఆ పిల్లాడు ఎంత సేపయినా అలా తాగుతూ ఉండటమూ పీకుతూ ఉండటమూ కష్టమనిపించింది. "రక్తంకూడా తాగేత్తావేంటిరా సచ్చినోడా !" అంటూ వాడి నోటినుంచి తన రొమ్ము లాగేసింది. తన ఎంగిలిచేత్తోటే వాడి బుగ్గ మీద ఒక చిన్న చెంపకాయ వేసింది. వాడికి ఆ కాస్త కారణమే చాలు, దిక్కులు మారుమోగేలా ఏడుపు సాగించాడు. తల్లిప్రాణి తల్లడిల్లిపోయింది. ఎత్తినచెయ్యి స్తంభించిపోయింది. తన ఎంగిలిమూతితోటే వాణ్ణి ఒక ముద్దు పెట్టుకుంది. "లేదులే, లేదు" అంటూన్నతను చేసిన తప్పు ఒప్పుకుంది: కొంచెం లాలించింది: కాస్త జోకొట్టింది! ఆమాత్రానికే వాడు ఏడుపు ఆపేశాడు.

మాలవిక ఈ సంఘర్షణ చూవస్తూ చూస్తూనే వుంది. ఆ కుర్రవాడు ఆ కూలిదానికి సర్వవిధాలా సొంతంగదా అనుకుంది మాలవిక! వాడు దానిమీదే ఆధారపడి బ్రతుకుతున్నాడు; దాని కోసమే నవ్వుతాడు!



120

# "భవతీ భిక్షాందేహి"

నేను కాళ్ళూ చేతులూ కడుక్కొని అప్పుడే విస్తరిముందు కూర్చున్నాను. చిత్రాహుతి మట్టుకు అయింది. ప్రాణాహుతి యింకా తరువాయే. ఇంతట్లోనే మామూలు కేక బయటినుంచి వినబడింది.

"ఓం భవతీ భిక్షాందేహీఽఽఽ"

ప్రాణాహుతి మెతుకులు ఆదరాబాదరా మింగి, "ఏమిటీ దిక్కుమాలిన ఘోష, మనం ఏదో అన్నసత్రం పెట్టినట్టు ప్రతివాడూ యిక్కడికే వస్తాడు" అని గట్టిగానే సణుక్కున్నాను. ఈలోపుగా, మా ఆవిడ చపాతీలో నాల్గవ భాగం విరిచింది. దానిమీద నాలుగు కూరముక్కలు పెట్టింది, హడావిడిగా నా ఎదుటనుంచి లేచి, ఆ ప్రాణికి మాధవకవళం వేసివచ్చి యథాప్రకారం కూచుంది.

"ఆ కాస్త చపాతీ ముక్కతో ఎలా గడుస్తుందే? దుంపు ముక్కలాగా వున్నవాడూ, వయసులో వున్నవాడూను. అతనికి ఒక పంటికింద కయినా వస్తుందా, ఆ కాస్తాసూ!"

ఆవిడ పప్పు పులుసు గరిటితో కలియబెడుతూనే, సమాధానం చెప్పింది. "మీ మాటలకేం లెండి. ఎప్పుడూ యింతే. నన్ను వెటకారం చెయ్యడానికే అన్నారని నాకు తెలుసులెండి. మీ రేమన్నా సరేగాని, గుమ్మం

ముందు "భిక్షందేహి" అన్నకేకని వినిపిస్తే మాత్రం నాకు ప్రాణం తల్లడిల్లిపోతుంది. అది మా ఆడవాళ్ళ స్వభావమే అనుకోండి పోనీ. అర్థించివచ్చినవాడు, వయస్సులో వున్నాడా. వృద్ధుడా అనికాని, దృఢంగా వున్నవాడా. అంగహీనుడా అనిగాని అడపట్టను. అతను నోరుతెరిచి అడుగుతున్నాడంటే. అవసరం వున్నవాడన్నమాటే : అంతే నాకు తోచేది. ఆకలివేళలో అర్థించినవాడు ఉత్తచేతులతో వెళ్ళకూడదు. అంతే నే చూసేది.

"అది తెలుసునోయ్ : నువ్వంత * 'గిరిజాబాయి'లా పుంజాలను కోవటానికి, నేను 'ఏకనాథుడి' లాగా ఆగర్భ శ్రీమంతుణ్ణి కాదుగా మరీ :"

"కాకపోయినా ఫరవాలేదు లెండి, కనీసం గృహస్థు లనుకదా."

"అయితే యిలాటి సోమరిపోతుల్నీ, దున్నపోతుల్లా వున్నవాళ్ళనీ పోషిస్తూ కూచోవడమే నా గృహస్థ ధర్మం అంటే, ముష్టికి బయలుదేర డానికి వాళ్ళ కెలాగా సిగ్గులేదు కదా అని, నేను కూడ చూసీ చూడనట్టే ఊరుకుంటాను ? ఏదయినా పనిచేసుకు బ్రతకడానికేం ? ఎవరయినా చదువుకుంటూన్న కుర్రవాడు వారాలకి వస్తే, అది వేరే విషయం : వారంరోజులకోసారి మనకున్న కలోగంజో వాడికీని ఎనిమిదోవంతన్నమాట. ఇప్పుడీరోజుల్లో ఎవరూ వారాలకి రావటమే లేదెందుచేతో. పనీ పాటా చేసుకోకుండా, బడితెలులాగా యిలాటివాళ్లు బయలుదేరారు."

"ఏమండోయ్ ! మీ రేమిటి నామీద లేస్తున్నారు ? వాళ్ళని పనీపాటా చేసుకోవద్దని నేనే నేర్పినట్లు...." కొంచెం స్వరం హెచ్చించే అందీమాట.

"నీమీద లేవడం ఎందుకులే, రేపురానీ వాడ్ని అడుగుతాను నిలేసి. భయమేముం దిందులో".

ఆ మర్నాడు నిజంగానే అతన్ని అడిగాను – నిలేసి.

మంచె కట్టుకుని, తుపాకి బారుచేసి. వనమృగం ఎప్పుడు వస్తుందో అని వేటకాడు కూచున్నట్టు. మాంచి వాడిఅయిన బాణాలలాటి మాటలు వెతుక్కు వుంచుకుని. అతని రాకకోసం ఎదురుచూస్తూ నేను సావిట్లోనే కూచున్నాను. రోజులాగే మామూలువేళకి అతనూ వచ్చాడు. ఎడమ చేతిలో

* ఏకనాథుడూ, గిరిజాబాయీ – దాతృత్వానికి ఖ్యాతిగాంచిన దంపతులు.

ఆకుపచ్చ గుడ్డజోలీ. ఒడిచేతిలో ఒక నీళ్ళచెంబూ, ఆచారంగా కుచ్చెళ్లు పోసి కట్టుకున్న ఒక చిరిగిన పట్టుపంచా, నెత్తిన ఒక తడి అంగవస్త్రం మడతా - యిదీ వేషం. గడ్డం పెరిగే ఉందనుకోండి. చూపులో కూడా ఏదో విసుగూ విరక్తీ పచార్లు చేస్తున్నాయి.

అతను మా ప్రక్కయింట బిచ్చం పుచ్చుకుని, మా యింటిముందు కొచ్చాడు. నీరసంగా వున్న స్వరం హెచ్చించినందువల్ల వచ్చిన కీచుగొంతుకతో "ఓం భవతి భిక్షాం...." అని కేక ఎత్తుకున్నాడు. అది చెవిని పడీ పడగానే, నా భార్య చపాతీముక్క విరవనే విరిచింది. కాని "మనిషికంటె ముందు ఎలుగుబంటే తొడగొట్టిందన్న" సామెతలాగ ఆవిడకంటె నేనే అతని ముందు నిలబడ్డాను.

"ఏమిరా : నీ వయసులో బిచ్చమెత్తుకోడానికి నీకు సిగ్గయినా...."

"ఏమిరా : ఆ...? అధమపక్షం ఏమోయ్ అనడమయినా చేతకాదు మీకు".

లోకమీద అడుగుపడగానే వెనక్కితిరిగి బుస్సు మన్నట్లు, మరు ప్రశ్న వేశాడు నన్ను : నా మాట అతని హృదయంలో ఒక బాణంలా గుచ్చుకుని ఉంటుంది. కాని మరుక్షణంలో అతని కళ్ళల్లో విరక్తి ఘనీభవించింది. చాలా తగ్గుస్వరంతోనే "నేను బి. యస్ సి. పాసయానండి :" అని నా అనాగరికతని ఎత్తిచూపాడు.

నాకు నిజంగానే నెత్తి అణచినట్టయింది. బి. యెస్ సి....: నమ్మశక్యంకాలేదు నాకు. కాని, అతను ఎంతో బాధగా పలికిన ఆ మాట అబద్ధమనీ అనిపించలేదు. కాని అంతమాత్రంతో నే నెందు కూరుకుంటానూ ? "బి. ఎస్ సి. ? అయితే ఆ పట్టా బిచ్చ మెత్తుకునేందుకు యిచ్చిన పట్టా ఏమిటి ? గ్రాడ్యుయేటు ఉద్యోగం చేసుకోవటానికా, జోలియ్యింది బుజాన్న వేసుకోవడానికా ?"

"బ్రాహ్మణుడికి ముఖ్యదీక్ష.

నిత్యం యాచించించాలి భిక్ష" అన్నారు సమర్థుడగు రామదాసుగారు.

అందుకని, బ్రాహ్మణుణ్ణి అంచేత బిక్ష విడిచి పెట్టలేను." అతని ధోరణి నా కర్థమయింది. నేనెంత కుత్సితంగా, వెటకారంగా ప్రశ్న వేశానో

అతనూ అలాగే సమాధానం చెప్పాడు. అతను నన్నేదో ఏడిపిస్తున్నా డనిపించింది. అంచేత అంచేత నేను కూడా ఒక వ్యంగ్యపు చిరునవ్వుతో "దీక్షగా త్రికరణశుద్ధిగా ఏదయినా, పనిచూచుకో" అని కూడా అన్నా ఆ సమర్థ రామదాసుగారు. బహుశా నువ్వది చదవలేదను కొంటాను." అంతగా ఉద్యోగం ఏదీ దొరక్కపోతే ఒక చెప్పు రెటరు ముందు వేసు క్కూచుని, రోజుకి 7 8 గంటలసేపు కొట్టుకులాడితే రూపాయో రెండో మిగలకపోతాయా ?

"చెప్పుచెటరు కొనడానికి పెట్టుబడో ? మీరేమయినా కాస్త ఆ ఏర్పాటు చేసిపెడతారా ఏమిటి ?

"ఇది మరీబాగుంది 'శాస్త్రుల్లా శాస్త్రుల్లా, పెళ్ళెందుకు చేసుకోవటం లేదూ' అంటే 'నువ్వవుతావా పెళ్ళానివి' అన్నాట్ట."

"అనవసరంగా ఎందుకండీ నన్ను రాపిడ్జిపెడతారు, ఒక్కముక్కలో తెములిపోయేదానికి. 'ఇక్కడ నీకేం భిక్ష దొరకదు' అంటే రేపట్నించి రానే రాను. బోలెడంతమంది అన్నారు అలాగ. నేనూ అలవాటుపడి మొండివాడిపోయాను. 'చచ్చిపోయిన మేక పిల్లకి మంటంటే ఏం భయం ?"

"ఇదీ, నీ ఒక్కడికే భిక్షవెయ్యడమా, లేదనడమా అన్న సమస్య కాదు. అసలు అందులోవున్న తప్పుసమస్య - నీలాగా కాళ్లూ చేతులూ తిన్నగా వున్నవాళ్ళని సంఘం ఎందుకు పోషించాలని. ఈ దానంలో ఔచిత్యం లేదు. దీనివల్ల పుణ్యానికిబదులు పాపం మూటకట్టుకోవాలి. ఇటు వంటి దానం చెయ్యడం. సోమరితనాన్ని వెన్నుతట్టటం అన్నమాట. ఇవాళ నువ్వు వచ్చావు. రేపు నిన్ను చూసి మరోడు బయల్దేరతాడు. 'ఎందు కొచ్చిన బాధ, హాయిగా జోలి చంకనేసుకుంటే సరి' అని—"

"అయితే యీ వృత్తి అంత సుఖమయినదనీ, నమ్మకోదగినదనీ తమ అభిప్రాయం కాబోలు : పాపుగంట, పాపుగంట చొప్పున నాలుగు యిళ్ళఎదుట కొయ్యబారేలాగ నుంచున్న తర్వాత, ఒక్క రొట్టిముక్క జోలిలో పడుతుంది. అదయినా నాపరాయంత మెత్తనిది. అది పుచ్చుకునే టప్పుడు భరించవలసిన నిందావాక్యాలూ, నిష్ఠూరపు చూపులూ సహించ గలిగితేనే, అదయినా ? ఆవగింజంత అభిమానం వున్నవా డెవడయినా

సరే, ఈ అడుగడుగికీ జరిగే అవమానం భరించలేక, మూడో రోజున జోలి విసిరి మూల పారేస్తాడు. ఆకలితో కడుపు మండి చచ్చేదాకా ఆగలేకపోతే, రైలు క్రిందయినా పడి...."

మాట పూర్తి కాకముందే అతని గొంతుక రుద్ధమయింది. కళ్లు కరిగిపోయాయి. నేను పూర్తిగా చల్లారిపోయాను....నిజానికి పరాభవం జరుగుత నాకు. కాని ఎవరో దౌర్భాగ్యుడు వచ్చి నా యింట్లోనే నన్ను ఒక్క ముక్కతో పరాభవించేశాడని ఒప్పుకోవడానికి, నా అహంకారం ఎలా అంగీకరిస్తుంది? అంచేత అతన్ని మళ్ళీ కదిలించాను.

"ఇంత తెలిసినవాడివి, అంత చదువూ చదివి యీ వృత్తిలో దిగావేం మరి?...."

"మీకు ప్రతీదానికీ మూలకారణం కనిపెట్టాలని, ముఖ్యతత్వం శోధించాలనీ తృష్ణ ఎక్కువగాబోలు! సంగతి అంతా వినాలా ఏమిటి? అయితే నన్ను కాస్త లోపలికి రానివ్వండి. గోడనానుకుని కొంచెంసేపు కూచోనివ్వండి. నాకు కొంచెం తల తిరుగుతూన్నట్లూ, మైకం వచ్చేట్టూ వుంది.

నే నేమీ జవాబు చెప్పలేదు. అదే అనుజ్ఞగా భావించి అతను లోపలికి వచ్చాడు. నెత్తిమీది గుడ్డముక్కతీసి తన చెంబులో నీళ్ళతో 'తపా తపా'మని తడిపి, మళ్ళీ నడినెత్తిన పెట్టుకున్నాడు. ఒకటి రెండు క్షణాలు మౌనంగానే వుండిపోయాడు. ఆ తర్వాత 'ఆః' అని ఒక్క దీర్ఘ నిశ్వాసం విడిచి అప్పుడు మొదలుపెట్టాడు.

"పదిమంది పదిమాటలంటారు: కొందరు నా మొగం మీద, కొందరు నే నటుతిరగ్గానేనూను. ప్రతివాడికీ నా కర్మమూ కదా. ఎక్కడ చెబుతూ కూచుంటాను? కాని మీరు నన్నొదిలిపెట్టటం లేదు. అసలు తత్వమేమిటో తెలిసికోవాలనే జిజ్ఞాస వుందని అతిశయం పోతున్నారు. అంచేత యిక యిప్పుడు మీకు యావత్తూ చెప్పక తప్పేటట్టులేదు.

"నోటికీ, చేతికీ అందీఅందకుండా గడుస్తూన్న కుటుంబం మాది. మా అమ్మ, నాన్నగారూ, మేం యిద్దరం అన్నతమ్ములమూను. వీళ్ళల్లో మా అమ్మ ఈ లోకంలోంచి మకాం ఎత్తేసి, అడంగుకు చేరుకుని తెరిపిని

పడిందిలెండి. అన్నయ్య బొంబాయి కార్పొరేషనులో ఉద్యోగం చేస్తున్నాడు. ఇంట్లో యింకో వ్యక్తికూడా వుండేది. కాని ప్రస్తుతం లేదావిడ! ఇప్పు డింట్లోవున్న వాళ్ళం మేం యిద్దరమే. నేనూ, మా నాన్నగారూను. ఆయన ఎలిమెంటరీ స్కూల్లో బడిపంతులు ఉద్యోగం చేసేవారు. ఇప్పుడు పెంఛను దారు. అంటే పింఛను డబ్బులురాని, పింఛనుదారు."

"అదేమిటది. నా కేం అర్థంకాలేదు" అన్నాను.

"జరిగిందంతా అనర్థమే అయితే, అర్థం ఎక్కడనుంచి వస్తుంది? ఆయన పెన్షన్ రాబడి అంతా ఒక మొత్తానికి అమ్మేశారు. నాకూ, మా అన్నయ్యకీ చదువులు చెప్పించటంనిమిత్తం అమ్మేశారు. మేం బాగా చదువుకుని ఉద్యోగాల్లో చేరి, పెద్ద ఆఫీసరులమయి పేరుప్రతిష్ఠలు తెచ్చు కోవాలనేది ఒక్కటే కోరిక ఆయనకి. అల్లాగే అన్నయ్య డిగ్రీ సంపా దించాడు; ఉద్యోగంలో చేరాడు. ఆ తర్వాత నాలుగేళ్ళకి నేనూ బి.ఎస్‌సి. పాసయాను. కొడుకులు ఇద్దరూ పెద్ద పరీక్షలు పాసయి, డిగ్రీలు పొందా లన్న కోరిక సఫలమయింది ఆయనకి.

ఓరోజున ఉత్తరీయం భుజాన వేసుకుని ఊళ్ళోకి బయలుదేరా డాయన. తను ఉద్యోగంలో ఉన్నప్పుడు పరిచయమయిన ఒక పెద్దఉద్యోగిని కలుసుకున్నాడు. ఆయన సహాయంతో అంతకంటె పై అధికారిని దర్శిం చాడు. అట్లాఅట్లాగే మెట్టుమెట్టుగా ఆ డిపార్టుమెంటు కంతటికీ పెద్ద అధికారిని కూడా కలుసుకున్నాడు. పలుకుబడి ఉపయోగించాడు. నన్ను తీసుకెళ్ళి చూపించాడు. కొన్నాళ్ళకి నన్ను పనిలో చేరమని ఆర్డరు వచ్చింది. మా నాన్న నాచేత సత్యనారాయణవ్రతం చేయించాడు. ఆ దేవుడి కృప నాకు వెనుకంతగా ఉండాలని ప్రార్థిస్తూ నన్ను ఉద్యోగంలో చేర్పించాడు.

అన్నయ్య ఉద్యోగం బొంబాయిలో. నాది పూనాలో. తన పెన్షను యావత్తూ అమ్మేసినందుకు ఫలితం కలిగిందని తృప్తిపడ్డారు నాన్నగారు. అన్నయ్య నెలనెలా 50 రూపాయిలు పంపించేవాడు నాన్నగార్కి. కాని తర్వాత తర్వాత వాడికి పెళ్ళి అయింది. కాపురం పెట్టుకున్నాడు. అప్పుడు కొన్నాళ్ళు 30 రూపాయిలే పంపించేవాడు. తర్వాత 30 అల్లా 20 అయింది. అలాగే ఆ అంకె చిక్కిపోతూ వచ్చింది.

తర్వాత తర్వాత ఒక్కొక నెల ఏమీ వచ్చేదేకాదు: నాన్నగారు 'ధూం ధాం' మనేవాడు. "కుత్రాడు పాడయిపోయాడు. విశ్వాసం లేనివాడయిపోయాడు కర్తవ్య భ్రష్టుడయిపోయాడు" అని కోపం తెచ్చుకునేవారు.

నేనూ ఈ నిందలు అనేకసార్లు వినివిని ఓరోజున ఆయనకి నచ్చ చెప్పటానికి ప్రయత్నించాను.

"మీరు అనవసరంగా అన్నయ్యమీద కోపం తెచ్చుకుంటున్నారు. అతనికి ముట్టేది నెలకి యాభై రూపాయలు. బొంబాయిలో కాపురం: వృద్ధి అవుతున్న కుటుంబం. అక్కడ ప్రతివస్తువూ ప్రియమే. కూచుంటె డబ్బు నుంచుంటె డబ్బుతో పని. అందులోనూ రోగం రొష్టువస్తే యిక ఖర్చుకి అంతేవుండదు. వాడూ బాధపడుతూనే వుండివుంటాడు. మీరింక అతని సహాయం అపేక్షించక పోవటమే ఉత్తమం నేను సంపాదిస్తున్నానుగా, యిప్పుడు తెచ్చిన జీతం అంతా మీ చేతికే యిస్తున్నానుగా, యింకా ఎందుకు మీ రనవసరంగా మనసు కష్టపెట్టు...."

కాని, ఆయన కదేంనచ్చలేదు. తను ఎన్ని ఇబ్బందులూ, ఇక్కట్లూ సహించి, పిల్లల్ని పెద్దవాళ్ళని చేసి చదువు చెప్పించి ఉద్యోగాల్లో చేర్పించాడూ? మరి అలాగే పిల్లలక్కూడా ఏ యిబ్బంది వచ్చినాసరే, తండ్రిని పోషించడం నిర్లక్ష్యం చేయకూడదు - ఇదే ఆయన పట్టు. తన సంతానం తనకు ప్రతిఫలం పుట్టజెప్పితీరాలి అనే సూత్రం పఠిస్తున్నప్పుడు, ఆ సంతానానికి ఏమేమి ఆటంకాలు కలుగుతున్నాయో అనే ఆలోచనే రానిచ్చేవారుకారు ఆయన. తమ యిచ్చింది వడ్డీతోసహా తనకి యివ్వక పోతే, యిక వాడు పనికిరానివాడన్నమాటే !

కొన్నాళ్ళకి నాకూ పెళ్ళయింది. మామగారు నాకు సాలంకృత కన్యాదానం చేశారు. మా అమ్మ కోడలిముఖం చూడగలిగిందేగాని, కోడలి సుఖం చూసేవరకూ జీవించలేదు. నాకు విపరీతమయిన దుఃఖం కలిగింది. పాపం, ఎన్నెన్ని కష్టాలు సహించి పెంచింది మమ్మల్ని! ఆవిడే బ్రతికివుండివుంటే, నే నీ నాలుగుకొంగులూ ముడిపెట్టి మీ యింటికి వచ్చుండేవాణ్ణేకాను. నన్ను ఈ పనిమీద ఎన్నటికీ బయలుదేరనిచ్చేదికాదు. కాని వెళ్ళిపోయింది. తన సంసారం యిలా ఛిన్నాభిన్నమవటం చూడ

వలసిన రోజు రాకముందే కళ్లు మూసేసింది. అదీ కొంతవరకూ నయమే నేమో ననిపిస్తుంది నాకు. నాకూ ఒక బంధము తప్పింది!

తల్లి పోయిందన్న ఒక్క దుఃఖం తప్పితే, నాకు పెళ్ళయాక, 2, 3 సంవత్సరాలు సుఖంగానే గడిచిపోయాయి. నా భార్య యింటరువరకూ చదువుకుంది. కళాకాంతులూ, కను ముక్కుతీరూ కూడా యింపుగానే వుంటాయి. పెద్ద షోకులు చేసుకోవాలనీ, క్లబ్బులకి వెళ్ళాలనీ మోజులు కూడా వుండేవికావు. సాయంకాలం షికారుకి వెళ్ళడంమాత్రం సరదా ఆవిడకి. అలా వెళ్ళేటప్పుడు మల్లెపూలు కొనుక్కోవాలని కోరికవుండేది, వారానికి ఒక సినిమా చూస్తే చాలనుకునేది.

నా మనసుకు నచ్చినట్లు మాట్లాడేది. మసలుకునేది. ఆవిడ ప్రేమ ఆషాఢమాసంలో, నదిలాగా రెండు గట్లూ రాసుకుంటూ, నిండుగా ప్రవ హించేది. అంచేత ఆవిడే నాకు సర్వస్వమూ అనిపించేది. ఆవిడ సుఖంగా ఉంటే నేనూ సుఖంగా వున్నట్టే అనుకునేవాణ్ణి.

క్రమక్రమంగా గృహనిర్వహణ అంతా నా చేతుల్లోకి, అంటే ఆవిడ చేతుల్లోకి వచ్చేసింది. నెలనెలా నా జీతం మా తండ్రిగారి ముష్కించిన చేతుల్లో జారవిడవడంకంటె, నా భార్య యొక్క నున్నటి చేతుల్లో ఉంచడమే ధన్యత అనుకునేవాణ్ణి. నిజానికి మా నాన్నగారు మనసులో బాధపడేలాగే వుండేది నా ప్రవర్తన. సంసార బాధ్యత ఆయన బుజాలమీంచి తప్పిం చేశాను. ఆయన చేతుల్లోంచి లాగేశాను బలవంతంగా.

ఆయన మా ఇద్దరిమీద రుసరుసలాడేవారు. పద్దన్నకొద్దీ అనవసర మయిన విషయాలన్నిటిలోనూ కలుగచేసుకుని, నోరు చేసుకునేవారు. "ఈ ఖర్చు దుబారా ఖర్చు!". "ఈ వస్తువు కేమిటంత అవసరం?", "ఇది వ్యర్థం!", "అది నష్టం" అని ఏవో పోరుపెడుతూండేవారు. అది మేం లెక్కపెట్టక ఊరుకుంటే, ఆయనకి మరీ కోపం వచ్చేది!

ఆయన అవస్థ "పెల్లి చచ్చాక, తండ్రి పరాయివాడే!" అన్న సామెత లాగ తయారయింది. ఆ అవస్థ నేనే తెచ్చిపెట్టాను. కొంచెం ఆలస్యంగా తెచ్చాను అంతే! పెళ్ళయిన మరుక్షణం కాదు; నా భార్యమట్టుకు ఆయన్ని అసలు లెక్కచేసేది కాదు. ఆయన యెదట పకాలింటే వానికి ప్రాణసంక

టంగా ఉండేది. నేనా విషయం ఎప్పుడయినా మందలిస్తే, మూతి విరుచుకునేది.

"పితృభక్త శ్రావణుయి" అని బిరుదులిచ్చేది నాకు. వాస్తవానికి మా సంసారంలో, మా నాన్నగారు ఎవరికీ అక్కరలేని వారయిపోయారు.

దీనికి ఫలితంగా, మొదట ఆయన మనసులోనూ, తర్వాత ఆయన శరీరంలోనూ మార్పు కనపడింది. ఆయనకు గుండెల్లో దడా, నీరసం పట్టుకున్నాయి. నుంచునిపుంటే కాళ్లు చేతులు వణకటం, మైకం రావటం, అప్పుడప్పుడు మూర్ఛ రావటం మొదలు పెట్టాయి. ఒకసారి మూర్ఛవస్తే మళ్ళీ వారం పదిరోజుల వరకూ పక్కమీంచి లేవలేకపోయేవారు. ప్రస్తుతం ఆయన మంచం దిగటమే లేదు. రోజులు లెక్కపెడుతూ పడివున్నారు.

ఇంతకీ ఆయన వయోవృద్ధుడు. ఆయనకు అలాటి దుర్గతి వచ్చినందుకు ఎవరూ ఆశ్చర్యపడ నక్కరలేదు. అది ప్రకృతిసిద్ధం అనుకోవచ్చు. అఖరుకి యమధర్మరాజుకి కూడా ఒక సాకు కావాలి గదా, "వాడు శ్లేష్మం అడ్డుపడి చచ్చాడు, వీడు జ్వరంవచ్చి చచ్చిపోయాడు" అని ఏదోఒక రోగంమీద నెపంవేసి యముడు తను ధర్మరాజు ననిపించు కుంటూ వుంటాడు. సరే దానికేం.

నాయనగారైతే వయోవృద్ధుడు కాని, నేను వయసులో వుంటి రాయి లాగ వున్నవాణ్ణేగా, అనారోగ్యమన్నది ఎరగనివాణ్ణేగా, మరి నా కెందుకు రావాలి? నేను. ఏ పనికీ. అక్కరకురాని వాణ్ణయి, జీవించడానికి కూడా తగనివాణ్ణి, ఎందుకు అవాలి?"

"ఏం మీ కేమయింది?" అన్నప్రశ్న అప్రయత్నంగానే వచ్చింది నా నోట.

"వినండి మరి, అదే చెప్పుకొస్తున్నాను. ఒక రోజున నాకు జ్వరం వచ్చింది. అంతకుముందురాత్రి నాటకానికివెళ్ళి చాలా సేపు మేలుకుని వుండడమే కారణం అనుకున్నాను. ఒకవేళ అది ప్రత్యక్ష కారణమూ, అసలు శరీరంలో ఏదో అంతర్గతంగా వున్నవ్యాధి అసలు కారణమూ అయివుండాలి. ఆఫీసులో పనిచేస్తూనేవున్నానూ, వున్నట్టుండి మూర్ఛలాగా కాళ్ళూ చేతులూ కొట్టుకోవడం ప్రారంభమయింది. నరికిన చెట్టులా. దిక్కుతెలియకుండా

పడిపోయాను. నోట నురుగులు వచ్చాయట. నాలిక పళ్ళమధ్య పడిపోయింది. ఆఫీసులో వున్నవాళ్ళందరూ నా చుట్టూ మూగారు. డాక్టరుని పిలిపించారు. ఆయన ఏవేవో వుపచారాలుచేసి నాకు తెలివి వచ్చేలాగచేశాడు. ఆఫీసు బంట్రోతుని తోడిచ్చి యింటివరకూ దిగబెట్టించారు.

నేను నాలుగు రోజులు సెలవుపెట్టాను. డాక్టరుదగ్గిర ఔషధం పుచ్చుకోవటం ప్రారంభించాను. 'గృహవైద్యం' అని చెప్పి బ్రాహ్మీకషాయం సేవిస్తున్నాను. బ్రాహ్మీతైలం తలకి మర్దనాచేయించుకుంటున్నాను. 4 రోజులయాక కాస్త బాగుపడ్డటనిపించగానే పనిలోకి వెళ్ళాను. గాడిలోపోయే బండికి ఏదో ఒకరాయి చక్రానికి తగిలితే ఒక్కక్షణం బండి తబ్బిబ్బు అయినట్లే ఈ జబ్బుకూడా నా జీవితాన్ని స్వల్పకాలం తబ్బిబ్బు చేసిందంతే. అని ధైర్యం తెచ్చుకున్నాను.

కాని, ఆ అంచనా పొరపాటు అని తర్వాత తెలిసివచ్చింది. అమాంతంగా వచ్చి, అంతట్లోనే అంతమయే ఆపదకాదు నాకు తటస్థించింది. శారీరకంగానూ, మానసికంగానూ జీర్ణించి, యిప్పుడు బయటకు వచ్చినది ఈ వ్యాధి. ఆ రోగం నా శరీరంలో ఎక్కడో శాశ్వతమయిన బస ఏర్పాటుచేసుకుని అప్పుడప్పుడు మాత్రం పైకివచ్చి నన్ను పలకరించటం సాగించింది. మళ్ళీ ఒక నెలరోజులు తిరగకుండా, అదేప్రకారం మూర్ఛ వచ్చింది శరీరం శోచనీయమయిన స్థితిలో పడింది. నా చుట్టూవున్న మనుషులు కంగారుపడి అటూయిటూపరుగెత్తారు. ఎటొచ్చీ ఈసారిమాత్రం నా అవస్థ ఆఫీసులోవాళ్ళ కళ్ళ పడలేదు. ఈసారి యింట్లోవున్న వాళ్ళకే ఆ దృశ్యం కనుపించింది.

నాన్నగారు కంగారుపడిపోయారు. ఇల్లాలికి నోరెండిపోయింది. నేనూ తెలివితప్పిన వాణ్ణయాను. మనసులో ఒక భయం పట్టుకుంది. ఈసారి పూర్తిగా ఒక నెల సెలవుపెట్టాను. ఔషధాలూ, యింజక్షనులూ వగైరా సర్వసేవలూ జరిగిపోతున్నాయి. అయినా మూడోసారి మూర్ఛ రావడం ఆగలేదు. సెలవు మళ్ళీ పొడిగించాను. నా లెక్కలోవున్న పెద్ద సెలవూ, అవసరపు సెలవురోజులూ అన్నీ వాడేశాను. ఇహ విధిలేక వుద్యోగంలోకి వెళ్ళాను.

కాని లోపల ప్రవేశించిన రుగ్మత శరీరాన్ని చాలా బలహీనంగా చేసేసింది. అంతకంటేకూడా, మనస్సునీ, బుద్ధినీ కూడా దుర్బలంగా చేసింది. అసలు యిన్నాళ్ళూ. నేను తెలివయినవాళ్ళక్రింద లెక్కకొచ్చే వాణ్ణి. ఆఫీసులో కాని యిప్పుడు రోజురోజుకీ ఆలోచించేశక్తి క్షీణించు కుంటూ వచ్చింది. పట్టుమని పది నిమిషాలు ఒక విషయంమీద లక్ష్యం నిలపలేక పోయేవాణ్ణి, అతి ప్రయత్నంమీద ఏకాగ్రత నిలుపగలిగితే, వెంటనే శరీరం అలిసిపోయేది. నాలుగు క్రోసులు నడిచి వచ్చినట్టు నీరసం వచ్చేది. కళ్ళు చీకట్లు కమ్మేవి. ముచ్చెమటలు పోసేవి. ఎంతో తీరికగా కూచుని రాద్దామన్నా, ఆఫీసు ఉత్తరాలలో ఒక్కటయినా, ఒక్కబిగిని రాయలేకపోయేవాణ్ణి ఇహ పని ఎక్కువగా వున్నప్పుడు, ఫైలు తెరిచి చూస్తే మనసుకి అర్థమే అయ్యేదికాదు. చేతులూ కాళ్ళూ చచ్చుపడిపోయేవి. సెలవు కూడా పెట్టకుండా, ఆఫీసుమానేసిన రోజులకి మినహాయింపు జరిగి, చివరకి నా చేతికి రాబోయే జీతపురాళ్ళ అంకెలు నా కళ్ళ ఎదట తాండవం చేసేవి. ఏనాడైనా ఆఫీసు పనిలో ఒత్తిడివల్లయినా, మనసులోవున్న ఆందోళన వల్లయినా, ఆఫీసులో వుండగా మూర్ఛవచ్చి పడిపోతానేమో అని ఒక భీతి పట్టుకుంది.

కొన్నాళ్ళకి నేను ఏ పనిచేసినా, ఆపని సరిగా తప్పులు లేకుండా వుంటుందనే నమ్మకమే పోయింది. దానికి కారణం ; నాబల్లమీంచి మరొ కరి దగ్గిరకి వెళ్ళిన కాగితాల్లో తప్పులు రోజురోజుకీ ఎక్కువవుతూ వచ్చేవి. హెడ్‌క్లర్కు లస ముక్కుమీదనున్న కళ్ళజోడు పైభాగంలోంచి నావేపు పదేపదే చూస్తూండేవాడు. చివరకి ఓ రోజున మేనేజరుగారు కబురంపించి, ఆయన గదిలోకి రప్పించుకున్నారు.

"పని చెయ్యలేకపోతే ఇంటిలోనే ఉండిపో" అని స్పష్టంగా చెప్పేశారు.

ఆ మాట చెవిని పడగానే, నా కాళ్ళల్లో సత్తువ ఇంకిపోయింది. ఆయన కళ్ళ యెదటే కుప్పగా కూలిపోయాను - మూర్ఛవచ్చి. ఆ రోజున ఆయన సన్నింటిదగ్గిర దిగబెట్టారు శాశ్వతంగా. ఉద్యోగం పోయింది. దాంతో ఇంటిలో ఇబ్బందులు ఎక్కువయ్యాయి. ఇంటిలో ముగ్గురు మనుషులం వున్నాం తినటానికి: సంపాదన దమ్మిడీ లేదు.

"ఎండిపోతున్న చెట్టు మళ్ళీ కొత్తకొమ్మ లేస్తుంది గనుకనా! నాకు ఔషధా లేం వద్దు .నీ ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకో; నువ్వు తొందరగా బాగుపడితే చాలు నాకు!" అన్నారు నాన్నగారు.

అవును నేను బాగుపడితే చాలు; నేను వయసులోఉన్నవాణ్ణి; వయసులోవున్న అమ్మాయి భర్తను; నాకు జీవితంమీది ఆశ వదల్లేదు వదల్లేను కూడాను. వారిచేతా వీరిచేతా డాక్టరుగార్కి చెప్పించీ స్వయంగా విన్నవించుకునీ వైద్యం నిరాటంకంగా చేయించుకుంటూనే వచ్చాను. నా పరిస్థితివిని. బొంబాయినుంచి అన్నయ్య నన్ను చూచిపోవడానికివచ్చాడు. వెళ్ళేటప్పుడు అతని ముఖంలో ఆదుర్దా కనిపించింది. తిరిగి వెళ్ళగానే 50 రూపాయిలు పంపెంచాడు. కాని నాకు పట్టుకున్న ఆకాశంఅంతా అనర్థానికి మాచికలు వేయాలంటే అది ఏ మూలకి చాలలేదు.

అంచేత ఓరోజున చేతినున్న ఉంగరం అమ్మేశాను. ఆ తర్వాత యింటిలో వున్న కాస్తంత వెండి సామానూ అమ్మేశాను. ఇన్సూరెన్సు పాలసీ మీద ఒక వందరూపాయలు అప్పు సంపాయించాను. అదీ జీర్ణమయిపోయింది. ఇన్నాళ్ళ నుంచీ, నా చేతిలో పడకుండా ఇంటిలో వున్న ఆస్తి, మా ఆవిడ వంటి మీద వున్న వస్తువులు. ఆవిడదగ్గర ఏవో నాలుగు నగ లున్నాయి. ఓ రోజున భయపడుతూ భయపడుతూనే వాటి ప్రస్తావన తెచ్చాను. ఆవిడ మాత్రం ఖంగుమని జవాబు చెప్పింది.

"అర్థమయింది మీ లక్షణం. మీమట్టుకు మీరు దరిద్రులయ్యారు. ఇప్పుడు నా నగలమీద పడింది మీ దృష్టి. నేను ఖచ్చితంగా చెబుతున్నాను. వీటిల్లో మీరు పెట్టినది ఒక్క పూస అయినా లేదు. నా వంటిమీద వున్న ప్రతిచిన్నమూ నాన్నగారు పెట్టిందే. ఇందులో గురివిందగింజ ఎత్తుకూడా మీకు దక్కదు. చీపురు పుల్లంత హక్కయినా లేదు మీకు నా నగలమీద!—"

నగలమీదమట్టుకే కాదు ఆరోజునుంచీ ఆవిడమీద కూడా ఏమీ హక్కులేదని అర్థమయింది నాకు. తన భర్తలో యిప్పుడు భర్తృత్వం ఏమీ మిగలలేదని తోచిం దావిడకి. తను విధవనయినట్టే భావించుకుంది. మూర్ఛవచ్చి ఎనిమిదేసి రోజులు అలాగే పడివుండేవాణ్ణి. ఇప్పుడు తన పునిస్త్రీతనం

కుంకంబొట్టు వరకే. జన్మపొడుగునా ఈ అయిదవతనమే అనుభవించాలి తను. ఇంక యీ యింట సుఖపడవచ్చుననే ఆశ అంతరించి పోయింది ఆవిడకి. ఆయన పేరునకట్టిన మంగళసూత్రం నిష్ప్రయోజనం.

పోగా, పోగా, యింట్లో చిందులు తొక్కడం మొదలెట్టిందావిడ! నాన్నగారిమీద కసురుకునేది. నన్ను అసలు లెక్కచేసేది కాదు. ఆవిడ మనసు ఒక నిర్ణయానికి రాలేక అటూ యిటూ ఊగడం మొదలెట్టింది. వుండడమూ వదలడమూ అనేది తేల్చుకోలేక పోయింది. నా సంగతి వదిలేసి తనని గురించే ఆలోచించుకుంటూండేది. నిర్ణయానికి వచ్చినరోజునే ట్రంకు పెట్టె సర్దుకుంది. తన చీరెలు రవికలు దువ్వెన కుంకం బరిణీ, అవీ యివీ పోగుచేసి పెట్టి నింపింది. ఈ హడావిడి అంతా ఏదో సాధారణ ప్రయాణానికి కాదని నా కర్థమయింది. అయినా నోరుతెరచి అడగకుండా ఉండలేకపోయాను.

"వసుధా ఏమి టీ ప్రయత్నమంతా? ఆవిడ అటు తిరిగి వుంది. మొఖం అటే వుంచి జవాబు చెప్పింది: "పుట్టింటి కెళుతున్నాను."

"ఎప్పు డొస్తావు తిరిగీ?"

"తిరిగి రా నింక. ఈ రోజువరకూ నే ననుభవించిన నిట్టూర్పులూ నిశ్వాసాలు చాలు. సుఖమూ చట్టుబండయూ లేకపోయినా, రెండుపూటలా, నాలుగు మెతుకులయినా..... మీరు ఎలాగా నీరసించి పోతున్నారు. పైగా అందర్నీ నీరసపడేట్టు చెయ్యడంకూడాను! ఇంతవరకు చాలా ఓర్చుకున్నాను. ఇహ నావల్లకాదు.'—

ఆవిడ పుట్టిల్లు "కల్యాణి" (పూనాకి 70 మైళ్ళలో వున్న వూరు). ఆవిడ గుర్రపుబండి పిల్చుకువచ్చి గుమ్మం ముందర ఆపించి, యింట్లోకి వచ్చి, ట్రంకుపెట్టె చేత్తో పుచ్చుకుంది. "వసూ! నన్ను విడిచిపెట్టి వెళిపోతున్నావు కదూ." నా దీనారవం కళ్ళవెంటకూడా ప్రవహిస్తోంది. నా శరీర దార్ఢ్యంమీద ఆధారపడగలననే నమ్మకం లేదు నాకు. మనసులోనూ పునాదులు కుంగిపోయినట్టే వుంది నాకు. ఈ సమయంలో ఆవిడ ఒక్కత్తే ఆధారంగా వుండెది. విసుగుకున్నా, కోపం తెచ్చుకున్నా, యింట్లో మసులుతూండేది. ఇప్పుడు ఆవిడ వెళ్ళిపోయిందంటే నేను సర్వవిధాలా దిక్కులేనివాణ్ణి అన్నమాట. నాకు రెక్కలు విరిగిపోయా యన్నమాట.

కాని ఆవిడ వెళుతూన్నప్పుడు. ఆవిడ నాతో ఒక్క ఆప్యాయ మయిన పలుకు పలకలేదు. ఆవిడకు, యిప్పుడు, నేను భర్తను ఎలాగా కాదు. చివరకు శత్రువునయినా కాను. అనాయాసంగా రెండు వేళ్ళతో ఏరిపారెయ్యగలిగిన డొక్క పొల్లుని. ఆవిడ ఎక్కిన గుర్రపుబండి కదిలింది. బండిలోవున్న ఆవిడా దూరమవుతోంది. నా కళ్ళు కరిగిపోతున్నాయి. కాని ఆవిడ కళ్ళు పొడిగానే వున్నాయి. ఆ వెళుతున్నపుడయినా నావేపుచూసి తన కళ్ళవెంట రెండు చుక్కలు రాలిస్తే, నాకు ఎంతో సముదాయింపుగా వుండేది. ఆవిడ వెళిపోయినా. శాశ్వతంగా వెళిపోయినా, ఆవిడలోవున్న స్త్రీత్వంలో నా భార్య ఇంకా బ్రతికేఉందని నాకు నమ్మక ముండేది. ఆ విధంగా నా దుఃఖంలోనే కొంత సుఖం అనుభవించి ఉండేవాణ్ణి!

కాని, ఆ రాణీగారు ఆ రెండు కన్నీటిచుక్కలుకూడా కరువే చేసింది నాకు.

"ఆవిడ నీ దగ్గర ఎందు కుండిపోవాలి?" అని అడగవచ్చు మీరు. "ఆవిడని పోషించేందుకుగాని, ఆవిడ జీవితంలో ఉపయోగపడేందుకు గాని నీకు సామర్థ్యం ఎక్కడుంది?" అంటారు మీరు. నేనూ ఆ మాటే అంటున్నాను. అప్పటి పరిస్థితి నిజంగా అంతే! కాని నాదగ్గర వుండిపోతే తన సామర్థ్యంతో అయినా తను బ్రతకగలిగేది. నేను ఇలా ఏ పనీచెయ్యలేని బలహీనుణ్ణయిపోతానని కలలోకూడా అనుకోలేదు. నేను బుద్ధిపూర్వకంగా ఆవిడ మెడకి ఉచ్చు వెయ్యలేదు. నా అదృష్టం అలా అఘోరించింది. అందుకు నేను మాత్రం ఏం చెయ్యగలను? అటువంటి సమయంలో ఆవిడ నాకు అండగావుంటే బాగుండేది. ఆవిడ మా యింటికి వచ్చినప్పుడు నా అప్పటి పరిస్థితులు తృప్తిగా వుండబట్టే వచ్చింది. కాని, భవిష్యత్తులో నాకు సంపదా ఆపదా వచ్చినా, అవి కూడా తను పంచుకోవాలసి వుంటుం దనీ, యికమీదట జీవితమంతా నాకు సహధర్మచారిణిగా వుండాలనే నైతిక నియమం పాటించాలనీ తెలిసీ వచ్చింది; అంతేనంటారా?

నేనూ ప్రపంచకంలో కాపురాలు ఎలా వుంటున్నాయో గమ నించాను. నాకూ కళ్ళున్నాయి. ప్రతి కాపురమూ యింద్రుడి నందన వనంలో నివసించటం లేదు. దారిద్ర్యమూ, యితర యిబ్బందులూ అంద

రికీ వచ్చేవే. అల్లాగే. ఒక్కొక్క యిల్లాలికి, ఒక్కొక్క సోమరిపోతో, జులాయిమనిషో, మందబుద్ధిగలవాడో, అంగవికలుడో కూడా భర్తగా తటస్థ పడుతూంటాడు. అటువంటి యిల్లాలు తక్షణం కాలు రూడించేసి చక్కా పోతోందా? ఉద్యోగంచేసో, కూలిపనిచేసుకునో, తనపొట్ట గడుపుకుంటోంది. అలాగే అతనికీ రెండుమెతుకులు పడేస్తోంది. ఇల్లు వదలిపెట్టి ఊర్ధ్వాయ్యేర్తిశే బ్రహ్మణేనమః" అని దారిపట్టటంలేదు. పనికిరాని భర్తని పోషించుకుంటూ ఉండిపోయి; ఏమయినా సుఖపడుతుందా అటువంటి యిల్లాలు ?

కాని కర్తవ్యం, ధర్మం అంటూ ఒకటి వున్నదనీ, దానికి కట్టుబడి వుండాలనీ గ్రహించి అవస్థలు పడుతోంది. మనసు నిలదొక్కుకుం టోంది ! నిలబెడుతోంది ! !

మెత్తటి పరుపుమీంచి లేపి వడ్డించిన విస్తరి ముందుకు తీసుకువచ్చి పీఁ మీదకూర్చో బెట్టి. సదా సర్వకాలమూ, తన పోషణ జరిగిపోతుందనే నమ్మకంతోటే వెళ్ళిం దనుకున్నారా, నా భార్య పుట్టింటికి ?

ఎక్కడో ఉద్యోగంలో చేరిందని, నాకు తరవాత తరవాత తెలిసింది. ఆ ఉద్యోగమే యిక్కడచేసి, దొరికిన దేదో, పల్చనిదో, చిక్కనిదో ఆ గంజి మాతో సహా పంచుకునుంటే నే నావిడ కెంత కృతజ్ఞుణ్ణిగా వుండేవాణ్ణి.

"ఏమండీ ! ఏమంటారు మీరు ? నేను ఆజన్మాంతమూ ఆవిడని అలాగే వుండనిచ్చేవాడినా ? కష్టంచేసి ఆవిడ సంపాయించిన కబళం మింగుతూ ఉండిపోవాలని నా కెప్పుడూ ఉద్దేశం లేదు. నా భవిష్యత్తు ఏమిటో నా కిప్పటికి నిశ్చయంగా తెలిసిపోయింది. నన్నో నాలుగు రోజులు ఆవిడ సంరక్షించి వుంటే నా అంతట నేనే చెప్పేవాణ్ణి. ఆవిడతో-"వసూ, నేను చచ్చిపోయేదాకా వేచివుండనక్కరలేదు. నే బ్రతికుండగానే, నా మనస్ఫూర్తిగా నీ కనుమతి యిస్తున్నాను. నీ కింకెక్కడయినా సుఖంగా వుంటుందని తోస్తే అక్కడికి నిస్సంశయంగా వెళ్లు. ఇంకెక్కడయినా, దృఢమయిన పచ్చనిమాను కనిపిస్తే ఆ నీడని ఆశ్రయించు. నిన్ను ఆశీర్వదించే వాళ్ళల్లో నేనే ప్రథముణ్ణి అవుతాను —"

ఆవిడ నన్ను విడిచిపెట్టి వెళిపోయిందని నాకేం కష్టంలేదు. నేను దుఃఖపడటమూ లేదు. కాని ఆవిడ తన ధర్మాన్ని, తన ప్రేమని తోసేసి వెళిపోయింది కదా, అనే నా చింత. ప్రతి మనిషికీ తను సుఖపడాలనీ, తనకు మేలు కలగాలనీ వాంఛ వుండటం స్వాభావికం. కాని మరోవ్యక్తిని విసర్జించి దుఃఖపెట్టి తను సుఖపడాలనుకోవడమే నా కర్థంగాని విషయం. అదే, యింకోవ్యక్తితో జతగలిసి అంతరంగం అర్పించి సుఖపడాలని వెళిపోతే నే నర్థం చేసుకునేవాణ్ణి.

కాని నా భార్య రెండోరకం మనిషికాదు. ఆ తరవాత నే నెప్పుడూ ఆవిడని చూడటానికి వెళ్ళలేదు. ఆవిడేవస్తే బాగుణ్ణనిమాత్రం అనిపించేది. అందుకోసం నేను ఒకటి రెండు వుత్తరాలు కూడా వ్రాశాను. నా మనసంతా విప్పిచెబుతూ వ్రాశాను. కాని ఆవిడ నాలుగు ముక్కలు రాయ నందువల్ల ఇక వూరుకున్నాను. అప్పుడప్పుడు నా కావిడమీద ఆపేక్ష ప్రేమా ఉబుకుతుంటాయి. కాని ఆ ప్రేమలో పురుషార్థం లేదు. అది వానపాము. ఆదిశేషుడి కూతుర్ని ప్రేమించటంలాటిది. వానపాము బ్రతికే వున్నా చచ్చినదాని గోటే సమానం. తన నిరాశకొద్దీ అది నాలుగుచుక్కలు కన్నీళ్ళు రాల్చినా, తక్షణం మెలికలు తిరిగి ప్రాణం విడిచేస్తుంది.

ఆ తరువాత యింకో రెండు మూడు ఆఫీసుల్లో ఉద్యోగం చేశాను. కాని ఆ ఆఫీసులు, ప్రైవేటు కంపెనీలు. ప్రతిచోటాకూడా, నేను ఆఫీసులో పని చేస్తూచేస్తూ వుండగానే, కాళ్ళు చేతులు వంకరలు పోవడమూ, నోట నురుగు రావటమూ తటస్థించి — నా వ్యాధి అందరికీ బట్టబయలయి పోయింది. అటువంటి నిరుపయోగికి యింకెవ రుద్యోగం యిస్తారు? ఒక వేళ ఆఫీసులోనే హరీ అంటే అందరికీ ప్రాణసంకటం కదా!

ఆకలి తహతహ ఒకప్రక్క. జీవించాలనే కోరిక ఒక ప్రక్క, చేయి చాపడానికి సిగ్గు ఒకప్రక్కాను. దేహి అని అడగాలంటే ప్రాణం కడంటి పోతుంది. అదీకాక, దేహీ అనగానే తెచ్చిపడేశేవాడు మాత్రం ఏరీ? యిహ అన్ని విధాలా నిస్పృహయ్యిణ్ణయి ఈ జోలి బుజాన్న వేసు కున్నాను. నాకోసం కాదు, నా తండ్రిగారి కోసం. ఆయన బొందిలో ప్రాణం వున్నన్నాళ్ళూ నేను ఏ పని చేశయినా, ఆయనకి రెండు మెతుకులు

పెట్టితీరాలి. ఎన్ని అవమానాలయినా సహించి, ఎన్ని తిట్లయినా తిని, ఆ కార్యం చేసితీరాలి. మాదాకవళం అడుక్కోవడం మంచి ఎత్తే అని అనిపించవచ్చు మీకు: "వెధవలు తినటం, హాయిగా పడుకోవటం యింకేం పనుందీ" అనిపించవచ్చు.

ఇదుగో, ఈ జోలిలో వున్న దేమిటో చూడండి. ఆ చపాతీ ముక్కలు లెక్కపెట్టండి ఎనిమి దున్నాయా, పదివున్నాయా? పాతిక యిళ్ళముందు ముష్టి అడిగితే ఈ మాత్రం అయినా పోగయ్యాయి. వీటితో మా యిద్దరి పొట్టలూ ఏ మాత్రం నిండుతాయో మీరే ఆలోచించండి. ఇంకో పది పన్నెం డిళ్ళముందర ప్రాధేయపడితేనేగాని నే నింటికి వెళ్ళడానికి వీల్లేదు.

ఇంటికి వెళ్ళాలని బయలు దేరినా, యింటికి సురక్షితంగా చేరతానని నమ్మకంగా ఎవరు చెప్పగలరు? నిన్న నేమయిందో తెలుసా? ముష్టి ముగించుకుని యింటివేపు వెళుతున్నాను. శనివారప్పేట చివరి కెళ్ళేటప్పటికి కొంచెం తల దిమ్ముగావుండటం మొదలుపెట్టింది. అక్కడే నడివీధిలో పడిపోయాను. తలకి దెబ్బతగిలింది. కాళ్ళు చేతులూ దబా దబా బాదు కున్నాయి. కంటి ఎముకమీద దెబ్బతగిలింది. యిదుగో చూడండి గాయం.

పాతిక ముప్పైమంది నా చుట్టూ పోగయ్యారు. వాళ్ళు నాకు ఏం వైద్యం చేసి తెలివి తెప్పించారో తెలుసా మీకు? ముక్కుదగ్గిర చెప్పు పెట్టారు. ఎవరో ఎవర్తోటో అన్నారుట: "చెప్పు ముక్కుదగ్గిర పెట్టం డోయ్! చర్మం వాసన తగిల్తే చటుక్కున తెలివస్తుందీ" అని. అది విన్న దయామయుడు తక్షణం అంత పనీ చేశాడు: నేను పట్టుబట్ట కట్టుకుని, పాదరక్షలు లేకుండా మడిగా, సంప్రదాయంగా భిక్షకి రావడమూ, వాళ్ళు నా మొఖంమీద పాతచెప్పు పుంచటమూను. యిది అదృష్టమంటారా? గ్రహచార మంటారా?

ఇదండీ నా మాదాకవళం కథ. ఇదీ దాదాపు అయిపోవచ్చింది లెండి. నాన్నగారు యింకో కొన్ని రోజులపాటే బతగావుంటా రంతే: ఎంత తీసుకున్నా మహాఅయితే ఆరు నెలలు. ఆ తరవాత యీ వృత్తి ఆగిపోతుంది. ఆ తరవాత నేను కాలు కదపక్కర లేదు. ఆ తరవాత నేను

నోటంట 'ఓం భవతీ' అనక్కరలేదు. ఇది కేవలం ఆయనకోసం, నా పొట్ట నింపుకోటానికి దేహి అంటానా? ఛ ఛ!

ఆ తరవాత నాకథ మీ చెవిని పడితే దాని ధోరణి వేరుగావుంటుంది. ఇప్పుడే ఒకసారి నాపేరు విని వుంచుకోండి. "మనోహర అనంత దేశపాండే". ప్రతి వార్తాపత్రికా, పేజీమధ్యని బోర్డరుకట్టి వేస్తుంది ఆ వార్త. అప్పుడు చదువుదురుగాని.

సరే మరి నే వస్తా. నాన్నగారి పొట్టలో గడియారం గంటలు కొడుతూంటుంది. ఇంకో నాలుగు యిళ్ళముందు అడిగి చూడాలని వుంది. అసలు యిక్కడ నేను యింతసేపు కూచునేవాణ్ణేగాను. ఇదంతా ఏకరువూ పెట్టేవాణ్ణీగాను. కాని మీరు వేదాంతం మాట్లాడారు. మీకు మానసతత్వమూ సిద్ధాంత సూత్రాలూ ముఖ్యం అన్నారు. అందుచేత యింతసేపు చెప్పవలసి వచ్చింది. మీ కాలం వృథాచేసి శ్రమ యిచ్చాను.

కాని మీ గృహిణికి తెలిసిన సూత్రం ఒక్కటే. చిన్నప్పుడు నేర్చుకున్న సూత్రం రెండు రూములప్పుడు గుమ్మంలో కెవరయినా వస్తే జోలిలో ఏ కాస్తో వెయ్యాలని, ఆవిడకి అంతే తెలుసు! అంతకంటె ఆవిడకి జిజ్ఞాసా లేదు. తర్కించడమూ లేదు. అలాటివాళ్లు ప్రపంచకంలో యింకో పదిమందుంటే బాగుండుననిపిస్తుంది నాకు.

కోపం తెచ్చుకోకండేం మీరు. మీరేదో మనస్తత్వమూ మానవ నైజమూ శోధించబోయారు మీకు దొరికిం దేమిటి పాపం: ఒక నిర్భాగ్యుడి శోకమయ జీవిత కథాశ్రవణం ఇది వింటూ మీరు ఖేదపడ్డారు. చెబుతూ నేను బాధపడ్డాను. మీరు తత్వపరిశోధనకి తాపత్రయ పడ్డారు. కాని, కాని, ఇప్పుడు తెలిసికొన్నదాని కంతకీ ఏదయినా ఉపాయం చెప్పగలరా మీరు? ఈ సమస్యలకి విరుగుడు చెప్పగలరా. ఊఁ? సెలవా మరి! కోపం తెచ్చుకోకండెం! నే వెళ్ళి వస్తా, ఇంక అట్టేనాళ్ళు లేదులెండి!

అతడు. ఆ గుడ్డమడత, మళ్ళీ తడుపుకుని నెత్తిమీద వేసుకుని నడచి చక్కా పోయాడు. నేనేదో వేదాంతం లేవదీశాను. అతను మిట్ట

మధ్యాహ్నం నా మనస్వస్థతకి స్వస్తిచెప్పి తన దారిని తను పోయాడు. అతని మాటలు రోజురోజంతా నా చెవుల్లో మోగుతూనే వుండిపోయాయి.

"మీ రేదయినా విరుగుడు చెప్పగలరా? ఊఁ చెప్పగలరా ఏం, చెప్పగలరా ఏమిటి?



140

# మా నూతన ప్రచురణలు

| | | |
|---|---|---|
| అతడు ఆమె | వుప్పల లక్ష్మణరావు | 8.00 |
| 1 + 1 = 1 మొదలైన రేడియో నాటికలు | శ్రీ శ్రీ | 2.00 |
| మూడు యాభయిలు | శ్రీ శ్రీ | 1.00 |
| పేకముక్కలు | కిషన్‌చందర్ | 5.00 |
| గంగు | వట్టికోట ఆళ్వారుస్వామి | 5.00 |
| దివోదాసు | రాహుల్జీ | 4.00 |
| రంగభూమి | ప్రేమ్‌చంద్ | 15.00 |
| సప్తపది | వివిధ రచయితలు | 1.00 |
| పన్నీరు కన్నీరు | నందివాడ భీమారావు | 1.50 |
| కండక్టరుకథ - పెద్దిగాడి మేక | పెండ్సే | 1.50 |
| జోడెద్దులు | ప్రేమచంద్ | 1.50 |
| చదరంగయోధులు | ,, | 1.50 |
| మరో ఆరు చిత్రాలు | రాచకొండ విశ్వనాథశాస్త్రి | 1.50 |

---

విశాలాంధ్ర ప్రచురణాలయం
విజయవాడ - 4

